**శ్రీమతే రామానుజాయ నమః**

# ప్రవేశిక

**యద్గోభిః కలిదోషాంధకారో విద్రావితో హఠాత్ ।**
**నమోஉస్తు పరకాలాయ సూరయే లోకబంధవే ॥**

శ్రీ వైష్ణవసంప్రదాయసాహిత్యములో ద్రావిడవేదముగా ప్రసిద్ధిచెందిన, నాలాయిరమనబడు 24 మధురభక్తిసాహిత్య ప్రబంధములను **" మయఱ్వర మదినలమ్ అరుళినన్** " అని కీర్తింపబడు రీతిలో భగవత్ప్రసాదలబ్ధ నిర్దుష్ట భక్తిరూపాపన్నజ్ఞానమును కల దివ్యసూరులనబడు ఆళ్వార్లు వెలయించిరి. ఈ సాహిత్యమును ముదలాయిరము, పెరియ తిరుమొళ్ళి, ఇయఱ్పా, తిరువాయ్‌మొళ్ళి అను నాల్గు విభాగములుగా నాథమునులు వర్గీకరించిరి. శిఱియతిరుమడల్ అను ప్రస్తుత ప్రబంధము తృతీయసహస్రమగు ఇయఱ్పాలో తొమ్మిదియవ ప్రబంధముగా కూర్పబడినది. **"మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు మజ్గైయర్ కోన్ ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త"** అని మణవాళ మహామునులు నుడివినరీతిలో నమ్మాళ్వార్ ప్రణీతములగు తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొళ్ళి,- అనబడు నాల్గుప్రబంధములు ఋగ్యజురథర్వణసామవేదరూపచతుర్వేదసారములుగా ప్రసిద్ధిచెందగా, తిరుమజ్గైయాళ్వార్ ప్రోక్తములగు పెరియ తిరుమొళ్ళి, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెళ్ళుక్కూఱ్ఱిరుక్కై, శిఱియతిరుమడల్, పెరియ తిరుమడల్, తిరునెడున్దాణ్డకమ్ అను ప్రబంధములు ఆఱును వేదాంగసారములుగా కీర్తింపబడుచున్నవి.

తిరుమజ్గై యాళ్వార్లు, భగవానుడు నిర్హేతుకకృపతో తన స్వరూపరూపగుణ విభూతులను తమకు యథాతథముగా దర్శింపజేయగా, ఆ మానసానుభవమును పెరియతిరుమొళ్ళి, తిరుక్కుఱున్దాణ్డకము అను మొదటిరెండు ప్రబంధములలో వ్యక్తీకరించిరి. దానితో తృప్తి చెందని ఆళ్వార్లకు **"అయత్పిలన్ అలగ్గ్రువన్ తఝువువన్ "** అనునట్లు బాహ్యేంద్రియ సంశ్లేషాపేక్ష కల్గినది. అందులకై వారు తిరువెళ్ళుక్కూఱ్ఱిరుక్కై అను మూడవ ప్రబంధములో తిరుక్కుడన్దై దివ్యక్షేత్రమును అధివసించియున్న అర్చామూర్తి విషయమున శరణుజొచ్చిరి. దానివలన కూడ తమఅభీష్టము నెఱవేరకపోవుటచే తమ స్వరూపమగు పారతంత్ర్యమును సైతము వదలిపెట్టి, స్వామిని తన వద్దకు వచ్చునట్లు చేయవలెను అను త్వరాతిశయము ఏర్పడగా, దానిని శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అను రెండు ప్రబంధములలో వ్యక్తము చేసిరి. చివరిది అగు తిరునెడున్దాణ్డకములో భగవదనుభవమును తాము పరిపూర్ణముగా పొందుటను తెలిపిరి. రెండు ప్రబంధములలో మడల్‌ను అనుష్ఠించుట అను ఒకే అంశము కావున, ఇందులకు రెండు ప్రబంధములు ఎందులకు ? పునరుక్తి అగును కదా ! అనగా, శిఱియ తిరుమడల్ ప్రబంధములో ఆళ్వార్లు శ్రీకృష్ణుని విషయమున



మడల్ అనుష్ఠించగా, ఆ అవతారము కాలాంతరములో సంభవించినదగుటచే, శ్రీకృష్ణుడు తానుకూడ మడల్ఎత్తు సాహసి అగుట చేతను ఆ ప్రయత్నము ఫలింపలేదు. అపుడు సౌలభ్యపరాకాష్ఠ అనతగినది, తమకాలములో వేంచేసియున్నదియును అగు అర్చామూర్తి విషయమున ఆళ్వార్లు పెరియ తిరుమడల్‌లో మడల్‌ను ఎత్తిరి. కావున పునరుక్తి ప్రసంగమే లేదు - అని పెద్దలు సమాధానించిరి. భగవానునిపట్ల భక్తి అతిశయించినపుడు **"భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి భావబంధప్రథిమ్నా "** అనునట్లు స్త్రీ భావమును పొందుట ఆళ్వార్లవంటి మహనీయుల విషయమున ప్రసిద్ధము. ఇట్టి భావన స్పష్టముగా నమ్మాళ్వార్లు పెరియాళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, తిరుమజ్గై ఆళ్వార్ల విషయమున కన్పించుచున్నను, ఇది సర్వదివ్యసూరిసాధారణమనుటను **"వెళ్పెన్ణి వేజ్గడమ్ పాడుమ్"** ఇత్యాది సూక్తులను పూర్వాచార్యులు స్త్రీ భావనాపరముగా వ్యాఖ్యానించుటనుబట్టి భావింపవచ్చును. ఇట్టి స్త్రీభావన మాతృ-సఖీ - నాయికా భావనల రూపమున త్రివిధము. వీనిలో మాతృభావన భగవదనన్యార్హశేషత్వమను జీవస్వరూపమును నిర్దేశింపగా, సఖీభావన అనన్యశరణత్వమును, నాయికాభావన అనన్యభోగత్వమును తెలుపుచున్నదని ఆచార్యుల నిర్వాహము. ఇట్లు **"ప్రజ్ఞా త్రైకాలికీ మతా "** అనునట్లు ఈ మూడు భావనలు జీవస్వరూపగతములు కావున నిత్యములు; సహజములు; ఒకదాని వెంట వేరొరకటి యుండునవియును. ఈ అంశమును ప్రకృత ప్రబంధములోని మాతృ-సఖీ- నాయికా వచనములు స్పష్టము చేయుచున్నవి.

దివ్యసూరులు నాయికాభావనను పొందినపుడు కల్గు మానసికానుభవములలో **"మడలెడుక్కై"** అనబడు ప్రక్రియావిశేషమొకటి ద్రావిడప్రబంధములో సుప్రసిద్ధము. ఇది ప్రధానముగా ద్రావిడాలంకార శాస్త్రప్రక్రియకు చెందినది అయినను దీని మూలము సంస్కృత సాహిత్యములో కలదనుటను **"మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్"** అని పెరియతిరుమడల్‌లో ఆళ్వార్లే సెలవిచ్చిరి. **"పేశిఱ్ఱేపేశలల్లాల్"** అను రీతిలో దివ్యసూరులసూక్తులలోగల భావ-అనుభవ సామ్యములు సుప్రసిద్ధములు కదా ! **"మాశఱుశోది"** అను (5-3) తిరువాయ్‌మొళ్ళి దశకములో నమ్మాళ్వార్లు **"యామ్ మడలూర్న్దు"** అనుచు తాము మడల్‌ను భగవానుని విషయమున అనుష్ఠింపవలెనని నిశ్చయించుకొన్నట్లు తెలిపిరి. ఇట్టి భావసామ్యమునే తిరుమజ్గైయాళ్వార్లు మడల్ ప్రబంధములు రెండిటిలో తమదైన శైలిలో వివరించిరి. ఈ మడల్ ప్రక్రియకు సంబంధించిన కొన్ని అంశములు సంగ్రహముగా ఇచట విన్నవింపబడుచున్నవి.

**మడల్ :-** ప్రాచీనతమిళ ఆలంకారిక సంప్రదాయమున **"మడల్"** అనునది ఒక ప్రక్రియా విశేషము. ఇదియే అనంతరము తమిళభక్తిసాహిత్యములో నూతనపరిణామమును పొంది ప్రత్యేకశాఖగా వర్ధిల్లినది. ఈ విధముగా వృద్ధిచెందిన మడల్‌శాఖలో తిరుమజ్గైయాళ్వార్లు

అనుగ్రహించిన శితియతిరుమడల్, పెరియ తిరుమడల్ అను రెండు ప్రబంధములు మొట్టమొదటివి అనవచ్చును – అని ద్రావిడసాహిత్యవేత్తల అభిప్రాయము.

**"మడల్" అనగా ఏమి ? – "మడల్"** అను ద్రావిడపదమునకు "దళము – రేకు" అనునవి సామాన్యార్థములు. ఈ పదము కొమ్మలనుకల స్థావరములకును పేరు అని తొల్‌కాప్పియము తెలుపుచున్నది. ఇది తాటిమట్టకు, అరటిమట్టకు (పనైమడల్, వాళ్ఱైమడల్, మడల్‌మా) మొదలగు సమాస పదములలో ఈ పదము కానవచ్చుచున్నది. తిరుమఙ్గైయాళ్వార్ల పెరియతిరుమొళ్ఱి పాశురములలో (6–9–1, 8–3–6, 9–3–6, 9–4–1) పెరియాళ్వార్‌తిరుమొళ్ఱిలో (4–8–6) ఈ పదము తాటిమట్ట, పూరేకు అను అర్థములలో ప్రయోగింపబడినది. కాని, ప్రధానముగా తాటిమట్ట అను అర్థములో నే ప్రసిద్ధమైయున్నది. ఈ అర్థములు కేవలము భాషాపరమైనవి.

ఇక, అలంకారిక శాస్త్రానుసారము ఈ పదము శృంగారరసమునకు చెందిన ఒకానొక ప్రక్రియకుగల పేరు. తాము కోఱిన నాయికను పొందలేని దశలో "మడల్ ఎక్కి అయినను ఆమెను పొందెదను" అని నాయకుడు చెప్పురీతిలో ఈ ప్రక్రియ (తుఱై) ఉన్నది. అతడు ఈ విధముగా మడల్ ఎత్తవలెనని నిర్ణయించుకున్నపుడు, తాటిమట్టలను గుఱ్ఱము రూపమున మలచి, దానిపై ఎక్కి (చేతితో తాటిమట్టను పట్టి శరీరమును గీఱుకొనుచు) పిచ్చివానివలె ఊరి నడుమ తిరుగుచు. తాను ప్రేమించు నాయిక తనను అన్యాయముగా తిరస్కరించినదను విషయమును బట్టబయలు చేయుటయే ఇందలి తాత్పర్యము. అతడీ విధముగా మడల్ ఎత్తి, బాధపడుటను చూచి ఊరిలోని పెద్దలు జాలిపడి, అతని ప్రేమను గుర్తించి, అతనికి సహాయపడగా, నాయిక తల్లిదండ్రులను తమ కుమార్తెను అతనికి ఇచ్చి వివాహము చేయుదురు. ఈ విధముగా తన ప్రేయసిని పొందుటకై తనను తాను శిక్షించుకొను ప్రేమికుని స్థితిని **"మడల్ ఊర్‌తల్"** అని, **"మడల్ మా ఏర్‌తల్"** అనియును అందురు.

**మడల్‌ను గూర్చి తొల్‌కాప్పియమ్ ఏమన్నది ?**

మడల్‌నుగూర్చి ప్రాచీనతమిళగంథమగు తొల్‌కాప్పియము తెలుపుచు మడల్ ఎక్కుట సద్వంశమునకు తగినది, కాని, స్త్రీలకు ఎంతమాత్రము అది తగదని నొక్కి చెప్పినది. **"ఏఱియ మడఱ్ఱిఱమ్ . . . శెప్పియ నాన్గుమ్ పెరున్దిణైక్కుఱిప్పే"**, (తొల్–పొరుళ్–54) అనుట ద్వారా మడల్ గొప్ప వంశమునకు తగినది అని, **"ఎత్తిణై మరుఙ్గినుమ్ మకడూఉ మడన్‌మేల్ పొఱ్ఱుదై నెఱిమై ఇన్మైయాన్"** (తొల్ – పొరుళ్ –38) అనుచు దీనిని స్త్రీలు ఆచరింపరాదనియు తెలిపినది. ఈ సూక్తిని వ్యాఖ్యానించుచు ఇళమ్ పురణర్ **"మకడూఉ మడలేఱుతల్ ఇల్లైయెనవే ఆడు ఉ మడలేఱుతల్ ఉణ్డు ఎన్బదు పెఱ్ఱామ్"** అనుచు స్త్రీలకు మడల్ ఆచరించుట తగదనుటవలన మగవారికి ఇది తగునని ఏర్పడుచున్నదని వివరించెను.



**మడఱ్ఱుఱ్ఱు** ః– మడల్‌ను ఎక్కు యోగ్యతనుకల యువకుడు **"మడల్ ఊర్‌వేన్"** అని పల్కుటకు **"మడఱ్ఱుఱ్ఱు"** అని పేరు. ఇట్లు ప్రేమికుడు మడఱ్ఱుఱ్ఱును పల్కుటను గూర్చి తొల్‌కాప్పియములోని – **"మెయ్ తొట్టు ప్పయిఱల్ పొయ్ పారాట్టల్"** అనుచు ప్రారంభమగు పాశురము తెలుపుచున్నది. ఆ పాశురము చివరలో నాయకుడు మడల్ ఎత్తుటకు గల కారణమును వివరింపబడినది. ప్రస్తుత ప్రబంధములోని **"ఊరాతొళ్ళియేన్ నాన్ వారార్ పూమ్ పెణ్ణైమడల్"** అను సూక్తి కూడ మడఱ్ఱుఱ్ఱునకు ఉదాహరణమే. విశేషమేమనగా – ఇది నాయకుని వచనముగాకాక, నాయికావచనమై యుండుట. ఇట్లు ప్రేమికుడు తాను మడల్‌ను ఎక్కెదనని పల్కుట నిజముగా తాను అట్లు చేయు ఉద్దేశ్యముతో కాక, అట్లు పల్కినచో ఊరిలోని పెద్దలు కాని, బంధువులు కాని, ఆ దేశప్రభువుకాని తనకు సహాయపడుదురను భావనతోనే కావున, ఇది అసత్యభాషణము **"పొయ్ తలై యెడుత్త మడల్"** (తొల్ – పొరుళ్ – 99) అను సూక్తి ద్వారా తొల్‌కాప్పియము తెల్పినది.

**సంఘవాఙ్మయములో మడల్‌సాహిత్యము –** మడల్‌నుగూర్చిన మరిన్ని విస్తృతమైన అంశములు సంఘవాఙ్మయములో గమనింపవచ్చును. **"మడల్ పాడియ మాతఙ్గీరనార్"** అను ప్రసిద్ధిపొందిన సంఘకాలమునకుచెందిన కవి పాడిన రెండు పద్యములు కలవు. అట్లే సంఘవాఙ్మయములో **"మడల్‌మా"** గూర్చిన పాశురములు 13 కన్పించుచున్నవి. వానిలో ఇంచుమించుగా అన్నియు నాయకుడు మడల్ ఎక్కుటను గూర్చియే ఉన్నను, ఒకే ఒక్క పాశురములో (342) మాత్రము నాయకితో ఆమె సఖి నాయకుడు మడల్ ఎక్కదలచినట్లు పల్కి, ఆమెను నాయకుని ప్రేమను అంగీకరించునట్లుచేయు రీతిలో ఉన్నది. కాని, తిరుక్కుఱళ్ మడల్‌ను అనుష్ఠించుట లజ్జాహీనమగు కార్యముగానే లెక్కించినది. తొల్‌కాప్పియమ్‌లోవలెనే తిరుక్కుఱళ్‌లో కూడా నాయకుడు "మడల్ ఎక్కెదను, ఎక్కెదను" అని పలుకుటయే తప్ప వాస్తవముగా దానిని అనుష్ఠింపరాదనియే తెలుపబడినది. అట్లే , స్త్రీలు మడల్ అనుష్ఠింపకూడదనుటను తిరుక్కుఱళ్ **"కడలన్న కామ ముఴ్ఱిన్దుమ్ మడలేఱా ప్పెణ్ణి ఱ్పెరున్దక్కతిల్"** అను కుఱళ్‌ద్వారా తెలుపుచున్నది. **"కలిత్తొకై"** అను గ్రంథములోని 141 వ పాశురము నాయకుడు మడల్ అనుష్ఠింపగా చూచిన నాయకి బంధువులు భయపడి ఆమెను తీసికొనివచ్చి, నాయకునకు అప్పగించినట్లు తెలుపుచుండుటనుబట్టి, కాలక్రమమున మడల్ ఎక్కెదనను కేవలము మాట మాత్రమే కాక, వాస్తవముగా దానిని అనుష్ఠించుటయును జరిగినదనుటను తెలుపుచున్నదని కొందఱి పరిశీలకుల అభిప్రాయము. ఈ పాశురమువలన మడల్‌ను అనుష్ఠించుటద్వారా నాయకుడు తాను వలచిన నాయకిని పొందుటయు తెలుపబడినది. ఇచట గమనింపతగిన అంశములు కొన్ని కలవు. ఈ మడల్‌ను అనుష్ఠించుట పరస్పరానురాగమును కల్గినవారి విషయముననే చెల్లును. లేనిచో **"ఏకత్రైవానురాగ శ్చేత్"** అను రసాభాసయే అగును. తాను కోరు నాయకిని

చేరుటకు కల్గిన అడ్డంకులను దాటుటకు ఈ మడల్ ఒక సాధనము అగుచున్నది. రహస్యసంగమముద్వారా చిత్తమును దోచుకొన్న నాయకినిగూర్చి తనకు గల ప్రేమను ఊరిలోని వారు అందఱును తెలియునట్లుచేయు ప్రయత్నముగను అగుచున్నది. అందుచే, తనను ఇష్టపడని స్త్రీని కోఱి, ఒకడు మడల్‌ను ఎక్కినట్లుగా గాని, అట్టి మడల్‌కు భయపడి తల్లిదండ్రులు కన్యాదానమును చేసినట్లుగాని తమిళసాహిత్యములో ఉదాహరణలు లేవు.

**సంఘసాహిత్యములోని మరికొన్ని విశేషములు :- "మడల్ మా"** అనగా తాటిమట్టలతో నిర్మింపబడిన గుఱ్ఱము ఆకారములోని వాహనముగానే తొల్‌కాప్పియములో చెప్పబడినది. మడల్‌ను ఎక్కు విధానము కాని, మడల్ మా నిర్మాణప్రకారము కాని, మడల్‌ను ఎక్కు నాయకుని అలంకారమునుగూర్చి కాని, అందు విశేషించి వివరింపబడలేదు. కాని, మిగిలిన సంఘసాహిత్యములో, వ్యాఖ్యాకారుల వివరణలలో మడల్ అలంకారమునుగూర్చిన వివరములు కొన్ని కన్పించుచున్నవి. సంఘకాలములోని సాహిత్యము చూపుకొన్ని అంశములు ఇచట స్మరణీయములు. కామాతురతను కలవాడు మడల్‌ను ఎక్కవలెనని నిశ్చయించుకొనును. అట్లు నిశ్చయించుకొన్నవాడు తాటిమట్టలతో గుఱ్ఱమును నిర్మించుకొనును. అది గడ్డిని మేయని గుఱ్ఱము అయినను దానిని అతడు నిజమైన గుఱ్ఱముతో సమానముగానే తలచును. ఆ గుఱ్ఱమును కామసముద్రమును దాటుటకు తగిన పడవగా తలచును. **"కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు"** అని కదా మహాకవి వాక్కు. ఆ గుఱ్ఱమునకు ఒక గంటను కట్టును. ఆవారమ్ (గడ్డి) పూవులతో దానిని అలంకరించును. మడల్ ఎత్తు తాను ఎముకల మాలను మెడలో ధరించును. తలలో ఎరుక్కపూల మాలను వేసికొనును. అతడు ధరించు పూలు అన్నియు ఎంతమాత్రము పనికిరానివి. ఇట్టి వేషముతో, లజ్జావిహీనుడై మడల్‌ను ఎక్కును. ఈ గుఱ్ఱమును చిన్నపిల్లలు లాగుకొని పోవుదురు. అతనిని చూచి ఊరిలోని వారు హాహాకారములను చేయుదురు. అతడు తానట్లు మడల్ ఎక్కుటకు కారణమైన స్త్రీని నిందించుచుండును. దానివలన ఊరిలోనివారు అతడు వలచిన స్త్రీని తెలిసికొందురు. ఆమెను నిందింతురుకూడ. కాలక్రమమున కొన్ని మార్పులును ఇందు చోటు చేసికొన్నవి. నాయికారూపమును, తన రూపమును చిత్తములో చిత్రించి, నాయకుడు వానినే చూచుచు పోవుట, లేక, తన రూపమును చిత్రింపకుండ, నాయకిరూపమును మాత్రము చిత్రించి, ప్రక్కన తన పేరును వ్రాయుట, ఒంటినిండుగా బూడిదను పూసికొనుట, దానివలన శివునివలె తోచుట, దిగంబరుడై మడల్‌ను ఎక్కుట మొదలగునవి ఇవి. మడల్ అనునది సాంఘికాచారమా? లేక కవుల భావనావిశేషమాత్రమా ? - ఒకానొక సమయములో సంఘమున మడల్ఎక్కుట అనునది ఆచారముగా నుండెనా ? లేక , కేవలము ఇది కవుల భావనమాత్రమేనా ? అనునది విచారణీయమైన అంశము. చొక్కప్ప నావలర్ మొదలగు



కొందరు నవీనులు దీనిని కవిభావనగా భావించినను Friedhelm Hardy, Kamil. V. Zvelebil మొదలగువారు దీనిని ఒకనాటి సాంఘికాచారముగానే పరిగణించిరి. ఇక మడల్ ఎక్కు ప్రయత్నమును ఆత్మహత్యా ప్రయత్న సదృశముగానే వ్యాఖ్యాతలు విమర్శించిరి. సంఘవాఙ్మయములోని ఒక పాశురము వివరణములో (నఱ్ఱిణై - 377) మడల్ ఎక్కుట కంటె ప్రాణములను విడుచుటయే మేలు అని నచ్చినార్క్కినియర్ అను వ్యాఖ్యాతచే చెప్పబడినది. (తొల్-పొరుళ్ -117) భృగుపతనసమానముగా **"ఆరాక్కామమ్ ఆడూఉనిన్ఱ లైప్ప ఇఱువరై వీఴ్నర్"** అనుచు అకనానూఱు (332-34) పేర్కొన్నది. పాండిక్కోవై అను గ్రంథములో **"మడలేఱువర్ మఱ్ఱుఙ్జెయ్యాతన శెయ్‌వర్ మానిలత్తే"** (79) అనుచు మడల్ ఎక్కువారు ఏ కార్యమునైనను చేయుటకు సిద్ధపడుదురు అని అన్నది. ఈ సందర్భమున పెరియతిరుమడల్ వ్యాఖ్యానములోని ఈ క్రింది పెరియవాచ్చాన్ పిళ్ళై శ్రీసూక్తులు అవధేయములు - **"మడలూరుకైతాన్ ఉణ్ణాదే, కుళిరాదే ఉకన్ద విషయత్తై ఒరు పడత్తిలే లిఖిత్తు అత్తైక్కొణ్డు తిరికైయుమ్, అఱవిళైన్దాల్ అదన్ కాఱ్కడైయిలే విఴుకైయుమ్, విఴున్దాల్ అఙ్జనే శెల్లరిక్క కిడక్కైయుమ్, అఙ్జనే ముడికైయుమామ్"**. ఈ వివరణమువలనకూడ మడల్ ఆత్మహత్యా ప్రయత్నసమమని తెలియుచున్నది. లోకములో తన ప్రేమ ఫలింపనపుడు ప్రేమికుడు పలు సాహస కార్యములకును, చివరకు తన ప్రాణములను తీసికొనుటకును సిద్ధపడుట ప్రత్యక్షానుభవసిద్ధముకదా ! ఆ దృష్టితో చూచినపుడు మడల్ అనునది ఒక సాంఘికాచారముగానే పరిగణించుట భావ్యమని, దీనినే కవులు అనంతరకాలమున గ్రంథస్థమును చేసిరని ఇట్లు నాటకరీతులు లౌకిక సాంఘిక సంప్రదాయములతో కలపి పాడబడునని తొల్‌కాప్పియమున తెలుపబడుట ఇచ్చట స్మరణీయమని డా ॥ ఎం.పి. శ్రీనివాసన్ **"వైణవ ఇలక్కియ వకైకళ్"** అను తమ పరిశోధనా గ్రంథములో పేర్కొనిరి.

**ఆళ్వార్ల మడల్ ప్రబంధములు** - ఈ విధముగా ప్రాచీనద్రావిడసాహిత్యములో కన్పించు మడల్ అను ప్రక్రియ ఒక ప్రత్యేక ప్రబంధముగా రూపుదిద్దుకొన్న సంప్రదాయము క్రీ.శ. 8వ శతాబ్ది నుండి కన్పించుచున్నదని పరిశోధకుల భావన. దీని ఆద్యులు ఆ శతాబ్దిలో అవతరించిన తిరుమఙ్గైయాళ్వార్లే. వారి శిఱియ తిరుమడల్, పెరియతిరుమడల్ అను రెండును మొట్టమొదటి మడల్ ప్రబంధములు. వీరికి ముందు మడల్ ప్రబంధముల రచన జరిగిన సాక్ష్యము లేమియు గోచరించుట లేదు. తమిళసాహిత్యములో ప్రసిద్ధముగా పేర్కొను **"వరుణకులాతిత్తన్ మడల్"**, **"శిత్తిరమడల్."** అనునవి 15 శతాబ్ది ప్రాంతములోనివే.

**తిరుమఙ్గైమన్నన్ తొక్కిన కొత్తపుంత :-** ప్రేయసిని చేరుటకు ప్రియుడు మడల్ ఎత్తెదననుట ప్రాచీన సంప్రదాయము. దీనికి విరుద్ధముగా, భగవానునిపై తమకుకల భావబంధవిశేషముచే నాయికాభావమును పొందిన ఆళ్వార్లు, ఆ స్వామిని పొందలేక, తాము మడల్ ఎత్తవలెనని

నిశ్చయించుకొనుట ఈ ప్రబంధములలో గోచరించును. పెరియతిరుమడల్‌లో **"అన్న నడైయార్ అలరేశ ఆడవర్‌మేల్ మన్ను మడలూరార్ ఎన్బదోర్ నాశకముమ్ తెన్నురైయిల్ కేట్టఱివతుణ్డు, అదనై యామ్ తెళియోమ్"** అని ఆళ్వార్లు సాయించిరి. ఇచట **"తెన్నురై"** అనుట ద్వారా స్త్రీలు మడల్‌ను ఆచరింపరు అను తమిళదేశసంప్రదాయమును ఆళ్వార్లు ప్రస్తావించిరి. దీనిని బట్టి ఆళ్వార్లకాలమునాటికిని స్త్రీలు మడల్ ఎత్తరాదను నియమము ఉండెనని, దానికి విరుద్ధముగానే ఆళ్వార్లు మడల్ ప్రబంధమును పాడిరని చెప్పనగును. అందుచే ఆళ్వార్లు ఈ విషయమున నూతనమార్గమును చూపిరనియే చెప్పవలెను.

**ఆళ్వార్ల నవీనమార్గమునకు పూర్వరంగము : –** స్త్రీలుకూడ మడల్ ఆచరించు భావన తమిళదేశమున తిరుమఙ్గై యాళ్వార్లకు ముందే కల్గినట్లు కొన్ని ఆధారములున్నవని కొందఱు నవీనుల అభిప్రాయము. **"నఱవినాన్ ఞాయితే కాట్టాయ్‌నీ మాయిన్ పనైయీన్ఱ మాపూర్‌న్దవన్ వరక్కామన్ కణైయెరప్పేన్ కాల్‌పుల్లిక్కొణ్డు"** అను కలిత్తొకై (147) పాశురములో నాయిక మడల్‌ను ఎత్తదలచినట్లు తెలుపబడినది. నాయిక విరహవేదనను తాళలేక మడల్ ఆచరింపదలచినట్లు చెలికత్తెతో పల్కెనని, ఇంతలో నాయకుడు వచ్చుటచే, ఆమె ఊఱటను పొందెనని అందుకలదు. నాయిక మడల్ ఆచరించుట ద్రావిడాలంకారిక సంప్రదాయవిరుద్ధమగుటచే, పాశురము అంతయు నాయికవచనములుగా రూపొందియుండక పోవచ్చును. పై పాశురములోని విషయము ఆళ్వార్ల నాయికా మడల్ ప్రబంధరచనకు ప్రేరేపించి యుండవచ్చునని కొందఱి పరిశోధకుల అభిప్రాయము. నమ్మాళ్వార్లు **"మాశఱుశోది"** (5–3) అను తిరువాయ్‌మొళ్ళి దశకములో నాయికాభావముతో పల్కుచు, తాము మడల్ ఎక్కెదనని పల్కిరి. ఇచటకూడ నాయిక "మడల్ ఎక్కెదను" అన్నదే గాని, నిజమున కాపనిని చేయలేదు. పూర్వోదాహృత కలిత్తొకై పాశురముకంటె, బహుశః ఈ నమ్మాళ్వార్ల శ్రీ సూక్తియే తిరుమఙ్గై యాళ్వార్లను మడల్ ప్రబంధరచనకు పురికొల్పియుండవచ్చును.

**తిరుమఙ్గై యాళ్వార్ల మడల్ ప్రబంధముల వైశిష్ట్యములు –** తిరుమఙ్గై మన్నన్ పాడిన మడల్ ప్రబంధములలో కొన్ని విశేషములను గమనింపవచ్చును. ఈ రెండు ప్రబంధములు వెణ్‌పా ఛందస్సులో రచింపబడినవి. విశేషించి ఈ రెండును ఇన్నిశై కలివెణ్‌పా ఛందమున కూర్పబడినవి. శితియ తిరుమడల్ 155 పాదములను కల్గి, చివర **"వారార్ పూమ్ పెణ్ణై మడల్"** అని, పెరియతిరుమడల్ 297 పాదములతో **"మన్నియ పూమ్ పెణ్ణై మడల్"** అనియు ముగియుచున్నవి. ఇంకొక విశేషమేమమగా – ఈ రెండు ప్రబంధములందు పాదములలో అంతట ప్రాసాక్షరము ఒకటియే. శితియతిరుమడల్‌లో 'ర' కారము ప్రాసాక్షరము కాగా, పెరియతిరుమడల్‌లో "న్న" అనునది ప్రాసాక్షరము. ఇట్లు ప్రబంధమంతయు ఒకే ప్రాసాక్షరముతో కూర్చుట నూతనమైన ప్రక్రియయే కాక, నిర్వహించుటలో అత్యంత క్లిష్టము



కూడ. శితియతిరుమడల్ నాయకుని **"నారాయణన్"** అను నామములోని రెండవ అక్షరము రకారమునకు తగినట్లు, అట్లే, పెరియ తిరుమడల్ లో **"కణ్ణన్"** అను పేరులోని రెండవ అక్షరముగు ద్విత్వ ణ(న)కారమునకు తగినట్లును ఈ రెండు ప్రాసలును గ్రహింపబడియుండవచ్చునని కొందఱి ఊహ. ఈ నియమముకారణముగా **"కారార్"** అను పదము 13 మార్లు, **"శీరార్"** అనునది 17 మార్లు, **"ఆరార్"** అనునది 11 మార్లు, **'ఏరార్'** అనునది 7 మార్లు, **"నీరార్"** అనునది 4 మార్లును శితియతిరుమడల్‌లో నచ్చినవి. ఇవియే కాక, రెండుమార్లు, మూడు మార్లు పునరావృతమైన పదములును చాల కలవు. అట్లే, పెరియ తిరుమడల్‌లో కూడ **"మన్నియ, మన్నుమ్, పిన్నుమ్, తెన్న, అన్న"** ఇత్యాది పదములు బహువారము ఆవృత్తమగుటను గమనింపవచ్చును. ఉదాహరణగా **"మన్నియ"** అని కాని, **"మన్నుమ్"** అని కాని వచ్చు పదములు 47 మార్లు ఆవృత్తమగుటను చెప్పవచ్చును. ఈ రెండు మడల్ ప్రబంధములలో కామపురుషార్థమునకే (ఇది లౌకికకామము కాదు – భగవద్విషయకకామము – దీనికే భక్తి అని పేరు) ప్రాధాన్యమీయబడుట వేరొక విశేషము. త్రివర్గములోని ధర్మార్థములు రెండును ఈ కామపురుషార్థమునందే అణగియుండునని, కామమును పొందినవారు మిగిలిన రెండిటిని పొందినవారే అగుదురు అని అందు తెలుపబడినది. ఇట్టి భావమే తదనంతరకాలిక ప్రబంధమగు ఇరామానుశ నూఱ్ఱన్దాదిలో **"శీరియ నల్ కామమ్"** అను సూక్తిలో వ్యక్తీకరింపబడినది. ఇట్లు నాయిక ఈ ప్రబంధములలో కామపురుషార్థమును ప్రధానముగా చేసి పల్కుటలో తాత్పర్యమేమనగా – ఈ కామము (భగవద్భక్తి) వలన కల్గిన బాధచేతనే తాను మడల్ అనుష్ఠింపబోయెదనని తెలుపుటయే.

ఈ మడల్ ప్రబంధములలో కానవచ్చు ఈ వైలక్షణ్యముల దృష్టిలోనే పన్నిరు పాట్టు గ్రంథములో మడల్ ప్రబంధలక్షణములు ఇట్లు నిర్వచింపబడనవి. **"అఱమ్ పొరుళ్ వీడు తిఱమ్ పెరితళ్ళిత్తు, చ్చిఱన్ద వేట్కై శెవ్విదిఱ్పురా అయ్, ప్పాట్టుడైత్తలైవన్ ఇయెత్పెయర్‌క్కెదుకై, నాట్టియ వెణ్‌కలిప్పావతాకి, త్తనిచ్చొల్ ఒరీ ఇత్తనియిడత్తొరుత్తియై క్కణ్డపిన్ అన్ద ఒణ్డొడి ఏత్తల్, మఱ్ఱవళ్ వడివై ఉఱ్ఱకిళ్ళివెయ్దుది క్కామమ్ కవఱ్ఱ క్కరుమ్బనై మడల్ మా ఏఱువర్ ఆడవర్ ఎన్ఱనర్ పులవర్**". తిరుమఙ్గైమన్నన్ మడల్ ప్రబంధములలో నాయిక మడల్ ఎక్కుటనుగూర్చి పల్కుటనుబట్టి ఈ లక్షణకారుడు **"మడన్ మాప్పెణ్డిర్ ఏఱార్, ఏఱువర్ కడవుళర్ తలైవరాయ్ వరుఙ్కాలే"** అని, **"కడవుళర్ మేఱ్ఱ్రే కారికై మడలే"** అనియును ప్రబంధనాయకుడు భగవానుడైనపుడు నాయిక మడల్ అనుష్ఠింపవచ్చుననెను. ఆళ్వార్ల ప్రబంధములను ప్రధానముగా లక్ష్యముగా చేసికొనుటచేతనే, వానికి అనుగుణముగానే ఇట్టి లక్షణములు చెప్పబడినవని సాహిత్యవిమర్శకుల తలపు. స్త్రీలు మడల్ అనుష్ఠింపరాదను ద్రావిడ సంప్రదాయమునకు తగినట్లు, తద్విరుద్ధముగా కన్పించు ఆళ్వార్ల మడల్ ప్రబంధములకు తగినట్లును – ఈ రెండిటిని సమన్వయ పఱచుచు పన్నిరుపాట్టులో మడల్

ప్రబంధ లక్షణముల నిర్వచింపబడుట విశేషము.

పన్నిరుపాట్టునకు పిమ్మట ఉద్భవించిన పలు లక్షణగ్రంథములలోకూడ ఈ మడల్‌ప్రబంధలక్షణమే గ్రహింపబడినను, ఒక మార్పు మాత్రము కలదు. నాయకుడు భగవానుడైనచో స్త్రీలు మడల్ ఎత్తవచ్చునను అంశమును మాత్రము లక్షణకారులు ఎవరును తెలుపలేదు. అందుచే దానిని వారు అంగీకరించినట్లు తోచదు. తిరుమజ్గైయాళ్వార్ల మడల్ ప్రబంధ లక్షణములనుకల మడల్ ప్రబంధములకు **"వళమడల్"** అనియు పేరు. **"ఇన్బమడల్"** అనుపేరుతో వ్యవహరింపబడు మడల్ ప్రబంధములుకూడ ఇట్టివే. కావు **"మడల్", వళమడల్, ఇన్బమడల్** అనునవి పర్యాయపదములుగానే గ్రహింపవచ్చును. వళమడల్ వర్గమునకు చెందిన ప్రబంధములు తమిళసాహిత్యములో తిరుమజ్గైయాళ్వార్ల ప్రబంధములు తప్ప, వేరు ప్రబంధములున్నట్లు తోచదు. కాని, 18 వ శతాబ్దివరకు వచ్చిన లక్షణప్రబంధములు ఇంచుమించుగా అన్నియును వళమడల్ ప్రబంధలక్షణములను నిర్వచించుటనుబట్టి, ఆళ్వార్ల ప్రబంధములకుగల గౌరవము ప్రస్ఫుటమగుచున్నది. వళమడల్ ప్రబంధలక్షణములకు కొంచెము వ్యత్యాసముతో రచింపబడిన మడల్ ప్రబంధములు మాత్రము చాల కన్పించుచున్నవి. వానికి లక్షణకారులు **"ఉలా మడల్"** అని పేరు పెట్టిరి. ఇవి ఉలా ప్రబంధముల లక్షణములను, మడల్ ప్రబంధలక్షణములను రెండిటిని కల్గియున్నవని విమర్శకుల అభిప్రాయము. ప్రబంధనాయకుని పేరునకు తగినట్లు ప్రాసను అమర్చుకొని, మడల్ రచన సాగవలెనను వళమడల్ ప్రబంధ నియమమును అనుసరింపని కవులు ఈ నూతన ప్రబంధ ప్రక్రియను ప్రారంభించియుండవచ్చును.

**ఆళ్వార్ల మడల్ ప్రబంధముల ద్రావిడ సంప్రదాయానుగుణ్యము –** సంప్రదాయమునకు వ్యతిరేకముగా స్త్రీలు మడల్ అనుష్ఠించుటనుగూర్చి పల్కుటచే ఆళ్వార్ల మడల్ ప్రబంధములు పలువురి తమిళసాహిత్యవిమర్శకుల దృష్టిని ఆకర్షించినవి. ఈ ప్రబంధములు సంప్రదాయమును అతిక్రమించినవా ! లేదా ! అను అంశము కూడ ప్రధానముగా చర్చకు వచ్చినది. ఆళ్వార్లు **"మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్"** అని పెరియ తిరుమడల్‌లో పల్కుటచే, ఆళ్వార్ల మడల్ ప్రబంధములను ద్రావిడసంప్రదాయమునకు అనుగుణముగా వివరించు సమన్వయ ప్రయత్నమును వ్యాఖ్యానకారులు చేసిరి. పరకాలనాయకి తన చెలికత్తెలతోపాటు పూలను కోయుటకై ఉద్యానవనమునకు పోవుట, అచటికే దైవవశమున వచ్చిన నాయకుడు ఆమెయు పరస్పరాకర్షణకు లోనగుట, వారిద్దరి కలయిక, విశ్లేషము, విరహవ్యసనమును తాళలేని నాయిక మడల్ ప్రయత్నము చేయుట– ఈ రీతిలో శితియతిరుమడల్ ప్రబంధమును పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానించుట ఇందులకొక నిదర్శనము. ద్రావిడాలంకారిక పరిభాషలో నాయకుని ప్రేమాపేక్షకు **"కుఱై"** అని, అతనిప్రేమకు సహాయపడుటకు సఖి అంగీకరించుటకు



**"కుఱై నేర్‌తల్"** – అని, అతని ఆపేక్షను సఖి నాయకికి తెలుపుటకు **"కుఱై నయప్పిత్తల్"** అనియును పేర్లు. పరకాలనాయకికి భగవానునిపట్లగల కుఱైను – అనగా అపేక్షను ఈ ప్రబంధములు తెలుపుచున్నవి కావున ఇది ద్రావిడాలంకార శాస్త్రానుగుణ్యములని కొందఱు నవీనులు పల్కుదురు. పెరియతిరుమొళ్లి ప్రబంధతనియన్ పాశురములోకూడ **"తమిళ్ నన్నూల్ తుఱైకళ్, అఙ్జుక్కు ఇలక్కియమ్"** అని పల్కుట ఈ దృష్టిలోనే అనియు కొందఱి అభిప్రాయము. పరకాలనాయకి మాటిమాటికి **"మడల్ ఎక్కెదను, మడల్ ఎక్కెదను"** అని పల్కుచు, మడల్ అనుష్ఠింపకుండ ఆలస్యము చేయుటలో ఏమి ఆంతర్యము! అనుటను పెరియవాచ్చాన్ పిళ్ళై వివరించుచు – మడల్ ఎక్కెదనని తాను అన్నచో భగవానుడు భీతిల్లి తప్పక వెంటనే వచ్చునను అభిప్రాయముతోనే తప్ప, నిజమునకు అనుష్ఠింపవలెనను అభిప్రాయముతో కాదు అని పల్కుటను బట్టియు ఆళ్వార్ మడల్ ప్రబంధముల సంప్రదాయబద్ధతను తెలియవచ్చును.

ఇట్టి సమన్వయములవలననే కాక, ద్రావిడ ప్రబంధలక్షణానుసారముగా మడల్ ప్రబంధములున్నవని చెప్పుటకు వేఱొక విధానమును కలదు. **"కామప్పకుది కడవుళుమ్ వరైయార్ ఏనోర్ పాఙ్గినుమ్ ఎన్మనార్ పులవర్ "** (పొరుళ్–83) అనెడి తొల్‌కాప్పియములోని పాశురమునకు వ్యాఖ్యానమును చేయు ఇళమ్ పూరణర్, నచ్చినార్ క్కినియర్ అను పండితులు దైవముపట్ల దైవకాంత అనురాగము, దైవముపట్ల మానవకాంత అనురాగము, అట్లే మానవకాంతపట్ల దైవము అనురాగమును శాస్త్రసమ్మతములేననిరి. తిరుమజ్గై యాళ్వార్ మడల్ ప్రబంధములు రెండును దైవముపట్ల మానవ కాంత (పరకాలనాయకి) అనురాగమును నిరూపించునవి. ఈ ఆళ్వార్ల వలెనే పలువురు సంప్రదాయకవులు నాయక – నాయకీభావనతో రచించిన పాశురములు ఈ కోవకు చెందునవియే. ఇవి అన్నియు భక్తుల ఏకత్రానురాగమును తెలుపునవి, కావున ఇవి లక్షణానుసారము**"పాడాణ్‌తిణై క్కైక్కిళై"** అను ఆలంకారిక విభాగములోనికి చేరునని కొందఱు నవీనులు వాదించుచున్నారు.

ఆళ్వార్లు తమ భక్తిని వెలువరించుటకై తగినసాధనముగానే మడల్‌ను ఉపయోగించిరి. మఱియు, భగవానుని అవతారవైభవమును, అవతారలీలలను, కీర్తిని, దయావైభవమును, చక్కగా చిత్రీకరించుటకు ఈ ప్రక్రియ ఉపయోగించినది. కావున మడల్ ప్రబంధములను ఈ దృష్టిలోనే పరిశీలింపవలెనే కాని, స్త్రీలు మడల్ ఎత్తనగునా ! కూడదా ! అను విచారము అనవసరము – అని నవీన విమర్శకులు కొందఱి అభిప్రాయము.

**ఆళ్వార్లు చూపిన నూతనమార్గము –** పూర్వము తెల్పిన రీతిలో భగవానుని నాయకునిగా, తమను నాయకిగా భావించి, పలుకువిధానము ప్రాచీనద్రావిడ అలంకారిక సంప్రదాయమునకు చెందినదియే. తిరుమజ్గైయాళ్వార్లకు ముందు పలువురు సంప్రదాయకవులు. దివ్యసూరులు దీనిని అనుసరించిరి. దీనినే ఆళ్వార్లు అనుసరించుచు నాయకి మడల్ అనుష్ఠించు

నూతనాంశమునకు ద్వారము తెఱచిరి. ఆళ్వార్లు ప్రారంభించిన ఈ చిన్నమార్పు మడల్ ప్రబంధములను ఒక కొత్త ఆలంకారిక లక్ష్యవిశేషముగా రూపొందించినది. అందుచే ఆళ్వార్ల మడల్ ప్రబంధములు సంప్రదాయ విరుద్ధములా ! లేక, సంప్రదాయానుసారములా ! ఇత్యాది విచారములు అనావశ్యకములు అని మఱికొందఱి భావన.

**మడల్తెలుపు ఆధ్యాత్మికతత్త్వము** – సంస్కృతభాషలో, ద్రావిడభాషలోవలె మడల్ ప్రబంధములు కాని, స్త్రీలు మడల్ను అనుష్ఠింపవచ్చునను సూచనగాని లేదు. అట్లయినచో, ఆళ్వార్లు **"వడనెఱియే వేణ్డినోమ్"** అనుచు తాము ఔత్తరాహ సంప్రదాయమునే ఆదరింతుమని పల్కుట దేనిని ఉద్దేశించి ? అను ప్రశ్న కల్గును. తమిళ గ్రంథములలో తెల్పినరీతిలో **"మడల్మా"** ఎక్కిననే మడల్ను అనుష్ఠించినట్లుగును అని ఆళ్వార్లు అభిప్రాయపడినట్లు తోచదు. స్త్రీలకు అత్యంతావశ్యకమగు లజ్జను వీడి చేయునట్టి కృత్యము ఏది అయినను అది మడల్ అనుష్ఠించుటతో సమానమగును అని ఆళ్వార్లు అభిప్రాయపడినట్లు తోచును. – అని మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు దివ్యార్థ దీపికలో సెలవిచ్చిరి. దీనినిబట్టియే అనంతరకాలీనులును మడల్ అనుష్ఠించుటకంటె వేఱయిన కృత్యములనుకూడ మడల్తో సమానములుగానే పల్కిరి. సన్న్యాసధర్మమును మడల్ అని ఆళవన్దార్ పల్కిరని పెరియవాచ్చాన్పిళ్ళై పెరియతిరుమడల్వ్యాఖ్యలో తెలిపిరి. అసూర్యంపశ్య అగు సీతాదేవి అంతఃపురమును విడచి రామునితోపాటు రాజవీధిలో **"యా న శక్యా పురా ద్రష్టుం దేవై రాకాశగై రపి"** అనురీతిలో నడచి వెళ్ళుటనుకూడ నమ్బిళ్ళై మడల్గానే తెలిపిరి. ఇట్లు మడల్ ఒక ఆధ్యాత్మికతత్త్వమును సూచించునని భావించుటకు ఆళ్వార్ల నవీనభావనయే మూలము.

**స్త్రీల మడల్ భావననుగూర్చిన ఇతరకృతులుః–**తిరుమఙ్గైయాళ్వార్లవలె **"వళమడల్"** ప్రక్రియలో గ్రంథములను రచించిన వారు లేరు. కాని, స్త్రీలు మడల్ను ఆచరించుటను గూర్చిన ఆళ్వార్ల భావన ద్రావిడభాషాపండితుల దృష్టిని బాగుగా ఆకర్షించినది. తిరుత్తక్కదేవర్ తమ జీవకచింతామణిలో జీవకుని పొందగోరిన గుణమాల మడల్ను అనుష్ఠింపగోరినదనెను. నాయిక మడల్ ఎక్కుటనుగూర్చి ఆమె సఖి నాయకునితో పల్కుటను కంబమహాకవి శఠకోపర్ అన్దాదిలో (38) గమనింపవచ్చును. **"ఊర్వేన్ మడలై ఒళ్రివేన్ మడనాణమ్ శేర్వేన్ కరియ తిరుమాలై"** – అనుచు దివ్యకవి పిళ్ళైప్పెరుమాళ్ అయ్యఙ్గార్ పల్కిరి. శైవసంప్రదాయమునకు చెందిన కుమరగురుపరస్వామి తాము రచించిన మతురైక్కలమ్బకమ్లో నాయిక మడల్ అనుష్ఠించినట్లు తెలిపెను. వీనిని బట్టి ఆళ్వార్ల నూతన భావనను అనుసరించి 'మడల్ ఎత్తెదను' అని పల్కుట స్త్రీలకు తగునని తరువాతి కాలపుకవులు,పండితులు అంగీకరించిరని చెప్పనగును.



వేఱొక ఆశ్చర్యకరమైన అంశము ఏమనగా – సంప్రదాయద్రావిడసాహిత్యములోనే కాక, జానపదవాఙ్మయమందుకూడ ఈ భావన చోటుచేసికొనుటయే . తాము కోరిన వారిని పొందుటకు మడల్ను అనుష్ఠించుట పూర్వమున్న స్థితి. ఒకరి అందమును గొప్పగా వర్ణించుటకొఱకు కూడ మడల్ను ఉపయోగించుట కాలక్రమమున ఏర్పడిన కొత్త పరిణామము. అట్లే, ఒక నాయకునిగూర్చి పలువురు స్త్రీలు మడల్ ఎత్తవలెనని భావించినట్లు పల్కు కృతులును ఉండుట మఱియొక విశేషము – అని శ్రీ ఎం.పి.శ్రీనివాసన్ వివరించిరి.

**శఠియ తిరుమడల్ ప్రబంధము అంతయు ఒకే పాశురము**

"ఈ శఠియ తిరుమడల్ను ద్రావిడ భాషాఛందోనియమానుసారము ఒకే పాశురముగా లెక్కింపవలసియున్నది. 77½ పాశురములుగా అప్పిళ్ళై అను పూర్వాచార్యులు, నలువది (40) పాశురములుగా శ్రీవేదాంత దేశికులును లెక్కించిరి. కాని వారిట్లు పలు పాశురములుగా ఈ ప్రబంధమును గణించుట ఇలక్కణ (లక్షణ నియమునకు అనుగుణము కాదు" అనుచు కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారు తమ శఠియతిరుమడల్ దివ్యార్థ దీపికవ్యాఖ్యలో తెల్పుచు ఈ క్రింది విధముగా వివరించిరి.

మహానుభావులగు ఈ పూర్వాచార్యులిద్దఱును ఛందోలక్షణమునకు అననుగుణముగా లెక్కించుటకుగల కారణము ముందు తెలుపబడును. మొదట ఒకే పాశురముగా ఈప్రబంధములను గ్రహింపవలసియున్నదనుట ముందు నిరూపింపబడుచున్నది. కలివెణ్బా ఛందస్సులో ప్రకృత ప్రబంధము రచింవబడినది. వెణ్బాఛందస్సులోని పలు ప్రకారములలో - రెండుపాదములతో కూడినది కుఱళ్వెణ్బా అని, మూడు పాదములను కల్గినది శిన్దియల్వెణ్బా అని, నాల్గుపాదములను కల్గి, రెండవపాదముచివరలో గల పదము యొక్క ప్రాసాక్షరము, మొదటి రెండు పాదములలోని ప్రాసాక్షరమును ఒకటియైయుండు నియమమును కల్గినది నేరిశైవెణ్బా అని, ఈ నియమమును కల్గి అయిదుపాదములనుండి పంద్రెండు పాదములవరకు గల ప్రకారము పఃౘ్రొడైవెణ్బా అని, పంద్రెండుపాదములకు మించి కల్గినది కలివెణ్బా అనియు వ్యవహరింపబడునని లక్షణమగుటచే, శఠియతిరుమడల్ ప్రబంధము కలివెణ్బాలో రచింపబడినదనుట సర్వాభిమతమగుటచే ఈ ప్రబంధమంతయు కలిపి ఒకే పాశురము. ఈ మడల్ ప్రబంధములు రెండింటిలో ప్రాసాక్షరము మొదటి పాదమునుండి చివరిపాదము వరకు సమానముగా ఉండుట, చిట్టచివరి పాదము మూడు గణములతో ముగియుటయును ఈ ప్రబంధములు ఒక్కొక్కటి ఒకే పాశురమనుటను నిరూపించుచున్నవి.

మడల్ప్రబంధలక్షణమునుగూర్చి సంఘకాలమునకుచెందిన పన్నిరుపాట్టియల్ అను లక్షణగ్రంథములోని **"పాట్టుడైత్తలైమకనియఱ్పెయర్క్కెదుకై . . ., నాట్టియ వెణ్**

**కలిప్పావ దాకి . . . . . . . కామఙ్గవగ్ర్ఱ క్కరుమ్బునైమడన్మా ఏఱువరాడవర్ ఎన్ఱనర్ పులవర్**" అను లక్షణమును, "**ఇవ్వాఱు వన్దన మఱ్ఱైయర్కోన్ అరుళిచ్చెయ్ద పెరియతిరుమడల్, శిఱియతిరుమడల్ ఎన్బన**" అను వివరణమును స్మరింపనగును. అట్లే, "**అఱమ్ పొరుళ్ వీడెను మమ్మున్ఱ్కుగ్ర్ఱిన్ తిఱఙ్కడిన్దఱి వైయర్ తిరుత్తుఱు మిన్బమ్ పయనెన క్కలివెణ్బా వాగ్ర్ఱలైవన్ పెయరెదుకైయిని త్పేశుదల్ వళమడల్**" అను ఇలక్కణ వివరణమును గ్రహింపవనగును. ఈవిధముగానే ఇంకను పలు ప్రాచీన, నవీనలక్షణ గ్రంథములలో తెలుపబడిన మడల్ ప్రబంధలక్షణములలో కలివెణ్బాఛందమున ఈప్రబంధవిశేషము కూర్పబడి యుండవలెనను నియమము సర్వత్ర సమానము. అందుచే తిరుమడల్ ప్రబంధములను రెండింటిని ఒక్కొక్క పాశురముగా గ్రహించుటయే కాని లక్షణమునకు అనుగుణము.

అట్లయినచో, శ్రీవేదాంతదేశికులు, అప్పిళ్ళైగారు వలుపాశురములుగా ఈప్రబంధములను లెక్కించుటలోగల కారణమేమి ? అనుప్రశ్నకు ఔచిత్యమను ప్రమాణానుసారము సమాధానమును చెప్పుకొనవలెను. అది ఎట్లనగా దివ్య సూరులచే అనుగ్రహింపబడిన ద్రావిడవేదమునకు నాలాయిరము (నాల్గువేలు) అను పేరు జగత్ప్రసిద్ధము. హెచ్చుతగ్గులు లేకుండ సరిగా నాల్గువేలపాశురముల సంఖ్యను చూపవలెనను అభిప్రాయము ఈఆచార్యవర్యులకిద్దఱికిని కల్గినది. శ్రీదేశికులు ఇరామానుశనూగ్ర్ఱన్దాది ప్రబంధమును కూడ నాలాయిరములో చేర్చి, నాల్గువేల సంఖ్యను సరిపుచ్చచూచిరి. అప్పిళ్ళైగారు ఆ ప్రబంధమును విడచి, మిగిలిన ప్రబంధములలో నాల్గువేలసంఖ్యను సరిజేయచూచిరి. తిరుమడల్ ప్రబంధములను ఒక్కొక్కటిని ఒక్కొక్కపాశురముగా లెక్కించినచో వారికి నాల్గువేల సంఖ్య పూర్తి అగు అవకాశము లేకపోయినది. మడల్ప్రబంధములు కాక, మిగిలిన 22 ప్రబంధములలోని పాశురములసంఖ్యను లెక్కింపగా కేవలము 3774 పాశురములుగా తేలినవి.

ఇరామానుశనూగ్ర్ఱన్దాదిలోని 108 పాశురములను కలుపుకొనగా 3882గా పాశురసంఖ్య తేలినది. అందుచే నాల్గువేలకు 118 పాశురములు తక్కువ అయినవి. శిఱియతిరుమడల్ను 40 పాశురములుగా, పెరియతిరుమడల్ను 78 పాశురములుగా లెక్కించి, దేశికులు నాలాయిర సంఖ్యను సరిపుచ్చిరి. ఇక, నూగ్ర్ఱన్దాదిని తప్ప మిగిలిన ప్రబంధములను గ్రహించిన అప్పిళ్ళైగారి లెక్కకు 226 పాశురములు అవసరమైనవి. కావున శిఱియ తిరుమడల్ను 771/2 పాశురములుగను, పెరియతిరుమడల్ను 148½ పాశురములుగను లెక్కించి, అప్పిళ్ళైగారు నాల్గువేల సంఖ్యను పూర్తి చేసిరి. "**స్థితస్య



గతిఃచింతనీయా**" అను రీతిలో పై సమాధానము తెలువబడినది.

ఇట్లయినను, ఇచట వేరొక సందేహము కలుగును. మడల్ ప్రబంధములను రెండింటిని ఒక్కొక్క పాశురముగానే లెక్కించినపుడు ఏ విధముగా చూచినను నాలాయిరసంఖ్య పూర్తి కాదుకదా ! అపుడు నాలాయిరమను పేరు పెట్టుటలో అర్థమేమి? అనునది ఆ సందేహము. శతక, సహస్రాది పెద్దసంఖ్యలకు కొంచెము తక్కువ ఉన్నను వానిని ఆ పేర్లతోనే వ్యవహరించుట లోకపరిపాటియేకదా ! ఆవిధముగానే నాలాయిర సంఖ్యకు ఒకటి, రెండు వందలు తక్కువైనను నాలాయిరమను వ్యవహారమునకు లోపము లేదు. ఇందులకు పలు ఉదాహరణములున్నవి. "**కురుకూర్చ్చడకోపన్ శొన్న ఓరాయిరమ్**" అనుచు నమ్మాళ్వార్లు పలుచోట్ల నిర్దేశించిన తిరువాయ్మొళ్ఱి ప్రబంధములో 1102 పాశురములుండుట, "**పొఱ్ఱుపుకళ్ఱ్ మఱ్ఱైయర్ కోన్ ఈన్ఱ మఱ్ఱై ఆయిరమ్**" అను పెరియతిరుమొళ్ఱి ప్రబంధములో 1084 పాశురములుండుట, "**ఇరామానుశనూగ్ర్ఱన్దాది**" ప్రబంధములో 108 పాశురములుండుట, 1008 శ్లోకములను గల శ్రీ దేశిక స్తుతి పాదుకాసహస్రముగా వ్యవహరింపబడుట, 74 శ్లోకములు కల దేశికస్తుతి యతిరాజసప్తతిగా పిలువబడుట- ఇత్యాదులిచట గ్రాహ్యములు. ఈరీతిగా నాల్గువేల సంఖ్యకు కొంచెము తక్కువైనను నాలాయిరమను వ్యవహారమునకు లోపము లేదనుటను అందఱును అంగీకరింపవలసినదే కదా ! ఈవివరణమంతయు శ్రీకాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారి దివ్యార్థదీపిక వ్యాఖ్యను బట్టి చేయబడినది.

**ప్రకృతముద్రణను గూర్చి :-** ఇయఱ్పాలోని పలు ప్రబంధములకు సూత్ర ప్రాయముగా అత్యంత సంగ్రహ గంభీరవ్యాఖ్యలను అనుగ్రహించిన పెరియవాచ్చాన్ పిళ్ళై ఈ ప్రబంధమునకు పాలు, చక్కెర, తేనెల కలయికవంటి అత్యంతమధురమైన విశదవ్యాఖ్యానమును ప్రసాదించుట అస్మదాదుల భాగ్య పరీపాకము. రస్య రహస్యార్థ వివరణలు ఈ వ్యాఖ్యలో సర్వత్ర గోచరించుననుటకు కట్టువిచ్చి స్వాపదేశార్థ వివరణము, శ్రీకృష్ణుడు వెన్నను ఆరగించి, చల్లకుండను పగులగొట్టుటలోని ఆంతర్యము, శూర్పణఖ ముక్కు చెవులను కోయుటలోని రహస్యము - ఇత్యాదులు ఉదాహరణములు. కట్టువిచ్చిని భగవద్రామానుజులుగా నిరూపించుటలోని ఆంతర్యము - లోకములోని కట్టువిచ్చి నాయిక హృదయమును తెలిసినట్లే, నాయికాభావనను పొందిన దివ్యసూరుల అంతరంగమును ఆవిష్కరింపగలిగిన వారు రామానుజులేనని తెలుపుటయే. కావుననే "**ఇరామానుశ మునియే . . . . . . . మఱ్ఱైయర్ కోన్ ఈన్ఱ మఱ్ఱై ఆయిరమ్ అనైత్తుమ్ తఙ్గమనమ్ నీ ఎనక్కు త్తా**" అను తనియన్ ఏర్పడినది. ఇట్టి సాభిప్రాయ వివరణములు

అడుగడుగునా వ్యాఖ్యలో కలవు. ఈ ప్రబంధము నిత్యానుసంధేయ ప్రబంధముగా పెద్దలచే అనుసంధింపబడుట దీని ప్రాధాన్యమునకు అద్దము పట్టుచున్నది. ప్రతి శుక్రవారము రాత్రి ఈ ప్రబంధము అస్మదాచార్యులు, పితామహపాదులు, ఉభయవేదాంత మహావిద్వాన్, ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారు భగవత్సన్నిధిలో ఆర్ద్రముగా అనుసంధించిన దృశ్యము ఈనాటికిని దానుని కంటిముందు కదలుచున్నది.

ఈ శిఠియతిరుమడల్ వ్యాఖ్యానమును 100 సం॥లకు పూర్వము శ్రీవైష్ణవ గ్రంథముద్రాపకసభ, మద్రాసు వారిద్వారా తెలుగులిపిలో (ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్యసహితముగా) ప్రచురింపబడినను ఆ శ్రీకోశములు ప్రస్తుతము దుర్లభములు. దొరికినను అత్యంత శిథిలములును. కాలక్షేపపరులకు ఈ గ్రంథ దౌర్లభ్యము సమస్యగా మారినది. దీనిని గమనించి, తమ పితృపాదుల తిరునక్షత్రోత్సవశుభ సందర్భమున ఈ వ్యాఖ్యను ఆంధ్ర వివరణముతో ముద్రింపజేయ ప్రయత్నించిన శ్రీమతి కె. జానకిగారు, ఈ పవిత్ర గ్రంథముద్రణకు అవసరమైన ఆర్థికసహాయమును అందించుటకు ముందుకు వచ్చిన ఆస్తికాగ్రేసరులు, భగవద్భాగవత కైంకర్యనిష్ఠులు, ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి శిష్యరత్నములును అగు **శ్రీమాన్ దాచేపల్లి సన్యాసిరాజుగారు, తిరువేఙ్గళమ్మ దంపతులు** (విజయనగరం) మిక్కిలి శ్లాఘనీయులు. వీరిరువురకు శ్రీవైష్ణవలోకము అధమర్ణము అనుటలో సందేహము లేదు. చిరకాలము విజయనగర ప్రాంతమున విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమును అకుంఠితదీక్షతో, అప్రతిహతముగా సాగించిన మహనీయులు పరమపదవాసులు ఉ.వే.శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి అనుగ్రహఫలము, వారి అడుగుజాడలను అనుసరించుచు, వారు చేసిన ప్రచారమును అత్యంత సమర్థవంతముగా కొనసాగించుచున్న శ్రీమతి జానకిగారు, శ్రీమతి హరిప్రియగారు, శ్రీమాన్ సౌమిత్రి, శ్రీమాన్ పాణిగార్ల కృషి ఫలమే ఈ ముద్రణ. గత మూడేండ్లుగా వారు పితృపాదుల తిరునక్షత్రోత్సవ సమయమున సంప్రదాయ గ్రంథములను ముద్రింపజేయుట అందఱికిని తెలిసినదే. ప్రకృత గ్రంథముద్రణలో ఆర్థికసహాయము సమర్పించి ఆచార్య కైంకర్యమును చేసికొని, మిగిలిన వారికి మార్గదర్శకులైన శ్రీమాన్ దాచేపల్లి సన్యాసిరాజు దంపతులను మనసార అభినందించుచూ, మంగళాశాసనములను చేయుచున్నాను. **"నెడియానై అడినాయేన్ నినైన్దిట్టేనే"** అను రీతిలో ఈ అద్భుత వ్యాఖ్యను అనువదించుటకు అర్హత ఏ మాత్రము దాసునకు లేకున్నను, శ్రీమతి జానకమ్మ గారు పదే పదే నిర్బంధించుటచే, **"సంబంధాత్ స్వాత్మలాభః"** అను రీతిలో దాసుని ఉజ్జీవనమునకు కారణమగునను భావముచే, ఈ అనువాద సాహసమును చేసితిని. అనువాదము సాధ్యమైనంతవరకు యథాతథముగా వివరణ పూర్వకముగా చేయబడినది.



నాకు అవసరమని తోచిన కొన్ని విశేషములను పీఠికలో విన్నవించితిని. శ్రీకాంచి ప్ర.భ.అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికలోని కొన్ని విశేషాంశములును ఇందు కృతజ్ఞతా పూర్వకముగా కూర్చబడినవి. దివ్యార్థ దీపిక వ్యాఖ్యాన ప్రతిని అందజేసిన ఉ॥వే॥ శ్రీమాన్ రాజహంసస్వామి (కాంచీపురం) వారికి హృదయపూర్వకముగా కృతజ్ఞతలు. ఇందలి గుణదోషములకు సహృదయులగు పెద్దలే ప్రమాణము. ఈ వ్యాఖ్యారచనకు ప్రోత్సహించిన శ్రీమతి జానకమ్మ గారికి, అవకాశము తక్కువైనను కాదనక ఆంధ్ర వివరణమును కటాక్షించి మంగళాశాసనములను అనుగ్రహించిన వాత్సల్యమూర్తులు, అస్మచ్ఛ్రేయఃకాములు, మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర, ఉ.వే.శ్రీమాన్ ఎస్.ఎన్.సి. రఘునాథాచార్యస్వామివారి సన్నిధిలో, ఆచార్య ఉ.వే.శ్రీమాన్ టి.వి. శ్రీరామచంద్రాచార్యస్వామివారి సన్నిధిలో, మాతులపాదులు, ఉ.వే.శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో, శాస్త్రరత్నాకర, ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి. రంగరామానుజాచార్యస్వామివారి సన్నిధిలో సప్రశ్రయముగా కృతజ్ఞతలను సమర్పించుకొనుచున్నాను. తమ అశక్తిని సైతము గణింపక ఈ ప్రయత్నమున సర్వదా మార్గదర్శకులై ప్రోత్సహించి, మంగళాశాసనములను ప్రసాదించిన పితృపాదులు, న్యాయవేదాంతవిద్వాన్, ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి సన్నిధిలో **"తలైయల్లాల్ కైమ్మాఱిలేన్"** అనునట్లు శిరసా ప్రణమిల్లుచున్నాను. సకాలమున అక్షరయోజన చేసి సహకరించిన మన్మిత్రము అన్నపూర్ణ గ్రాఫిక్స్ అధినేతలకు, మరియు శ్రీమతి జె.విద్యాలతగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ అనువాదమున శ్రీ సుదర్శన పత్రికాధిపతి ఉ.వే.శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి శిఠియతిరుమడల్ ద్రావిడవివరణము చాల ఉపకరించినది. ఇందులకు వారిసన్నిధిలో దాసుని కృతజ్ఞతలను నివేదించుకొనుచు విరమించుచున్నాను.

**జయతు కలివైరిసూరిః శిరియతిరుమడ లితి తత్కృతి రపూర్వా ।**
**మృదుమధురా తద్వ్యాఖ్యా క్లప్తా శ్రీకృష్ణసూరిభి శ్చ సదా ॥**
**ఆంధ్రభాషానువాదోఽయం వ్యాఖ్యాయాః కృష్ణసూరిణామ్ ।**
**విహితో శింగరార్యేణ సతా మగ్రే సమర్ప్యతే ॥**

ఇట్లు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి
15-6-2006



శ్రీమతే రామానుజాయ నమః

## తిరుమఙ్గై యాழ்వార్ అనుగ్రహించిన

# శిఱియతిరుమడల్

కారార్ వరై క్కొఙ్గై క్కణ్ణార్ కడలుడుక్కై,
శీరార్ శుడర్ శుట్టి చ్చెఙ్గలుழிప్పేరాఱ్ఱు,
ప్పేరార మార్బిల్ పెరు మా మழைక్కూన్దల్,
నీరార వేలి నిలమఙ్గై యెన్నుమ్, ఇ
ప్పారోర్ శొలప్పట్ట మూన్ఱన్ఱే, అమ్మూన్ఱు
మారాయిల్ తానే యఱమ్ పొరుళిన్బమెన్ఱు,
ఆరారివఱ్ఱి నిడై యతనై యెయ్తువార్
శీరా రిరుకలైయు మెయ్తువర్, శిక్కెనమఱ్ఱా-
రాను ముణ్డెన్బా రెన్బతుతానతువుమ్,
ఓరామై యన్ఱే యులకత్తార్ శొల్లుమ్ శొల్,
ఓరామై యామా లతు వురైక్కేన్ కేళామే,
కారార్ పురవి యేழ் పూణ్డ తనియాழி,
త్తేరార్ నిఱై కతిరోన్ మణ్డలత్తై క్కీణ్డు పుక్కు,
ఆరావముత మఙ్గెయ్తి, అతిల్ నిన్ఱుమ్
వారాతొழிవతొన్ఱుణ్డే, అతు నిఱ్క
ఏరార్ ముయల్ విట్టు క్కాక్కై ప్పిన్ పోవతే,
ఏరారిళములైయీా రెన్ఱనక్కుఱ్ఱతుతాన్,
కారార్ కుழలెడుత్తు క్కట్టి, క్కతిర్ ములైయై
వారార వీక్కి మణిమేకలై తిరుత్తి,
అరారయిల్వేఱ్కణఞ్జనత్తి నీఱణిన్దు,
శీరార్ శెழుమ్ పన్దు కొణ్డయానిన్ఱేన్ నాన్,
నీరార్ కమలమ్బోల్ శెఙ్గణ్మాల్ ఎన్ఱొరువన్,



పారోర్కళెల్లామ్ మకిழ ప్పఱై కఱఙ్గ,
చ్చీరార్ కుడమ్ ఇరణ్డేన్ది, శెழுన్దెరువే
యారారెన చ్చొల్లి యాడుమతు కణ్డు,
ఏరారిళములైయా రెన్నైయరు మెల్లారుమ్,
వారాయో వెన్ఱార్క్కు చ్చెన్ఱే నెన్వల్వినైయాల్,
కారార్ మణినిఱముమ్ కైవళైయుమ్ కాణేన్ నాన్,
ఆరానుమ్ శొల్లిఱ్ఱుమ్ కొళ్ళేన్, అఱివழிన్దు
తీరా వుడమ్బొడు పేతుఱువేన్ కణ్డిరఙ్గి,
ఏరార్ కిళిక్కిళవి యెమ్మనై తాన్ వన్దెన్నై,
చ్చీరార్ శెழுమ్ పుழுతి క్కాప్పిట్టు శెఙ్గుఱిఞ్జి
త్తారార్ నఱుమాలై చ్చాత్తఱ్కు, త్తాన్ పిన్నుమ్,
నేరాతన వొన్ఱు నేర్న్దాళ్, అతనాలుమ్
తీరా తెన్ శిన్దైనోయ్ తీరా తెన్ పేతుఱవు,
వారాతు మామై యతు కణ్డు మఱ్ఱాఙ్గే,
ఆరాను మూతఱియు మమ్మనైమార్ శొల్లువార్,
పారోర్ శొలప్పడుమ్ కట్టుప్పడుత్తిరేల్,
ఆరానుమ్ మెయ్ప్పడువనెన్ఱార్, అతు కేట్టు
క్కారార్ కుழల్ కొణ్డై కట్టువిచ్చి కట్టేఱి,
శీరార్ శుళకిల్ శిల నెల్ పిడి త్తెఱియా,
వేరా వితిర్విలిరా మెయ్ శిలిరా క్కై మోవా
పేరాయిర ముడైయానెన్ఱాళ్, పేర్ త్తేయుమ్
కారార్ తిరుమేని కాట్టినాళ్, కైయతువుమ్
శీరార్ వలమ్బురియే యెన్ఱాళ్, తిరుత్తుழாయ్
త్తారార్ నఱుమాలై కట్టురైత్తాళ్ కట్టురైయా,
నీరేతుమఞ్జేన్మిన్ నుమ్మకళై నోయ్ శెయ్తాన్,

ఆరాను మల్లన్ అఱిన్దేనవనై నాన్,
కూరార్వేళ్కణ్ణీ రుమక్కఱియ క్కూఱుకేనో,
ఆరాలివ్వైయ మడియళప్పుణ్డతుతాన్,
ఆరాలిలజ్గై పొడిపొడియా వీఴ్న్దతు, మఱ్ఱ్-
ఱ్ఱారాలే కన్మారి కాత్తతుతాన్, ఆఴినీ
రారాల్ కడైన్దిడప్పట్టతు, అవన్గాణ్మిన్
ఊరా నిరై మేయ్త్తు ఉలకెల్లా ముణ్డుమిఴ్న్దుమ్,
ఆరాత తన్మైయనాయ్ అజ్గొరునాళాయ్ప్పాడి,
చ్చీరార్ కలైయల్కుల్ శీరడి చ్చెన్దువర్ వాయ్,
వారార్ వనములైయాళ్ మత్తార ప్పఱ్ఱిక్కొణ్డు,
ఏరారిడై నోవ వెత్తనైయోర్ పోతుమాయ్,
చ్చీరార్ తయిర్ కడైన్దు వెణ్ణెయ్ తిరణ్డతనై,
వేరార్ నుతల్ మడవాళ్ వేఱోర్ కలత్తిట్టు,
నారారుఱి యేఱ్ఱి నన్గమైయ వైత్తతనై,
పోరార్ వేఱ్కణ్మడవాళ్ పోన్దనైయుమ్ పొయ్యుఱక్కమ్,
ఓరాతవన్పోలుఱజ్గి యఱివుఱ్ఱు,
త్తారార్ తడన్దోళ్కళుళ్ళవుమ్ కై నీట్టి,
ఆరాత వెణ్ణెయ్ విఴుజ్గి, అరుకిరున్ద
మోరార్ కుడ మురుట్టి మున్ కిడన్ద తానత్తే,
ఓరాతవన్పోల్ కిడన్దానై క్కణ్డవళుమ్,
వారా త్తాన్ వైత్తతు కాణాళ్ వయిఱడిత్తి
జ్గారార్ పుకుదువా రైయరివరల్లాల్,
నీరా మితు శెయ్తీరెన్థోర్ నెడుజ్కయిఱ్ఱాల్,
ఊరార్కళెల్లారుమ్ కాణ వురలోడే,
తీరా వెకుళియళాయ్ చ్చిక్కెన ఆర్ త్తడిప్ప,



ఆరా వయిఱ్ఱినోడాఱ్ఱాతాన్, అన్ఱియుమ్,
నీరార్ నెడుజ్గయత్తై చ్చెన్ఱలైక్క నిన్ఱురప్పి,
ఓరాయిరమ్ పణ వెజ్గో వియల్ నాకత్తై,
వారా యెనక్కెన్ఱు మఱ్ఱతన్ మత్తకత్తు,
చ్చీరార్ తిరువడియాల్ పాయ్న్దాన్, తన్ శీతైక్కు
నేరావ నెన్ఱోర్ నిశాశరి తాన్ వన్దాళై,
క్కూరార్న్ద వాళాల్ కొడిమూక్కుమ్ కాతిరణ్డుమ్,
ఈరా విడుత్తవట్కు మూత్తోనై, వెన్నరకమ్,
శేరా వకైయే శిలై కునిత్తాన్, శెన్దువర్ వాయ్
వారార్ వనములైయాళ్ వైతేవి కారణమా,
ఏరార్ తడన్దోళిరావణనై, ఈరైన్దు
శీరార్ శిర మఱుత్తు చ్చెఱ్ఱుకన్ద శెజ్గణ్మాల్
పోరార్ నెడువేలోన్ పొన్ పెయరో నాకత్తై,
క్కూరార్న్ద వళ్ళుకిరాల్ కీణ్డు, కుడల్మాలై
శీరార్ తిరుమార్పిన్మేల్ కట్టి, శెజ్గురుతి
శోరా క్కిడన్దానై క్కుజ్గుమత్తోళ్ కొట్టి,
ఆరా వెఴున్దా నరియురువాయ్, అన్ఱియుమ్
పేర్ వామననాకియ కాలత్తు, మూవడి మణ్
తారా యెనక్కెన్ఱు వేణ్డి చ్చలత్తినాల్,
నీరేఱ్ఱులకెల్లామ్ నిన్ఱళన్దాన్ మావలియై,
ఆరాత పోరి లశురర్కళుమ్ తానుమాయ్,
క్కారార్ వరై నట్టు నాకమ్ కయిఱాక,
ప్పేరామల్ తాజ్గి క్కడైన్దాన్, తిరుత్తుఴాయ్
త్తారార్న్ద మార్పన్ తడమాల్వరైపోలుమ్,
పోరానై పొయ్కైవాయ్ క్కోట్పట్టు నిన్ఱలఱి,

నీరార్ మలర్క్కమలమ్ కొణ్డోర్ నెడుఞ్జెయాల్,
నారాయణా వో మణివణ్ణా నాకణైయాయ్,
వారా యెన్నారిడరై నీక్కాయ్, ఎన వెకుణ్డు
తీరాత శీగ్ర్ఱతాల్ శెన్టిరణ్డు కూఱాక,
ఈరావతనై యిడర్ కడిన్దా నెమ్బెరుమాన్,
పేరాయిరముడైయాన్ పేయ్ ప్పెణ్డీర్ నుమ్మకళై,
త్తీరా నోయ్ శెయ్తానెన వురైత్తాళ్, శిక్కెన మగ్ర్
ఱారాను మల్లామై కేట్టెజ్గళమ్మనైయుమ్,
పోరార్ వేఱ్కణ్ణీ రవనాకిఱ్పాన్దుఴాయ్,
తారా తొఴియుమే తన్నడిచ్చియల్లళే,మగ్ర్
ఱారానుమల్లనే యెన్టొఴిన్దాళ్, నానవనై
క్కారార్ తిరుమేని కణ్డతువే కారణమా,
ప్పేరా ప్పితగ్ర్ఱా త్తిరితరువన్, పిన్నైయు
మీరా ప్పుకుతలు మివ్వుడలై త్తణ్ వాడై,
శోరా మఱుక్కుమ్ వకై యఱియేన్, శూఴ్కుఴలా
రారాను మేశువరెన్ను మతిన్ పళ్ళియై,
వారామల్ కాప్పతఱ్కు వాళా విరున్దొళిన్దేన్,
వారాయ్ మడనెఞ్జే వన్దు, మణివణ్ణన్
శీరార్ తిరుత్తుఴాయ్ మాలై నమక్కరుళి
త్తారాన్ తరు మెన్టిరణ్డత్తి లొన్టతనై,
ఆరానుమొన్నాతార్ కేళామే శొన్నక్కాల్,
ఆరాయుమేలుమ్ పణి కేట్టతన్టెనిలుమ్,
పోరాతొఴియాతే పోన్దిడు నీ యెన్టేఱ్కు,
క్కారార్ కడల్వణ్ణన్ పిన్పోన నెఞ్జముమ్,
వారాతే యెన్నై మఱన్దతుతాన్, వల్వినైయేన్



ఊరారుకప్పతే యాయినేన్, మగ్ర్ఱెనక్కి
జ్గారాయ్వారిల్లై యఴల్వాయ్ మెఴుకుపోల్,
నీరా యురుకు మెన్నావి, నెడుఙ్కణ్గళ్
ఊరా రుఱఙ్గిలుమ్ తానుఱఙ్గా, ఉత్తమన్టన్
పేరాయినవే పితగ్ర్ఱువన్, పిన్నైయుమ్
కారార్ కడల్పోలుమ్ కామత్తరాయినార్,
ఆరే పొల్లామై యఱివారతు నిఱ్క,
ఆరాను మాతాను మల్లళవళ్ కాణీర్,
వారార్ వనములై వాశవతత్తై యెన్టు,
ఆరానుమ్ శొల్లప్పడువాళ్, అవళున్దన్
పేరాయ మెల్లా మొఴియ పెరున్దెరువే,
తారార్ తడన్దోళ్ తళైక్కాలన్ పిన్ పోనాళ్,
ఊరారికఴ్న్దిడప్పట్టాళే, మగ్ర్ఱెనక్కి
జ్గారానుమ్ కఱ్పిప్పార్ నాయకరే, నా నవనై
క్కారార్ తిరుమేని కాణుమళవుమ్ పోయ్,
శీరార్ తిరువేఙ్గడమే తిరుక్కోవ
లూరే, మతిట్కచ్చి యూరకమే పేరకమే,
పేరా మరుతిఱుత్తాన్ వెళ్ళఱైయే వె.ॅ.కావే,
పేరాలితణ్గాల్ నఱైయూర్ తిరుప్పులియూర్,
ఆరామమ్ శూఴ్న్ద వరఙ్గమ్, కణమఙ్గై
క్కారార్ మణినిఱ క్కణ్ణనూర్ విణ్ణకరమ్,
శీరార్ కణపురమ్ శేఱై తిరువఴున్దూర్,
కారార్ కుడన్దై కడికై కడన్మల్లై,
ఏరార్ పొఴిల్ శూఴ్ ఇడవెన్దై నీర్మలై,
శీరారుమ్ మాలిరుమ్శోలై తిరుమోకూర్,

పారోర్ పుకழும் వతరి వడమతురై,
ఊరాయ వెల్లా మొழிయామే నా నవనై,
ఓరానై కొమ్బుశిత్తోరానై కోళ్విడుత్త
శీరానై, చ్ఛెఙ్గణెడియానై, త్తేన్ తుழாయ్
త్తారానై, త్తామరైపోల్ కణ్ణానై, ఎణ్ణరుమ్ శీర్
పేరాయిరముమ్ పితఱ్ఱి, ప్పెరున్దెరువే
యూరా రికழிలు మూరా తొழிయేన్ నాన్,
వారార్ పూమ్ పెణ్ణై మడల్,

కమ్బర్ పాట్టు

ఊరాతొழிయే నులకఱియ వొణ్ణుదలీర్
శీరార్ ములై త్తడఙ్గళ్ శేరళవుమ్ – పారెల్లామ్
అన్నోఙ్గి నిన్ఱళన్దాన్ నిన్ఱ తిరునఱైయూర్
మన్నోఙ్గ వూర్వన్ మడల్



తిరుమఙ్గైయాழ்వార్ తిరువడికళే శరణమ్.

## శిఱియతిరుమడల్ తాత్పర్యసంగ్రహము

(మహావిద్వాన్ కాంచీ ప్ర.భ అణ్ణాస్వామి వారి దివ్యార్థ దీపిక నుండి)

ఈ తిరుమడల్ మిగిలిన ప్రబంధములవలె నాల్గుపాదములనుకల పాశురములతో కూడినది కాదు. మిక్కిలి దీర్ఘమైన ఏకవాక్యరూపములో నున్నది. ఇందలి పదములకు ప్రతిపదార్థము తెలుపబడినను, అఖండవాక్యార్థము మనస్సున తేటపడుట మిక్కిలి కష్టము కావున, ఆ కొఱత తీరునట్లు మూలమును ఇంచుమించుగా స్పృశించుచు ఈ ప్రబంధసారార్థము పాఠకసౌకర్యార్థము ఇచట వ్రాయబడుచున్నది.

భగవానుని పత్ని అగుటచే భూదేవి స్త్రీలకు తగిన లక్షణములను చక్కగా కల్గియున్నది. ఎట్లనగా – అగ్రములలో నల్లగా నుండు రెండు స్తనములను స్త్రీలు కల్గియుందురు. ఈ భూదేవికూడ మేఘములు వ్యాపించియుండుటచే నల్లనివియైయున్న అగ్రభాగములను (శిఖరములను) కల్గినవగు తిరుమాలిరుమ్శోలై, తిరువేఙ్గడమ్ అను రెండు గొప్ప పర్వతములను స్తనములుగా కల్గియున్నది. స్త్రీలు చక్కని వస్త్రమును ధరింతురు కదా ! ఈ భూదేవికూడ సముద్రమును వస్త్రముగా అలంకరించుకొనియున్నది. స్త్రీలు బాగుగా ప్రకాశించు తిలకమను ఆభరణమును ఫాలభాగమున అలంకరించుకొందురు. భూదేవికూడ సూర్యుని తిలకాభరణముగా కల్గియున్నది. స్త్రీలు రత్నహారములచే భూషితమగు వక్షఃస్థలమును కల్గియుందురు. ఈమెకూడ కలగియుండుటచేత,రత్నములను కొట్టుకొనివచ్చుటచేత ఎఱ్ఱగానున్న ప్రవాహజలమునుకల కొండవాగులను రత్నభూషితమైన వక్షఃస్థలముగా కల్గియున్నది. స్త్రీలు నల్లని కురులను కల్గియుందురు. అట్లే , ఈ భూదేవియు కాలమేఘములను కురులుగా కల్గియున్నది. కులసతులు చక్కని రక్షణను కల్గియుందురు. ఈమె కూడ ఆవరణజలమును తనకు కాపుగా కల్గియున్నది.

ఈ రీతిలో వనితలకు తగిన లక్షణములను చక్కగా కల్గియున్న ఈ భూమి యందు నివసించు మానవులచే పురుషార్థములుగా చెప్పబడునవి – ధర్మ, అర్థ, కామములను మూడు. వీనిలో ప్రధానమగు కామమును పొందినవారికి మిగిలిన రెండును సులభముగా లభించినవి అగును.

ఈ మూడు పురుషార్థములేకాక, మోక్షమను నాల్గవ పురుషార్థము కలదని పల్కుట వివేకము లేని మాటయే. వివేకమును కలవారు మోక్షమనెడి ఒక పరోక్షపురుషార్థముకలదని చెప్పరు. దీనిని మీరు చక్కగా గ్రహించునట్లు నేను వివరించి పల్కెదను – వినుడు

మోక్షమునకు పోవువారు సూర్యమండలమును భేదించుకొని, దాని ద్వారా పయనింతురు. ఆ సూర్యుడు ఒకే చక్రమునుకల రథములో నుండునట. ఆ రథమునకు ఏడు అశ్వములు కట్టబడియుండునట. ఆ గుఱ్ఱములు మేఘమండలమందు సంచరించునట.

మిక్కిలి తక్కువ ప్రదేశములోనుండి, మనము భయపడకుండ చూచుటకు వీలుకాని ఆ సూర్యమండలమును భేదించుకొని ఒకడు ప్రయాణమును చేయుట అనునది ఎంత నమ్మదగిన మాట అనుటను మీరే విమర్శింపవచ్చును.

ఈ దారిలో పోయిన వారికి పునరావృత్తి లేని ఒక వైకుంఠలోకము లభించునట. అందు అపర్యాప్తామృతము అనుభవింపబడునట. ఇదియే మోక్షపురుషార్థమట. ఇది అంతయు అసత్యమే తప్ప ఇట్టిది ఒకటి ఉండియుండుటకు అవకాశమున్నదా !

ఇట్టి మోక్షమనునది ఒకటి కలదనియే అనుకొందము. చీకటి గదిలో పెట్టిన దీపమువలె, సకలగుణములను బాగుగా ప్రకాశించుచోటు అగు అర్చావతారమును విడచి, "ఉన్నదో ! లేక లేదో ! " అని సందేహింపతగినట్టి ఆ మోక్షమును పొందుటకూడ ఒక పురుషార్థమేనా ! కుందేలును విడచి కాకివెంటబడుటవంటిదియే కదా ఇది ! ఇకపై ఆళ్వార్లు కృష్ణావతారములోని కుంభ నృత్య లీలలో ఆకర్షితులై, ఆ స్వామిని దర్శింప వీలుకాకుండుటచే స్త్రీ భావనను ఆరోపించుకొని మడల్ ఎత్తవలెనని నిశ్చయించుకొనిన నాయికావచనములతో తమ దశను తెలుపుచున్నారు.

ఓ వనితలారా ! నాకు ఎదురైన అవస్థను తెలిపెదను వినుడు. నేను లోకములో సంసారజీవనమును స్త్రీలు సాగించు రీతిలోనే నా కురులను దువ్వి, ఎత్తి ముడికట్టి, కంచుకమును దాల్చి, నా నడుమునకు ఒడ్డాణమును అలంకరించుకొని, కంటికి కాటుకను పూసికొని, సకల అలంకరణలను చేసికొని, బంతి ఆటలో ఆసక్తురాలనై ఉంటిని. అట్లుండగా, తామరసనేత్రుడను పేరును పొందిన వాడొకడు అందఱు సంతోషించునట్లు పఱై (డప్పు)ను వాయించుచు, "ఈ నృత్యము బారినుండి తప్పించుకొని, బ్రతుక గల్గిన కాంతలు ఈ వీథిలో కలరా !" అని పల్కుచు కుంభనృత్యమును చేయుచుండగా, స్త్రీలు అందఱు "ఓ పరకాల నాయకీ ! కుంభనృత్యమును దర్శించుటకు నీవును రాకూడదా !" అని పిలువగా, చాలని కాలము బలముగా నుండుటచే నేను చటుక్కున లేచి, అచటికి పోయితిని.

అట్లు వెడలి చూచిన వెంటనే నా మేనికాంతిని కోల్పోయితిని. నా గాజులు జారిపోయినవి. ప్రియమును పల్కువారు, హితమును చెప్పువారును పలుకు మాటలను వినలేని స్థితికి చేరితిని. నా జ్ఞానము పూర్తిగా నశించినది. శరీరము నశించినచో సహించి యుండవచ్చును. కాని, అదియును పోలేదే ! బేలతనము ఏర్పడినది. ఇట్లున్న నన్ను నా తల్లి చూచి బాధపడి, ఎట్లయినను నన్ను సేదదీర్చవలెనని తలచి, భాగవత శ్రీపాదధూళిని కొనివచ్చి నాకు రక్ష పెట్టినది. శెఙ్కుఱుచ్చి మాలను చిహ్నముగా కల్గిన శాస్త (బుద్ధుడు లేక అయ్యప్ప) అను దేవతాంతరమునకు అంజలి కూడ చేసినది. ఇంతచేసినను నా మనోవ్యాధి తీరలేదు. పట్టిన పిచ్చి పోలేదు. కోల్పోయిన దేహకాంతి తిరిగి రాలేదు.



ఇట్లు నేను తల్లడిల్లుటను చూచిన ప్రాచీనవృత్తాంతములను తెలిసిన కొందఱు వృద్ధవనితలు వచ్చి, "అయ్యో ! జోస్యమును (గుర్తును) చెప్పు కోయవనితను పిలిచి ప్రశ్న అడుగవచ్చునుకదా ! ఈ బాధకు కారణమేమో తెలియునుకదా ! ఇది సులభమైన ఉపాయము కదా ! " అని పల్కిరి. అపుడు ఒక కోయస్త్రీ తానుగానే నా వద్దకు వచ్చి. దైవావేశమును పొంది, ఒక చిన్న చేటలోనున్న కొంత ధాన్యమును పిడికిలితో పట్టుకొని, గుఱిచూచి విసరి, రోమాంచమును కల్గినదియై, చేతిని వాసన చూచి, సహస్రనామములను కలవాడగు నారాయణుని చింతించి, అతని కాలమేఘసదృశరూపమును, శంఖచక్రభూషితములగు బాహువులను, బాహువులపై, వక్షఃస్థలముపై, వెలుగొందు కిరీటముపై, పాదములపై అలంకరింపబడిన చల్లని తులసీ మాలను అభినయించి చూపి, పిమ్మట నోఱు తెఱచి "తల్లులారా! మీరు కొంచెము కూడ భయపడవద్దు. ఏదో ఒక కొత్త దైవము మీ కుమార్తెను పీడించుటలేదు,. బాధను కల్గించిన దైవమును గ్రహించితిని. మీకు తెలియునట్లు చెప్పెదను వినుడు.

ఈ లోకములను కొలిచినవాడు, లంకను భస్మీపటలమును చేసినవాడు, గోవర్ధనమును ఎత్తి, శిలావర్షమునుండి గోగోపగోపికాజనమును కాపాడినవాడు, అమరులు అమృతమును ఆస్వాదించునట్లు పాలకడలిని చిలికినవాడు, ఎవడో అతడే ఊరిలోని పశువులనన్నిటిని మేపియు, లోకములు అన్నియు ప్రళయజలమున మునుగకుండునట్లు ఒకానొక సమయమున ఉదరమున పెట్టుకొని, రక్షించి, పిమ్మట బయల్పఱచినవాడు – ఇంత చేసినను తృప్తిచెందనివాడై, ఇంకను తన గుణములు ప్రకాశింపవలెనని రేపల్లెలో వెన్నను దొంగిలించి, ఆ అపరాధము కారణముగా చిన్న ముడులుగల దారములతో రోలుకు యశోదచే కట్టబడినవాడు, కాళియుడను సర్పరాజు యొక్క పీచమణచినవాడు, శూర్పణఖ ముక్కు, చెవులను ఖండించి, ఆమె అన్న అగు ఖరుని యుద్ధరంగములో నరకబాధను అనుభవించునట్లు భంగపఱచి, వధించినవాడు, సీతాదేవి కొఱకు రావణుని శిరస్సులను త్రుంచినవాడు, నరసింహరూపుడై హిరణ్యకశిపుని వక్షస్సును చీల్చినవాడు, మహాబలి చేతి నుండి దానమును గ్రహించి, ముల్లోకములను కొలిచినవాడు, కూర్మరూపియైన మందరపర్వతమును ధరించి, వాసుకిని దారముగా గొని సముద్రమును చిలికినవాడు, తులసీమాలను అలంకరించుకొన్నవాడు, గజేంద్రుని మొసలిబారి నుండి కాపాడినవాడు, సహస్రనామములను కలవాడుగా ప్రసిద్ధుడు అయినవాడు, ఆ స్వామియే మీ పిల్లను ఈ పాట్లు పెట్టుచున్నాడు – అని కట్టువిచ్చి అన్నది.

ఈ మాటలను విన్న నా తల్లి "అమ్మా ! వేఱు ఏ దేవతాంతరము ఈ బాధను కల్గింపలేదుకదా ! ఆ భగవానుడేకదా దీనికి కారణము ! అతడే అయినచో , తన దాసురాలగు

ఈమెకు తన తులసీమాలను ప్రసాదముగా అనుగ్రహింపడా ! తప్పక ఇచ్చును" అని పల్కి, విచారమును వీడి స్వకార్యనిమగ్నురాలైనది.

స్వామి కుంభనృత్యమును చేసినపుడు అతని మేఘసమానరూపమును కన్నులార దర్శించినది మొదలు నేను నా స్థైర్యమును కోల్పోయి, విచారమును పొందితిని. ఈ స్థితిలో మలయమారుతము వీచి, విరహముతో బాధపడు నా శరీరమునకు పెట్టిన వేదన చెప్పలేనిది. చేతిలో మడల్‌ను (తాటి మట్టను) పట్టుకొని వీధుల వెంబడి పోవలయునను నిశ్చయమును కల్గినదానను అయినను ఎవరైనను కొందఱు అపవాదు పల్కుదురేమోనని తలచి అట్లు పోలేక పోయితిని.

ఇక, అతనివద్దకు దూతగా ఎవరినైనను పంపెదమని తలచి, వేరెవ్వరని అందులకు అనుకూలముగా గమనింపలేక, నా మనస్సునే దూతగా పిలచి "ఓ మనస్సా ! నీవు మణివర్ణుని వద్దకు పోయి, అతని తులసీమాలను ప్రసాదముగా ప్రార్థించుము. "ఇచ్చెదను, లేక ఇవ్వను" అను ఏదో ఒక సమాధానమును అతడు పల్కునట్లు నేను చెప్పి పంపుమాటను ఇతరుల చెవికి సోకకుండునట్లు రహస్యముగా పల్కుము. అది విని అతడు ప్రేమతో విచారించినను సరియే, లేక " ఆసంగతి నాకు ఏమియు తెలియదు" అని తిరస్కరించినను సరియే. ఏదో ఒక బదులు తెలిసికొని , అచటనే ఉండి, ఆలస్యము చేయకుండ, త్వరగా తిరిగి రమ్ము." అని పల్కి పంపితిని. నాపట్ల అసూయను కల్గిన ఊరిలోనివారి కోఱికయే తీరినది. నా మనస్సే నాకు సహాయపడనప్పుడు ఇక వేఱెవరు నాకు సహాయము చేయుదురు ? నన్ను గూర్చి విచారించి, బాధపడువారే లేరు. నిప్పు సమీపమున నున్న మైనమువలె నా ఆత్మ వస్తువు కఱగి పోవుచున్నది. ఊరంతయు నిద్రించినను నా కన్నులు మాతబడుటలేదు. అతనిని మఱచి అయినను బ్రతుకవచ్చును. కాని, అట్లు మఱచిపోలేక, అతని నామములనే నోఱు తెఱచి, సదా అనుసంధించుచున్నాను.

"నాయకుడు తానే వచ్చును. కొంచెము సహించి యుండవద్దా ! ఈ విధముగా కూడ త్వరపడతగునా ! " అని అందురా ! బాగుగా పల్కితిరి ! సముద్రునివలె ఉప్పొంగిన కామమును కలవారు మంచిచెడులను తెలిసికొని , తదనుగుణముగా అణగియుండగలరా! వాసవదత్త అను ప్రసిద్ధ అయిన కాంత తన సఖులను అంధఱిని విడచి, బంధింపబడిన వత్సరాజుతో పాటు బయలుదేరి పోయినదికదా ! ఆమెను నిందించినవారు ఎవరైనను కలరా! ఆమెవలె నిశ్చయమునుకల నాకు ఈ నిర్ణయమునకు వ్యతిరేకముగా స్వరూప శిక్షను చేయువారు నాకు నాయకులు కారు. వారి మాట నేను వినను. ఇక ఏమి చేయుదునందురా ! వినుడు. అతని (స్వామి) తిరుమేనిని సేవించి, ప్రేమ ఫలింపవలెనని వేంకటాచలము మొదలగు దివ్యదేశములలో ప్రవేశించి, అతని గుణములకు చేటువచ్చు నూతన సహస్రనామములను పల్కుచు, నన్ను తప్పుపట్టు వారి మాటలను వినకుండ, వీధుల వెంట మడల్ అనుష్ఠించెదను. తప్పక అనుష్ఠించెదను.

శ్రీమతే రామానుజాయ నమః

## పిళ్ళైలోకమ్‌జీయరరుళిచ్చెయ్‌త
# తనియన్ వ్యాఖ్యానమ్

### అవతారికై

(ముళ్ళి చ్చెఴుమలరోర్) "శబ్దాదివిషయఙ్గళిన్ సన్నిధియిలే మనస్సు పరితపియామల్, భగవత్ప్రావణ్యత్తుక్కు అనుగుణమాక 'తిరుమడల్' ఎన్గిఱ దివ్యప్రబన్ధత్తై ఉపకరి త్తరుళువతే!" ఎన్ఱు ఆఴ్వార్ తిరువడికళిల్ ప్రేమముడైయారుడైయ ఈడుపాడా యిరుక్కిఱతు. అన్నిక్కే, స్వవిశ్లేషత్తిల్ సాంసారిక విషయఙ్గళిలే మనస్సు పరితపియాతపడి స్వప్రసాదత్తై ప్రసాదియామల్, తామ్ మడలెడుక్క ఉపక్రమిత్త పాశురమాన మడలైయే తన్దువిట్టారెన్ఱాకవుమామ్.

పిళ్ళైతిరునఱైయూరరైయరరుళిచ్చెయ్‌ద
శిఱియతిరుమడల్ తనియన్.

ముళ్ళిచ్చెఴుమలరోర్ తారాన్‌ముళై మతియమ్,
కొళ్ళిక్కెన్నుళ్ళమ్ కొతియామే,----వళ్ళల్
తిరువాళన్ శీర్ క్కలియన్ కార్‌క్కలియైవెట్టి,
మరువాళన్ తన్దాన్ మడల్.

---

పిళ్ళై తిరునఱైయూరరైయర్ అనుగ్రహించిన

**శిఱియతిరుమడల్ తనియన్**

**ముళ్ళిచ్చెఴుమలరోర్ తారాన్ ముళైమదియమ్**
**కొళ్ళిక్కెన్నుళ్ళమ్ కొదియామే – వళ్ళల్**
**తిరువాళన్ శీర్ క్కలియన్ కార్ క్కలియై వెట్టి**
**మరువాళన్ తన్దాన్ మడల్**

శెఴుమ్ = నిబిడమైన, ఓర్ = అద్వితీయమైన, ముళ్ళిమలర్ తారాన్ = ముళ్ళిపూవులచే కట్టబడిన మాలను కలవారై, వళ్ళల్ = ఉదారులై, తిరువాళన్ = (భగవత్కైంకర్యమనెడి) సంపదను కలవారై, మరువాళన్ = (చేతిలో) అమరియున్న ఖడ్గమును కలవారైన, శీర్ కలియన్ = కల్యాణగుణములు నిండుగానున్న తిరుమఙ్గైయాఴ్వార్లు, ముళై

వ్యా.--(ముళ్ళి చ్చెళ్లుమలరోర్ తారాన్) తమక్క సాధారణమాయ్ అద్వితీయమాయిరుక్కిఱ ముళ్ళిప్పూవై త్తారాకవుడై యవరెన్నుతల్, "వకుళత్తారాన్ " ఎన్నుమాపోలే, అన్త్రిక్కే, "మలరో" ఎన్ఱు పాఠమానపోతు, నమ్మపేక్షితమాన ముళ్ళి చ్చెళ్లుమలర్ మాలైయైయో

---

మది అమ్ కొళ్ళికు్క = ఉదయించు చంద్రుడనెడి అందమైన అగ్నికి, ఎన్ ఉళ్ళమ్ = నామనస్సు, కొదియామే = పరితపింపకుండునట్లు, కార్ కలియై = నల్లని కలిదోషమును, వెట్టి = పోగొట్టి (నఱికి), మడల్ తన్దాన్ = "శితియతిరుమడల్" – అను దివ్యప్రబంధమును అనుగ్రహించిరి.

**శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన తనియన్ వ్యాఖ్యానము అవతారిక–ఆంధ్రానువాదము** (భావదీపిక)

శబ్దాదివిషయముల సామీప్యమున మనస్సు బాధపడకుండునట్లు, భగవానుని యందు అభినివేశమును కల్గియుండుటకు తగినట్లును **"తిరుమడల్"** అనెడి దివ్యప్రబంధమును అనుగ్రహించుటయా!" అని తిరుమఙ్గై యాళ్వార్ల శ్రీపాదములందు ప్రేమను కలవారి (భక్తుల) అభినివేశమును ఈ పాశురము వ్యక్తము చేయుచున్నది. (ఈ నిర్వాహమును అనుసరించి, భగవద్భక్తులకు, భగవద్విశ్లేషమునందు వారు ప్రాణమును ధరించుటకు ఈ ప్రబంధము సాధనమై యున్నది అని తాత్పర్యము). లేక, ఆళ్వార్ల పట్ల అభినివేశమును కలవారు వారిని విశ్లేషించి, ఇతర విషయములలో ఆసక్తులై, బాధపడకుండనుండునట్లు తాము అలంకరించుకొని విడచిన ముళ్ళి పూమాలను (తమ ప్రసాదమును) అనుగ్రహింపకుండ, తాము భగవానుని విషయముగా మడల్ఎత్తుటకు ఆరంభించిన ప్రబంధమగు **"శితియతిరుమడల్"** అను ప్రబంధమును అనుగ్రహించిరి – అనియు చెప్పవచ్చును. (ఇది వేరొక నిర్వాహము)

**తనియన్ వ్యాఖ్యానము – అనువాదము**

(**ముళ్ళిచ్చెళ్లుమలరోర్ తారాన్**) తమకు అసాధారణమై – అనగా తిరుమఙ్గైమన్నన్ అగు తమకొఱకే ఏర్పడినదియై, అసమానమైనది అగు ముళ్ళి పూలమాలను కలవారు. **"వకుళత్తారానై"** (తిరువాశిరియత్తనియన్) అని నమ్మాళ్వార్లను నిర్దేశించునట్లే, (**ఓర్ తారాన్**) సాటిలేని మాలను కలవారు అని అర్థము. తమను విశ్లేషించి, బాధించు భగవానుని తులసీమాల కూడ, విశ్లేషములో ధారకమగు ఆళ్వార్‌మాలకు సాటికాదు అని అర్థము. (ఇది అవతారికలోని మొదటి నిర్వాహమునకు సరిపోవును.) రెండవ నిర్వాహమునకు తగినట్లు **"ముళ్ళిచ్చెళ్లుమలరో తారాన్"** అను వేరొక పాఠము కలదు.

(**ముళ్ళిచ్చెళ్లుమలరో తారాన్**) – ఆళ్వార్ల దాసులమగు మనకు ముళ్ళిపూవుల మాలను ఆళ్వార్లు మనకు ఇవ్వలేదు. పూవును నిర్దేశించు **"మలర్"** అను పదము – ఆ పూవులతో కూర్పబడిన మాలకు ఉపలక్షణము.) దానికి బదులుగా శితియతిరుమడల్ ప్రబంధము అనెడి మాలెనే మనకు అనుగ్రహించిరి అని తాత్పర్యము. **(తామరై ఎన్నుమ్ పొరుళదాన "ముళరి"**



తరుకిఱిలర్ ఎన్ఱాకవుమామ్. మలరెన్ఱతు-మాలైక్కు ఉపలక్షణమ్, ఎతుక్కాక త్తార్ తర వేణుమెన్నిల్, (ముళైమతియమ్ కొళ్ళిక్కెన్నుళ్ళమ్ కొతియామే) ముళైత్తెళ్లున్ద తిఙ్గళ్ విరహికళాయిరుప్పార్‌క్కు తాపహేతువిఱే. " పోన్ద వెణ్డిఙ్గళ్ కతిర్ శుడమెలియుమ్" ఎన్ఱిఱే ఇవరుమ్, నాట్టార్ క్కు మప్పడియే, " చన్ద్ర శ్చణ్డకరాయతే" ఎన్ఱు చంద్రమణ్డలమ్ చణ్డమణ్డలమాయిరుక్కై, "తాన్యేవారమణీయాని". ముళైమతి అమ్ కొళ్ళి యెన్నుతల్, ముళైమతియమాకిఱ కొళ్ళి యెన్నుతల్, అమ్ కొళ్ళి అళకియ కొళ్ళి యెన్నుతల్. ఇతు పఞ్చవిషయత్తుక్కు ఉపలక్షణమ్. "మల్లికైకమళ్ తెన్ఱలీరుమాలో వణ్కుఱిఞ్జియిశై తవరుమాలో " ఎన్ఱుమ్, "వాడైతణ్వాడై వెవ్వాడైయాలో మేవు తణ్మతియమ్ వెమ్మతియమాలో

---

**ఎన్నుమ్ శొల్ ముళ్ళి యెన మరువి గ్ర్గైన్ఱుకొణ్డు తామరైమాలైయై యణిన్దుళ్ళవరెన్ఱు పొరుళ్ కూఱువారుమ్ శిలరుళర్.** ఈనాటికిని ఈ మూలరూపమునగల ఆభరణవిశేషమును తిరువాలి తిరునగరిలో దర్శింపవచ్చును. కొందరు వ్యాఖ్యాతలు – తామరపూవు అను అర్థమిచ్చు **"ముళరి"** అను పదమే **"ముళ్ళి"**గా మారెనని, కావున **"ముళ్ళిచ్చెళ్లుమలర్"** అనుటకు నిబిడమైన, తామరపూలమాల అని అర్థమని తెలిపిరి – దివ్యార్థ.)

మడల్ ప్రబంధమును ఆళ్వార్లు ఎందులకు అనుగ్రహింపవలయును ? అనినచో – (**ముళైమదియమ్ కొళ్ళిక్కెన్నుళ్ళమ్ కొదియామే**) – ఉదయించు చంద్రుడు విరహములో నున్నవారికి తాపమును కల్గించును కదా ! అందుచే (వారికి) ఉదయచంద్రుడొక మండునట్టి కట్టెవంటివాడు. **"పోన్ద వెణ్‌తిఙ్గళ్ కదిర్‌శుడర్ మెలియుమ్"** (పెరియతిరు – 2-7-3) (బయటకు ప్రసరించు తెల్లని, చంద్రుని కిరణములు నిప్పువలె దహింపగా, అందుచే బాధపడుచుంటిని.) అని విరహదశలో తాపమును కల్గించు చంద్రుని సూర్యునిగానే పల్కిరి కదా ! లోకములోనున్నవారికిని **"చంద్రః చండకరాయతే"** (చంద్రుడు తీవ్రమైన కిరణములనుకల సూర్యుడగుచున్నాడు) – అనునట్లు చంద్రమండలము చండ (సూర్య) మండలమైయుండును. శ్రీరాముడును **"యాని స్మరమణీయాని తయా సహ భవంతి మే, తాన్యేవారమణీయాని జాయంతే మే తయా వినా"** (సీతతో కలసియున్నపుడు రమణీయములుగా ఏవి కలవో, అవియే ఆమె లేకున్నచో ఆనందమును కల్గింపనివి అగుచున్నవి) అని పల్కెను కదా !

(**ముళైమదియమ్ కొళ్ళి**) – **"ముళైమదియమ్ కొళ్ళి"** – అనగా ఉదయించు చంద్రుడనెడి జ్వలించుకట్టె అనియు చెప్పవచ్చును, లేక, **"ముళైమది – అమ్–కొళ్ళి"** – ఉదయించు చంద్రుడను అందమైన జ్వలించు కట్టె అనియును చెప్పవచ్చును. ఇచట **"మదియమ్"** అనుచు చంద్రుని పల్కుట, విరహములో బాధించునట్టి చంద్రుడు, మల్లికలు, కుఱిఞ్జిరాగము, వేడిగాలి, పూలపడుక–అను అయిదు విషయములకును ఉపలక్షణము. **"మల్లికైకమళ్ తెన్ఱలీరుమాలో వణ్ కుఱిఞ్జిశై తవరుమాలో"** అనియు (తిరువాయ్ – 6-9-1) (మల్లిపూల పరిమళమునుకల

మెన్మలర్ ప్పళ్ళి వెమ్ పళ్ళియాలో'' ఎన్గుమితే విశ్లేష త్తిల్ విషయఙ్గళిన్ బాధకత్వాకారఙ్గ ళిరుప్పతు. అతుతాన్ విషయానుగుణమాయితే యిరుప్పతు. అకైయాల్ కుళిర్న్ద చన్ద్రనై క్కొళ్ళిపోలే కణ్డు ఎన్ హృదయమ్ పరితపియాతే ఆళ్వార్ పణ్ణిన ఉపకారమే! (వళ్ళల్ తిరువాళన్ శీర్క్కలియన్) వళ్ళల్- పరమోదారర్. తిరువాళన్ - భగవత్ప్రత్యాసత్తియాకిఅ ఐశ్వర్యత్తైయుడై యవర్. (వళ్ళల్ తిరువాళన్) ఇవరౌదార్యమ్ పణ్ణుకైక్కు్కడలాన ఐశ్వర్యమ్. (శీర్క్కలియన్) భగవద్భక్త్యాది గుణఙ్గళైయుడైయవర్. (కార్క్కలియై వెట్టి) కలికన్రి యాకైయాలే, అజ్ఞానావహమాన కలియై క్కడిన్దు. కలిదోషమితే కామపరవశరాకిఅతు, అప్పడి అప్రాప్త విషయత్తిల్ కామమ్ వారాతపడి. (మరువాళన్ తన్దాన్ మడల్) తిరుక్కైయిలే మరువియిరుక్కిఅ వాళై యుడైయవర్. భగవత్కామత్తుక్కనుగుణమాన "తిరుమడల్''

మయమారుతము అయ్యో ! నన్ను బ్రద్దలు చేయుచున్నది. అందమైన కుఱిఞ్జిరాగము నన్ను తొలుచుచున్నది.), **"వాడై తణ్వాడై వెవ్వాడైయాలో మేవు తణ్ మదియమ్ వెమ్మదియుమాలో మెన్మలర్ పళ్ళి వెమ్బళ్ళియాలో''** (తిరువాయ్ - 6-9-4) (అయ్యో ! చల్లని ఉత్తరపు గాలి మండుచున్న ఉత్తరపు గాలి అయినది. ఆశపడతగిన, చల్లని చంద్రుడును వేడిమిని కల చంద్రుడయ్యెను. మృదువైన పూలపడుక వేడి పడుక అయినది.) అనికదా నమ్మాళ్వార్లు విరహిజనులను బాధించు విషయములను గూర్చి పేర్కొనిరి. శబ్దాదివిషయములు అయిదు సంఖ్యలో ఉన్నట్లే , ఇవి కూడ అయిదుగా ఉన్నవి. **"ముళైమదియమ్ కొళ్ళికు్కు ఎన్నుళ్ళమ్ కొదియామే ముళ్ళి చ్చెళ్ళుమలరో తారాన్''** అని రెండవ నిర్వాహమున ముందుగా, **"ముళైమదియమ్ కొళ్ళికు్కు ఎన్నుళ్ళమ్ కొదియామే తన్దాన్ మడల్''** అని రెండు నిర్వాహములందును పిమ్మటను అన్వయించి, అర్థమును చెప్పవలెను.)

**(ముళైమదియమ్ కొళ్ళికె్కన్నుళ్ళమ్ కొదియామే తన్దాన్ మడల్)** – చల్లని చంద్రుని మండు కట్టెనువలె చూచి, నా మనస్సు, పరితపింపకుండునట్లు ఆళ్వార్లు చేసిన ఉపకారము ఎంతటిదో కదా ! ఈ ఉపకారమును చేసినవారెవరు ? అనగా – **(వళ్ళల్ తిరువాళన్)** – "వళ్ళల్'' – అనగా గొప్ప ఉదారుడు. (ఎందులకనగా) భగవానుడుకూడ సహాయపడని దశలో వీరు సహాయపడుటచే. **(తిరువాళన్)** – వళ్ళల్ అనునపుడు చేతులార తీసి దానమిచ్చుటకు తగిన సంపద ఉండవలెనుకదా ! వీరు అట్టి సంపదను కలవారు, ఆ సంపద ఏమనగా – భగవద్భక్తియే. సంపద ఉన్నను, దానిని చేతుల నిండుగా తీసి ఇచ్చుటకు తగిన దయాగుణము కావలయునుకదా, ఉదారులగుటకు. అది కూడ కలదు – అనుచున్నారు. **(శీర్ కలియన్)** – దయాదిగుణములను కలవారు కలికన్రి. (తిరుమఙ్గైయాళ్వార్లు) . వీరు మడల్(మట్ట)ను ఇచ్చువారైనచో, ముళ్ళను నఱికి కదా, మడల్ను తీసికొనిరావలెను – అన్నచో, **(కార్కలియై వెట్టి)** – నల్లని కలి అనెడి ముళ్ళను నఱికి, మడల్ను ఇచ్చిరి – అని భావము. (**"కార్కలియై వెట్టి''** అనునపుడు **"వెట్టి''** అను పదమును విశేషణముగా గ్రహించిన, కలిదోషమును



ఎన్గిఅ దివ్యప్రబన్ధత్తై యుపకరి త్తరుళినార్. (మరువాళన్) భగవదనుభవత్తిలుణ్డాన భోగ్యత్తై, వడివిల్ తొడైకొళ్ళలామ్బడియానవర్. "ఇవళ వన్దణ్డుళ్ళాయ్ కమఴ్న్దల్''. మరు - పరిమళమ్. మరువు- మరువుతలాయ్, ఎమ్బెరుమానై క్కిట్టుకైయై స్వభావమాక ఉడైయవరెన్నుమామ్. అన్రిక్కే, చేతనరై క్కిట్టి ఆళుకిఅవ రెన్నుమామ్. ఆకైయాల్, చేతనరై త్తమ్బడియాక్క వేణ్డి మడలై యుపకరి త్తరుళినార్. మాలైయై త్తారాతే మడలై త్తన్దవిట్టా రెన్దాకవుమామ్.

శితియతిరుమడల్ తనియన్ వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు.

పిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

పోగొట్టినవారనియు అర్థము. **"మదియమ్''** అనునపుడు **'అమ్'** అనునది పాదపూరకము – దివ్యార్థ) **(కలి)** ఇచట నల్లగా ఉండుట అనగా – అజ్ఞానమను చీకటిని కల్గించునదిగా ఉండుట. అజ్ఞానమును కల్గించు కలిని ఖండించినవారు కలికన్రి అగుటచే (కలివైరి అగుటచే) అని భావము. ఆ ముళ్ళను నఱుకుటకు కత్తి కావలెను కదా ! అది వీరి వద్దకలదా ! అన్నచో, **(మరువాళన్)** – పొందికగానున్న కత్తిని కలవారు. అనగా చేతిలో చక్కగా అమరియున్న ఖడ్గమును కలవారు. **"వాళ్''** అనునది స్వాపదేశములో జ్ఞానమును సూచించును. (**"జ్ఞానాసినా''** అను గీతా ప్రయోగమును గమనింపనగును.) యథార్థ జ్ఞానమను కత్తితో అజ్ఞానమను చీకటిని ఖండించిరి – అని ఇచటి తాత్పర్యము. **(మరువాళన్)** – **"మరు''** అను పదము పరిమళమును తెలుపును కావున, భగవదనుభవమనెడి పరిమళమును దేహమున ఆఘ్రాణించునట్లున్నవారు – అనియు అర్థము. (ఈ అన్వయమున**–మరు+ఆళ్** అని పదచ్ఛేదము. **ఆళ్** అనగా వ్యక్తి. మధ్యలో అకారమునకు వకారము సంధివశమున వచ్చినది.) **"ఇవళ్ అన్దణ్తుళ్ళాయ్ కమఴ్దల్''** (తిరువాయ్ – 8-9-10) (ఈమెయందు అందమైన, చల్లని తులసి పరిమళించుటకు) అను తిరువాయ్మొళ్ళి సూక్తిని గమనింపతగును. **(మరువాళన్)** – **మరువుదల్** – అనగా సమీపించుట అని అర్థము కావున, పరమపురుషుని సమీపించుటయే స్వభావముగా కలవారను అర్థమునుకూడ ఇచట గ్రహింపవచ్చును. (లేక, చేతనులను, మరువి – వారిని తామే సమీపించి, **ఆళన్** – వారిని ఏలువారు **(మరు–ఆళన్)** కూడ అను అర్థమును చెప్పవచ్చును. కావున, చేతనులను. ముళ్ళిపూలతో నిబిడముగా కూర్చబడిన మాలనుకల్గిన తమవలె చేయుటకై మడల్ ప్రబంధమును అనుగ్రహించిరి అని అర్థము.) రెండవ నిర్వాహమున – మాలను అనుగ్రహింపకుండ మడల్ను అనుగ్రహించిరి అనియును భావము. (ఆళ్వార్లకు దాసులగుటచే భక్తులు ఆ ఆళ్వార్లు ధరించివిడచిన ముళ్ళి పూలమాలను అభిలషింతురు. **"అన్నైయుమ్ అత్తనుమ్ అడియేనుక్కు ఎన్రు ఇరఙ్గిఱ్ఱిలళ్''** (తల్లి, తండ్రియు ఈమెపట్ల దయజూపలేదు.) అను ఈ ఆళ్వార్లు వీరికి దాసులుగా తమను నిశ్చయించుకొనుటచే, తాము దాల్చినమాలను ఇవ్వకుండ, తాము అనుగ్రహించిన మడల్ ప్రబంధమును ప్రసాదించిరి–అని దీని తాత్పర్యము.)

శ్రీమతే రామానుజాయ నమః

పెరియవాచ్చాన్పిళ్ళై యరుళిచ్చెయ్‌త

# శితియతిరుమడల్ వ్యాఖ్యానమ్

## అవతారికై

కీర్‌ర్ అనుభవిత్తతు జ్ఞానానుభవమాకైయాలే బాహ్యసంశ్లేషాపేక్షై పిఱన్దు, అతు కిడైయామైయాలే తిరుక్కుడన్దైయిలే శరణమ్ పుక్కార్ తిరువెళ్ళుకూర్‌ర్రిరుక్కైయిలే. ఇప్పడి శరణమ్ పుక్కవళవిలుమ్ నినైవు పూరియామైయాలే "ఇతుక్కు హేతువెన్ ? ఎన్నిల్, ఎమ్బెరుమాన్ తాన్ అజ్ఞన్, అశక్తన్, అప్రాప్తనాయ్ త్తార్‌క్కిఱతన్ఱు, ఇని, విలమ్బ హేతు ఇరణ్డుతలైక్కు మిన్ఱిక్కే యిరుక్కచ్చెయ్‌తే ఇని త్తార్‌క్కిఱతు- కూడల్ శెయ్య

---

# తిరుమఙ్గైఆళ్వార్లు అనుగ్రహించిన
# శితియతిరుమడల్

(పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానము – ఆంధ్రానువాదము)

## అవతారిక

తిరుమఙ్గై ఆళ్వార్లు పూర్వము (తిరుక్కుఱున్దాణ్డకమ్ అను దివ్య ప్రబంధములో **"ఎన్‌మనత్తువన్ద విదియినై క్కణ్డుకొణ్డ తొణ్డనేన్ విడుకిలేనే"** (నా మనస్సులోనికి వచ్చి నిలచిన, భాగ్యస్వరూపియైన స్వామిని దర్శించి, దాసుడనగు నేను ఇక ఏనాడును విడువలేను.) అను మొదలగు సందర్భములలో) మానసమైన జ్ఞానముతో పరమపురుషుని దర్శించి అనుభవించుటచే, బాహ్యేంద్రియములతో భగవానుని దర్శించి, ఆలింగనము చేసికొని , స్పృశించి, కైంకర్యమును చేయవలెనని ఆశపడి అది లభింపక పోవుటచే దానిని పొందుటకు తిరువెళ్ళుకూర్‌ర్రిరుక్కైయందు **"శెల్వమ్ మల్‌కు తెన్ తిరుక్కుడన్దై అన్దణర్ మన్దిరమొழிయుడన్ వణఙ్గ, ఆడరవమళియల్ అఱితుయిలమర్‌న్ద పరమ ! నిన్నడియిణై పణివన్"** (సంపదనిండియున్నదగు దక్షిణదిక్కులోనున్న కుడన్దైలో నమస్కరించునట్లు బ్రహ్మణులు వేదమంత్రోచ్చారణను చేయుచు, నమస్కరించునట్లు, పడగలతో ఆడు ఆదిశేషుడను పడుకలో ఆసక్తుడవగు సర్వేశ్వరా! ఈ సంసారములో కల్గు దుఃఖములు తీరునట్లు నీ పాద ద్వయములను ఆశ్రయింతును.) అనుచు శరణుజొచ్చిరి. అట్లు శరణువేడినను, బాహ్యేంద్రియములతో అనుభవింపవలెను ఆశ తీరకపోవుటచే, దీనికి కారణమేమి? అని విచారించిరి. సర్వేశ్వరుడగు పరమపురుషుడు వీరి స్థితి తెలియనివాడుగాని నుండుటచే ఆలస్యము చేయునట్టివాడు కాడు. శరణుపొందిన వీరు ఇకపై చేయవలసినది ఏదైన ఉండుటచే, ఆలస్యము చేయుచున్నవాడును కాడు. ఇట్లు తామసించుటకు వీరిరువురివద్ద ఏ కారణము లేకున్నను, ఆలస్యము చేయుటకు



నినైయామైయాలే, అనపిన్బు "ఇత్తలైయై యఱ్ఱిత్తాకిలుమ్ ముకమ్ కాట్టువిత్తుక్కొళ్ళువోమ్" ఎన్గిఱ త్వరైయిన్ మికుతియై కృష్ణావతారత్తిల్ కుడక్కూత్తిలే యకప్పట్టు అవనై క్కిడైయామైయాలే మడలెడుక్క త్తుణిన్దాళొరుపిరాట్టియుడైయ పాశురత్తాలే స్వదశైయై ఆవిష్కరిక్కిఱార్.

మడలావతు- "తుల్యశీలవయోవృత్తామ్ తుల్యాభిజనలక్షణామ్" ఎన్గిఱపడియే ఇరువరు మొత్త పరువత్తరాయ్, పుంస్త్వత్తుక్కేకాన్తమాన అఱివు, నిఱైవు, ఓర్‌ప్పు, కడైప్పిడి-ఎన్గిఱ గుణఙ్గళాలే అవనుమ్ పూర్ణనాయ్, స్త్రీత్వత్తుక్కే కాన్తమాన నాణ్, మడమ్, అచ్చమ్, పయర్‌ప్పు - ఎన్గిఱగుణఙ్గళాలే యివళుమ్ పూర్ణైయాయ్, ఇప్పడి యిరువరుమ్ కుఱైవఱ్ఱవర్‌కళాయిరుక్క, తోழிమారుమ్ తానుమాక ఉద్యానత్తిలే పూక్కొయ్య వెన్ఱు పుఱప్పడ, అవనుమ్ వేట్టైక్కెన్ఱు పుఱప్పట్టు చ్చోలైయిలే పుకుర, దైవయోగత్తాలే కూడినతాకైయాలే ఉయిర్‌త్తోழிయుఙ్గూడ అన్యపరైయానవళనిలే యాదృచ్ఛికమాక ఇరువర్‌క్కుమ్ దృష్టిబన్ధమ్ పిఱన్దు అతువే యడియాక సంశ్లేషమ్ ప్రవృత్తమాక. "ఉన్మస్తక

---

కారణము – వీరితో కలుపవలెనని అతడు సంకల్పింపకుండుటచేతనే. అందుచే ఆళ్వార్లకు "తమ స్వరూపమగు పారతంత్ర్యమును వీడి అయినను అతనిని (భగవానుని) వచ్చునట్లు చేయవలెను" అనెడి అతిశయితమైన త్వరకల్గినది. ఆత్వరాతిశయమును, శ్రీకృష్ణుడై అవతరించినపుడు చేసిన కుంభనృత్యమునందు అభినివేశమును పొంది, ఆ భగవానుని ఆలింగనము చేసికొనుటకు వీలులేకపోవుటచే, మడల్ ఎత్తగోరిన ఒక నాయిక పల్కు పాశురముతో (మాటతో) తమ స్థితిని ఈ ప్రబంధములో వ్యక్తీకరించుచున్నారు.

**"మడల్"** అనగా ఏమి అనినచో, **"తుల్యశీలవయోవృత్తామ్ తుల్యాభిజనలక్షితామ్, రాఘవోఽ ర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (రా.సు16–5) (సమానమైన గుణము, వయస్సు, శీలము మొదలగువానిని కల్గినది, సమానమైన కులము, అందము మొదలగువానిని కల్గినది అగు సీతకు రాముడే తగినవాడు, అతనికి కూడ నల్లని నేత్రములనుకల ఈమెయే తగినది) అను రీతిలో నాయకీనాయకులు ఇద్దఱు తగిన వయస్సును కలవారై, (మగవానికి తగిన) జ్ఞానము, గౌరవము (పూర్తి), విచక్షణ జ్ఞానము, నిశ్చయశక్తి అనుగుణములలో నాయకుడు పూర్ణుడై, (స్త్రీత్వమునకు తగిన) లజ్జ, భవ్యత, భయము, పతివిరహాసహిష్ణుత్వము (ప్రతివిరహమునకు పాలిపోవుట) అను గుణములతో నాయకి పూర్ణయై – ఇట్లు ఇద్దఱును పూర్ణులైయున్నసమయము, నాయకి సఖులతో కలసి పూవులను కోయుటకై (ఉద్యానవనమునకు) వెడలగా, నాయకుడు వేటకై బయలుదేరి ఆ తోటలోనికే ప్రవేశించెను. ఈ వీరిద్దరికలయిక విధివశముచే సంభవించినదగుటచే (అపుడు) ఆమె ప్రాణస్నేహితురాలును అన్యకార్యాసక్తయై యుండెను. నాయకీనాయకులు ఇరువురును అపుడు పరస్పరము అనురాగముతో చూచుకొనుటద్వారా వారిమధ్య మానసికబంధమేర్పడినది. ఆ బంధము

రసమాక క్కలన్ద కలవియాకైయాలే నత్కోట్టాలే యిరణ్డు తలైక్కు మఱ్ఱివువరుమ్'' ఎన్ఱు ఇత్తై ముడియనడత్తక్కడవతాకప్పార్ త్త దైవన్దానే పిరిక్క, ఇరువరుడైయ బన్ధుక్కళుమ్, పునైయిழை కళణివు మాడైయుడైయుమ్ పుతుక్కణిప్పుమ్ నినైయుమ్ నీర్మైయతన్ఱు'' ఎన్నుమ్బడి ఇరువర్ వడివిలేయుమ్ వేఱుపాడు కణ్డు ఇరువరైయుమ్ కావల్ శెయ్య, అతువే యడియాక ఇవర్ కళాఱ్ఱ్రావై శతశాఖమాక ప్పణైక్క, ఎతిర్ త్తలైయై క్కిడైయామైయాలే మఱ్ఱ త్తలై శెయ్యుమ్ సాహసప్రవృత్తియాయిఱ్ఱు మడలావతు.

ఇవర్కళ్ మడలెడుక్కిఱ వితుక్కు ప్రయోజన మెన్ ఎన్నిల్, ఇవ్వుపక్రమత్తైక్కణ్డు ఇరువరుడైయ బన్ధుక్కళుమ్ కూట్టుతల్, అన్ఱియే, రాజాక్కళ్ కూట్టుతల్, అన్ఱియే, ఇరువర్ బన్ధుక్కళుమ్ ఇరువరైయుమ్ కైవిడ, అలక్కుప్పోర్పోలే ఒరువర్క్కొరువర్ తఞ్జమాయ్

---

కారణముగా ఇరువురికి సంశ్లేషము ఏర్పడినది. "ఆనందము ఉన్మస్తకమగురీతిలో ఏర్పడిన ఆ సంశ్లేషము నిరంతరము ఇట్లే కొనసాగినచో, ప్రవాహవేగమువలన పైరు పాడగునట్లు, నాయకీనాయకులు ఇద్దరును ఆనందాతిరేకమును భరింపలేక వారికి ఏదయిన ప్రమాదము కలుగవచ్చును. అందుచే మెల్లమెల్లగా అనుభవించునట్లు చేయవలెను" అని వీరి కలయికను చివరివరకు ఎట్టి ఆటంకములు లేకుండనుండవలెనని తలచిన దైవమే వీరిని విశ్లేషించునట్లుచేసెను. నాయకీనాయకులు ఇద్దఱియొక్క బంధువులు **"పునైయిழైకళణివుమ్ ఆడైయుడైయుమ్ పుదుక్కణిప్పుమ్ నినైయుమ్ నీర్మైయదన్ఱు"** (తిరువాయ్ 9-8-5) (అలంకరించు కొనదగిన ఆభరణముల అలంకారములు, ధరించిన వస్త్రములు, తిరుమేని నవీనకాంతి, – స్థిరముగా ఆలోచించినచో ఈ సౌందర్యమును తలపదగిన స్వభావమును కల్గినవి కావు.) అనురీతిలో ఇద్దఱి శరీరమునందు ఏర్పడిన వ్యత్యాసములను (విరహచిహ్నములను) చూచి, ఇద్దఱిని (ఒకరినొకరు కలువకుండ) కావలిలో పెట్టిరి. అదియే కారణముగా వీరి విశ్లేషవ్యసనము నూఱువేలరెట్లు వృద్ధి అయినది. అపుడు ఎదుటి వారిని (నాయకీనాయకులు ఒకరినొకరు) పొందలేకపోవుటచే నాయకుడుగాని, నాయకిగాని చేయు సాహసప్రయత్నమే – మడల్ అనునది.

మఱి ఈ సాహసప్రయత్నమేమి ? అనగా – ఎదుటివారి (నాయకునియొక్క, లేక, నాయకి యొక్క) స్వరూపరూపగుణవిభూతులను పాడుచేయుటకు ప్రయత్నించుట. అనగా – నాయకుని రూపమును ఒక చిత్రపటములో వ్రాసి, ఆ రూపమునే దృష్టిమరల్చకుండ చూచుచు, నేయి, పాలు మొదలగు భోగ్యపదార్థములను భుజించుట మాని, స్నానము చేయుట, కాటుకను పెట్టుకొనుటవంటి అలంకారములను చేసికొనకుండ, గుఱ్ఱమురూపములో తాటిమట్టను మలచి, దాని పైకి ఎక్కి, ఊరంతయు తనతోవచ్చుచున్నట్లు తలచి, తలవిరగబోసికొని, "ఇతడు– (లేక–ఈమె) నన్ను విడచినాడు (నది), ఇతడు దయారహితుడు, ఇతడు కఠినుడు, క్రూరుడు. ఇతడు చేసిన దుష్కార్యములకు అవధిలేదు" అని ఈ విధముగా



క్కూడిప్పోతల్, అన్ఱిక్కే, ''మడలెడుత్తు ఎతిర్త్తలైయై ప్పెఱామైయాలే ఇత్తలై ముడిన్దతు'' ఎన్ను మేఱ్ఱత్తై ప్పెఱ్ఱుప్పోతల్; ఇవై ప్రయోజనమాక.

''వళవేழులకిల్'' తఙ్గళయోగ్యతైయై యనుసన్ధిత్తు అకలుమ్ స్వభావరాన ఇవర్కళ్ ఇస్సాహసప్రవృత్తియిల్ ఇఱఙ్గువానెన్ ? ఎన్నిల్; మడలెడుత్తు అత్తలైయై యழிక్క ప్పుకుకిఱార్ కళల్లర్ కళే. ''ఊర్వన్ మడల్'' ఎన్ఱు, ''చాప మానయ సౌమిత్రే'' ఎన్ఱు విల్లై

---

వీధివీధిలో పెద్దగా పలుకుచు, వినువారందఱును భయపడి, జాలిపడునట్లు తిరుగుటయే మడల్ ఎత్తుట. ఎదుటివారిలోనున్న స్వరూపరూపగుణవిభూతులను లేకుండునట్లు ప్రచారముచేయుట అనగా– వానిని నశింపజేయుటయేకదా ! ఈ నాయకీనాయకులు ఇట్టి కఠినప్రవృత్తి అగు మడల్ ఎత్తుటకు ఏమి కారణము? అనినచో, వీరిట్లు మడల్ ఎత్తుటకు ప్రయత్నించుటను చూచి, వారి బంధువులు వారిద్దఱిని కలుపుటకు ప్రయత్నింపవచ్చును. లేక, ఇట్లు మడల్ ఎత్తుటను వినిన ఆదేశప్రభువు వారిని కలుపవచ్చును. లేక, ఇరువురి బంధువులు వీరిరువురిని చేయివిడువగా, "**అలక్కుప్పోర్**" (వీరులు కత్తి, ఈటె మొదలగు తమ ఆయుధములను ఒకదానికొకటి ఆధారముగా నిలుపుటవలన ఏర్పడు ఆయుధసమూహము) వలె ఒకరికి వేరొకరు ఆధారమై, కలువవచ్చును. ఇవి ఏమియు లేకున్నను – "మడల్ ఎత్తిన తరువాతకూడ ప్రేమికుని (లేక, ప్రేయసిని) పొందలేకపోవుటచే నాయకి (లేక, నాయకుడు) మరణించినదినాడు" అను గౌరవమును పొందుటయే ప్రయోజనము.

"**వళవేழులకిల్**" (తిరువాయ్ 1–5) అను దశకములో నమ్మాళ్వార్లవలెనే తమనైచ్యమును భావించి తాము మిక్కిలి ఉన్నతుడగు భగవానుని దరిచేరుట ఆ స్వామికి అవద్యకరము. అను అభిప్రాయముతో అతనిని విడచి దూరముగా పోవు స్వభావమునుకల ఈ దివ్యసూరి ఇట్టి కఠినప్రవృత్తియందు (మడల్ ఎత్తుటలో) ఆసక్తిని పొందవచ్చునా ? అనినచో, చివరివరకు మడల్ఎత్తి, భగవానుని స్వరూపాదులను నశింపజేయువారు కాదుకదా వీరు (తిరుమఙ్గైయాళ్వార్లే). "**మాశఱుశోది**" (తిరువాయ్ – 5–3) అను దశకములో "**ఆణైయెన్ తోழீ ఉలకుతోఱు అలర్తూఱ్ఱు ఆమ్ కోణైకళ్శెయ్దు కుతిరియాయ్ మడలూర్తుమే**" (సఖీ! లోకములో అంతట అపవాదు ప్రసిద్ధమగునట్లు చేసి, చేయుటకు వీలయిన, అతనికి నిందాకరములైన పనులను చేసి, సిగ్గులేని దాననై, మడల్ ఎత్తైదను, నాకేమి అడ్డము!) అని, "**యామ్ మడలూర్న్దుమ్ ఎమ్అழிయమ్ కైప్పిరానుడై తూమడల్ తణ్ణన్తుழாయ్ మలర్ కొణ్డు శూడువోమ్**" (మనము మడలెఎత్తియు, అందమైన శ్రీహస్తమున సుదర్శనమునుకల మనస్వామి యొక్క, పవిత్రములైన దళములనుకల చల్లని తులసీమాలలను తీసికొనివచ్చి, అలంకరించు కొందము.) అనియును మడల్ ఎత్తైదనని నమ్మాళ్వార్లు భగవానుని భయపెట్టినట్లే, వీరు (తిరుమఙ్గైయాళ్వార్లు)ను "**ఊరాతొழிయేన్ నాన్ వారార్ పూమ్పెణ్ణైమడల్**" అని, "**ఉలకఱియ ఊర్వన్ నాన్ మన్నియ పూమ్ పెణ్ణైమడల్**" అనియును భయపెట్టి, భగవానుని వచ్చునట్లు

క్కాట్టి వేలైయై యచ్చ వుఱుత్తినాఱ్పోలే అచ్చ ముఱుత్తి ముకమ్ కాట్టువిత్తు క్కొళ్ళుకిఱవర్కళాకైయాలే తఙ్గళ్ తుణివై చ్చొల్లవే అవన్ వరు వెన్ఱు శొల్లుకిఱార్కళత్తనైయల్లతు మడలెడుక్కిఱార్ కళన్ఱిఱే. అయోగ్యనెన్ఱు అకన్ఱతుమ్ విలక్షణవస్తువెన్ఱు అనుసన్ధిత్తిఱే. గుణాధిక్యముమ్, వైలక్షణ్యముమ్ అనుసన్ధిత్తపడియాలేయిఱే ఇవర్కళాఱ్ఱామాట్టాతే వఴియల్లా వఴియే యాకిలుమ్ పెఱవేణు మెన్ఱు మేల్విఴుకిఱతు.

ఇవర్కళుక్కు మొరు స్వభావ ముణ్డు, తఙ్గళై యనుసన్ధిత్తపోతు అయోగ్యరెన్ఱు అకలువర్కళ్; అవనై యనుసన్ధిత్తపోతు తఙ్గళైయమ్ పారాతే మేల్విఴువర్కళ్. అత్తలైయై అనుసన్ధిక్కచ్చెయ్తే ఇత్తలై తోన్ఱాతిఱే, అత్తాలే మేల్విఴుకిఱార్కళ్. ఆనాల్ అవర్కళ్

చేయవలెననితలచిరేకాని, వాస్తవమునకు మడల్‌ను అనుష్ఠింపలేదు. "**చాప మానయ సౌమిత్రే శరాం శ్చాశీవిషోపమాన్, సాగరం శోషయిష్యామి**" (రా.యు.21-22) (లక్ష్మణా వింటిని, సర్పములవంటి బాణములను తీసికొనిరమ్ము, సముద్రమును ఇంకించెదను) అనుచు శ్రీరాముడు బాణములను చూపి సముద్రమును భయపెట్టినట్టి ఈ మడల్‌కూడ. భగవానుని పొందవలెను అను విషయమున తమకుగల స్థిరమైన నిశ్చయమును తెలిపినచో, అతడు తనకుతానే పరుగెత్తి వచ్చును అని తలచి ఇట్లు పలుకుచున్నారే తప్ప, మడల్‌ను అనుష్ఠించి, భగవద్వైభవమును పాడుచేయవలెనను ప్రకృతిని కలవారుకారుకదా వీరు. వీరు తమ నైచ్యమును చూచి దూరముగా తొలగుటకూడ భగవద్వైభవమును అనుసంధించియే కదా ! ఆ గుణాధిక్యమును (భగవానుడను) విషయముయొక్క గొప్పతనమును అనుసంధించుట చేతనేకదా. దానిని విశ్లేషించుటను సహింపలేక, వీరు (ఆళ్వార్లు) స్వరూపమునకు తగని నోమునోచుట (తిరుప్పావై), మడల్‌నుఎక్కుట మొదలగు కృత్యములలో ఆసక్తులై, అతనిని పొందగోరుచున్నారు.

విషయగౌరవమే దూరముగా తొలగుటకును, దగ్గఱకు చేరుటకును కారణమగునా? అనినచో, విషయముయొక్క గొప్పతనమును చూచి, తమ నైచ్యమును (తక్కువదనమును) మాత్రమే స్మరించినపుడు "మనము దఱి చేరకుడదు" అని తొలగిపోవుదురు. అతనిని (గొప్పతనమును) స్మరించుటలోనే అసక్తులై ఉన్నపుడు, తమ నైచ్యమును లెక్కింపకుండ అతనిని దరిచేరవలెనని ప్రయత్నించెదరు. ఎంత అనుభవించినను తృప్తికల్గింపని అమృతము (ఆరావముదము) వంటి అతనిని దర్శించినపుడు తమ నైచ్యము గుర్తుకురాదుకదా ! అందుచే అతని దఱికి చేరుదురు. ఇట్లు అయినను, తమకు సహజమైన పురుషభావనలోనే పలుకకుండ, నాయికాభావనను పొంది, పలుకతగునా ? అనినచో, ఆత్మయొక్క స్వరూపనిరూపకధర్మములు స్త్రీలయొక్క అసాధారణగుణములవలె గొప్పగా ప్రకాశించుట చేతను, ముఖ్యముగా అనన్యార్హశేషత్వము, అనన్యశరణత్వము, అనన్యభోగ్యత్వము అను పతివ్రతకు తగిన గుణములు



పేచ్చై ప్పేశువాన్ ఎన్ ? ఎన్నిల్, ఆత్మస్వరూపవైలక్షణ్యత్తాలుమ్, అనన్యార్హ శేషత్వాదికళాలుమ్, అన్వయత్తిల్ ధరిక్కైయాలుమ్, వ్యతిరేకత్తాల్ ధరియామైయాలుమ్, జ్ఞానమ్ విశదమానాల్ ఇవ్వాత్మవస్తువుమ్ పిరాట్టిమారోడొక్కు మాకైయాలుమ్, ఇవర్కళుమ్ మయర్వఱ మతినల మరుళప్పెఱ్ఱవర్క ళాకైయాలే పిరాట్టిమార్ పేచ్చాలే పేశుకిఱార్కళ్.

"కడలన్న కామత్తరాకిలుమ్ మాతర్ మడలూరార్ మఱ్ఱైయార్మేల్" ఎన్ఱు స్త్రీకళ్ పురుషర్కళ్‌మేల్ మడలూరక్కడవరల్లరెన్ఱు, లక్షణమ్ కాట్టిక్కిడక్కచ్చెయ్తే ఇప్పిరాట్టి మడలూరు వానెన్ ? ఎన్నిల్, ఆశై యొరు తలైక్కోయాయ్, ఒరుతలై లక్షణప్పడియే ఆశైయై మర్యాదైయిలే నడత్తలామాకిల్ అతు శెయ్యలావతు, "ఆశైమిక్కార్ మడలూరు మత్తనైయెన్నుమ్" ఆర్యమర్యాదైయాలే మడలూర ఉపక్రమిక్కిఱార్కళ్.

---

ఆత్మకుకూడ పరమాత్మను ఉద్దేశించి ఉండుటచేతను, విశేషించి ఆళ్వార్లవంటి మహనీయులు భగవానునితో కలసియున్నప్పుడే జీవించియుండగల్గుట, విడిపోయినచో ప్రాణములను ధరింపలేక పోవుట, (ముక్తిదశలో) జ్ఞానము స్ఫుటముగా ప్రకాశించునపుడు ఈ ఆత్మ లక్ష్మీదేవితో చాలవరకు పోలియుండుట చేతను, ఈ ఆళ్వార్లు ఈ లోకములోనున్నపుడే "**మయఱ్వఱ మదినలమ్ అరుళినన్**" అనునట్లు భగవానుని నిర్హేతుకకృపచే భక్తిరూపాపన్నమగు జ్ఞానమును పొందినవారగుటచే ఇచటనే లక్ష్మీదేవితో సామ్యమును కల్గియుండుటచేతను నాయిక మాటలతో పలుమార్లు దివ్యసూరులనబడు ఆళ్వార్లు పల్కుదురు.

"**కడలన్న కామత్తరాకిలుమ్ మాదర్ మడలూరార్ మఱ్ఱైయార్వేల్**" (సముద్రమందటి ప్రేమను కలవారైనను స్త్రీలు పురుషులనుగూర్చి మడల్ ఎత్తరాదు.) అనియు "**కడలన్న కామ ముఴన్దుమ్ మడలేఱా ప్పెణ్ణిఱ్పెరున్దక్కతిల్**" (కుఱళ్ - 1137) అనియును తమిళలక్షణ గ్రంథములలో తెల్పినరీతిలో స్త్రీలు పురుషులను ఉద్దేశించి మడల్ అనుష్ఠింపకూడదు అను లక్షణమును తెలుపబడియుండగా, పిరాట్టి దశను పొందిన వీరు మడల్‌ను ఎత్తవచ్చునా? అనినచో, స్త్రీ-పురుషులిరువురిలో అవధిలేని ప్రేమ పురుషునకుమాత్రమే ఉండునని, స్త్రీలకు లక్షణగ్రంథములలో తెల్పినంతమాత్రములోనే ప్రేమ పరిమితముగానుండునని చెప్పుటకు వీలున్నచో స్త్రీలు మడల్ ఎత్తరాదని అడ్డుపెట్టవచ్చునేమో ! కాని, వాస్తవము అట్లులేదే ! స్త్రీ పురుషులిద్దఱికిని సమానముగా ఆశ అవధిలేకుండ నుండుటను లోకమున చూచుచున్నాము గదా ! అందుచే అంతులేని ప్రేమను కలవారు స్త్రీ పురుషులలో ఎవరైనను మడల్ ఎత్తవచ్చునను ఉత్తరదేశమర్యాదను అనుసరించి పరకాలనాయకి మడల్‌ను అనుష్ఠించుటకు ప్రయత్నించుచున్నది.

ఇట్లు స్త్రీ అయినను, పురుషుడైనను ప్రేమ అంతులేకుండ ఉండుట వారికి సహజమై ఉండగా, తొల్‌కాప్పియమ్ మొదలగుగ్రంథములందు తమిళవిద్వాంసులీ విధముగా స్త్రీ

పిన్నై తమిழ்ழర్ శెయ్‌తతుక్కు హృదయమెన్ ? ఎన్నిల్: రాజాజ్ఞైయిలే ఆశైయై వరమ్బుకట్ట ప్పార్‌త్తతుక్కు హృదయమేతెన్ఱుఱిన్దతిల్లై. మయర్వఱ మతినల మరుళప్పెర్ఱవర్‌కళ్ "ఆఱివుడైయారాకిల్ అనుష్ఠిక్కక్కడవతల్ల" ఎన్ఱు అవర్‌కళ్ నిషేధిత్త కామత్తై అనుష్ఠిక్కిఱార్‌కళో ? వెన్నిల్ అప్పడి నిషేధిత్త కామ మల్ల. "నిదిధ్యాసితవ్యః" ఎన్ఱు వేదాన్తత్తిలేవిధిక్కిఱ భగవద్భక్తియై కామ మెన్గిఱతు. ఆకైయాలే విహితమాన వృత్తియై క్కామమెన్గిఱతు. మడలెడుక్కైయావతు. తన్నుడైయ స్త్రీత్వత్తుక్కుమ్ అవనుడైయ పురుషోత్తమత్వత్తుక్కుమ్ శేరువతొన్ఱన్ఱు, అవన్ తానే వరక్కాణ్ఱై కాణ్ స్త్రీత్వమావతు" ఎన్ఱు

---

విషయమున ఒక అవధిని విధించుటలో ఏమి తాత్పర్యము ? అనినచో, రాజాజ్ఞతో ప్రేమను నియంత్రించునట్లు, లక్షణవచనములతో స్త్రీల ప్రేమనుగూర్చి ఒక అవధిని కల్పించవలెనని తలచుటలో అభిప్రాయమేమో మాకు తెలియకున్నది. "**మానోక్కిన్ అన్న నడైయార్ అలరేశ ఆడవర్‌మేల్, మన్ను మడలూరా రెన్బదోర్ వాశకముమ్ తెన్నురైయిల్ కేట్టఱివదుణ్డు, అతనైయోమ్ తెళియోమ్, మన్నుమ్ వడనెఱియే వేణ్డినోమ్**" (లేడికన్నులవంటి కన్నులను, హంసనడకలవంటి నడకలనుకల స్త్రీలు లోకములో నిందించునట్లు పురుషులనుగూర్చి మడల్‌ను ఎత్తరాదు అనుచెప్పు వాక్యములను ద్రావిడ భాషలో విని తెలిసికొంటిమి. మేము ఆవాక్యములను అర్థవంతముగా భావింపము. ఈ విషయములో సంస్కృత గ్రంథములలో చెప్పబడిన ఔత్తరాహ మార్గమునే గ్రహింతుము.) అని ఆళ్వార్లే పెరియతిరుమడల్ ప్రబంధములో అనుగ్రహించుటచే, తమిళ లక్షణకర్తలు స్త్రీల ప్రేమకు ఒక కట్టుబాటును ఏర్పరచుట ప్రేమయొక్క స్వాభావికతను తెలియకచేయుటయే అని చెప్పవలసియున్నది.

"**మయర్వఱమదినలమ్**" అనునట్లు అజ్ఞానము, భ్రమ, విప్రలంభాదిదోషరహితమైన, భక్తిగా పరిణమించిన తత్త్వజ్ఞానమునుకల ఈ ఆళ్వార్లు, "వివేకమును కల్గినవారైనచో, వారు కామమార్గమును అనుసరింపరు" అనుచు జ్ఞానాధికులు నిషేధించిన కామమును సాధనముగా ఎంచుకొనినట్లు తోచుచున్నదే ! ఇది ఏమి ? " అని ప్రశ్నించినచో , ఈ దివ్యసూరులు ఈ ప్రబంధములలో ఆశ్రయించిన కామము, జ్ఞానాధికులు నిషేధించిన నీచమైన, లౌకిక, వైషయిక కామము కానేకాదు. "**ఆత్మా వా అరే ద్రష్టవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః**" (బృహ-4-4-5) (వినతగినవాడు, మననమును చేయతగినవాడును అగు పరమాత్మ ధ్యానింపతగినవాడు, దర్శింపతగినవాడు) అని ఉపనిషత్తులలో విధింపబడిన భగవద్భక్తియే ఇచట కామముగా తెలుపబడినది. అత్యంతపరతంత్రమగు నీ స్త్రీత్వమునకు, అతని పురుషోత్తమత్వమునకును, నీవు ఇట్లు మడల్ ఎక్కుట తగదు. అతడు స్వయముగా వచ్చువరకు వేచియుండుటయే స్త్రీ కి ఉచితము" అని నిషేధించు బంధువులను ఉద్దేశించి "ఆపరమపురుషుడు చేసిన, మనస్సును ఆకర్షించు లీలలో మనస్సును పారవేసికొంటిని, అతడు తానే స్వయముగా వచ్చిన వచ్చును



విలక్కుకిఱవర్‌కళై క్కుఱిత్తు, "మనోహారిచేష్టితఙ్గళిలే యకప్పట్టు అపహృతచిత్తై యానేన్ అవన్‌తానే వరుకిఱాన్, అవనుక్కు నిఱక్కేడు విళైక్క వొణ్ణాతెన్గిఱ వితువుమ్ శెయ్‌తర్ఱతు. ఇని, మడలెడుత్తు అవనైప్పెర్ఱల్లతు ధరియేన్ ఎన్గిఱ తన్‌తుణివై విలక్కుకిఱ బన్ధుక్కళుక్కు చ్చొల్లుకిఱాళ్. ఇవళ్ మడలెడుక్కప్పుక్కవళ్ విలమ్బిక్కిఱతుక్కు హేతువెన్? ఎన్నిల్ హేతుక్కళాలే బన్ధుక్కళై ఇశైవిక్కైక్కాకవుమ్, గుణాధికవస్తువై క్కడుక అఴ్గిక్కలాకాతెన్ఱుమ్, వరుకైక్కు అవకాశప్రదానమ్ పణ్ణుకైక్కాకవుమ్ విలమ్బిక్కిఱాళ్.

అవతారికై ముర్ఱిర్ఱు.

---

గాక ! మేము మడల్ ఎత్తుట మొదలగు తగని కార్యములను చేసి, అతని గుణహానిని కల్గింపరాదు" అని తలచి ఊరక ఉండెదమని ప్రయత్నించితిని. అట్లయినను అతడు రాలేదు. నా వలనకూడ అట్లు విశ్లేషించి, ప్రాణములను నిలుపుకొనుటకు వీలుకాలేదు. ఇక మడల్‌ను ఎత్తి, స్వామిని చేరినగాని జీవింపలేను" అనెడి తన నిశ్చయమును నాయిక తెలుపుటయే ఈ మడల్‌ను ఎక్కుదుననుట. మడల్‌ను అనుష్ఠింపప్రయత్నించిన ఈ పరకాలనాయిక నేరుగా ఆపనిని చేసి, ముగింపకుండ, తన నిశ్చయమును పల్కుచు మాత్రమే కాలహరణమును చేయుటకు కారణమేమి ? అనినచో, మడల్‌ను ఎక్కవలసిన కారణములను తెలిపి, బంధువులను తన మాటకు అంగీకరింపచేయుట కొఱకును, తాను తొందఱపడి గుణాధికుడైన పరమపురుషునకు గుణహాని కల్గింపరాదు అను అభిప్రాయముతోను ఆలస్యము చేయుచున్నది.

అవతారిక సంపూర్ణము

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుమఙ్గై యాழ்వార్ అనుగ్రహించిన

# శితియతిరుమడల్ సవ్యాఖ్యానము

**కారార్ వరై క్కొఙ్గై క్కణ్ణార్ కడలుడుక్కై,**

కార్ ఆర్ వరై క్కొఙ్గై = మేఘములు నిండుగా వ్యాపించియున్న (తిరుమాలిరుమ్‌శోలై, వేంకటాచలమను) పర్వతములను రెండిటిని స్తనములుగా కల్గినది. కణ్ ఆర్ కడల్ ఉడుక్కై వ్యాపించిన (విశాలమైన) సముద్రమును వస్త్రముగా కల్గినది, శీర్ ఆర్ శుడర్ శుట్టి =

**(పెరియవాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానమ్)**

(కారార్వరై యిత్యాది) తాయ్‌మార్, తోழிమార్ ఎల్లారుమ్, ''ఇత్తుణివు ఆకాతుకాణ్'' ఎన్ఱు విలక్కానిఙ్కుచ్చెయ్‌తే, విలక్కాతాళొరుత్తియై పెఱువతే ! ఎన్ఱు కొణ్డాడువారైప్పోలే, పురుషార్థఙ్గళ్ శొల్లవేణ్డుకైయాలే అవై పరిగ్రహిత్త చేతనరైచ్చొల్ల వేణ్డి, అవర్‌కళ్ వర్తిక్కిఱభూమియై చ్చొల్లప్పుక్కు అవ్వழிయాలే అతుక్కభిమానినియాన

**భావదీపిక**

**(కారార్ వరైక్కొఙ్గై ఇత్యాది)** – ఇపుడు పరకాలనాయిక భూదేవిని కీర్తించుటలో గల కారణమేమి ? అనినచో, తల్లులు, సఖులు అందఱును "ఈ మడల్‌ను అనుష్ఠింపవలెనను నీ నిశ్చయము నీ స్వభావమునకు తగినది కాదు సుమా !" అని అడ్డుపెట్టుచుండగా, అట్లు అడ్డుపెట్టని ఈ భూదేవిని ఒకరిని పొందితిమి కదా ! అని ఆమెను వర్ణించుచున్నది. మఱియు, తాము ఆశ్రయించిన కామపురుషార్థమునుగూర్చి చెప్పవలసిన సందర్భములో, మొదటగా పురుషార్థములు ఏవి ? అని తెలుపవలసియున్నందున, వానిని తెలుపునపుడు వానిని ఆశ్రయించు చేతనులనుగూర్చి చెప్పవలసియున్నందున, వారినిగూర్చి చెప్పునపుడు వారు జీవించియుండు భూమినిగూర్చి చెప్పవలసియున్నందున, ఈ విధముగా భూమికి అభిమానదేవత అగు భూదేవిని నాయిక వర్ణించుచున్నది – అనియును చెప్పవచ్చును. **(తాన్ వైవర్ణ్యప్పట్టు, వరున్ది క్కిడక్క, తనదు శక్కళత్తియాకియ పూమిప్పిరాట్టి కుతియழிయాద అవయవఙ్గళుడనే ఒழுఙ్గాక ఇరుక్కప్పెఱ్ఱాళే ! ఎన్ఱ ఉకవై తోన్ఱ వరుణిప్పదాక చ్చొల్లువారు ముళర్. ఇప్పరకాలనాయకియుమ్, పూమిప్పిరాట్టియుమ్ ఎమ్బెరుమానుక్కు వాల్లభ్యప్పట్టవర్ కళాదలాల్ శక్కళత్తిముఱైమై యుణ్డెన్గ.** తాను వివర్ణయై బాధపడుచుండగా, తనసవతియగు భూదేవి రూపుమాఱని అవయవములతో అందముగానున్నదే ! అను అసూయ తోచునట్లు వర్ణింపబడుచున్నదని వివరించు వారును కలరు. ఈపరకాలనాయకి, భూదేవియును భగవానుని వాల్లభ్యమును పొందినవారగుటచే ఒకరికొకరు సవతులను సంబంధమున్నది – దివ్యార్థ)



శ్రీభూమిప్పిరాట్టియై వర్ణిక్కిఱార్.

(కారార్‌వరై క్కొఙ్గై) శ్రీభూమిప్పిరాట్టి ములైకళై చ్చొన్నపడి. ''కారార్‌వరై'' యెన్గైయాలే శెఱిన్దు మేఘమ్ పడిన్ద మలైయెన్ఱు మలైక్కు ఉయరమ్ శొల్లిఱ్ఱు, మేఘమ్ పడిన్దమలై యెన్గైయాలే ములైక్కణ్ కఱుత్తిరున్దాఱ్పోలే యిరుక్కుమెన్గై. మలైకళైముళైయాక్కి చ్చొల్లిఱ్ఱాకిల్ ఎమ్మలైకళై చ్చొల్లిఱ్ఱెన్నిల్, తిరుమలైకళిరణ్డైయుమ్ ములై యాకచ్చొల్లిఱ్ఱెన్నుమిడమ్ శొల్లిఱ్ఱు, ''తెన్ననుయర్ పొరుప్పుమ్ తెయ్‌వ వడమలైయు ఎన్నుమివైయే ములైయా'' ఎన్ఱు పెరియతిరుమడలిలే శొల్లిఱ్ఱు. శ్రీభూమిప్పిరాట్టిక్కు ములై శొల్లుకిఱతాకిల్ ఉయర్న్ద మేరుప్రభృతికళై చ్చొల్లాతే ఇవఱ్ఱై చ్చొల్లువానెన్ ? ఎన్నిల్, ములైయావతు కాన్తన్ పడుకాడు కిడక్కుమిడమితే, అప్పడియే ఎప్పోతుమొక్క

**(కారార్ వరై క్కొఙ్గై)**–భూదేవి అనెడి స్త్రీకి పర్వతములు స్తనములుగా చెప్పబడుచున్నవి. "**కార్ ఆర్న్ద వరై**" (మేఘములు వ్యాపించిన పర్వతము) అనుటచే మేఘములు నిబిడముగా గల పర్వతముల ఔన్నత్యము తెలుపబడినది. ఉత్తమజాతి స్త్రీ స్తనములు పృథులములై, ఉన్నతములై ఉండును కావున మేఘములు వ్యాపించియున్న ఉన్నత పర్వతములను స్తనములుగా (నాయిక) చెప్పుచున్నది. "మేఘములు వ్యాపించిన పర్వతము" అనుటచే స్తనాగ్రములు నల్లనివిగా ఉండునట్లు, ఈ పర్వతశిఖరములును నల్లగా ఉన్నవని తెలుపబడినది. స్త్రీకి స్తనములు రెండు కదా ! ఇచట పర్వతములను స్తనములుగా వర్ణించునపుడు, ఏ రెండు పర్వతములు భూదేవికి స్తనములుగా చెప్పబడినవి? అనగా – "**తెన్ననుయర్ పొరుప్పుమ్ దెయ్‌వ వడమలైయుమ్ ఎన్నుమివైయే ములైయా**" (దక్షిణదిక్కులోనున్న పర్వతమగు తిరుమాలిరుమ్‌శోలై కొండ, ఉత్తరదిశలోనున్న దైవగిరి అను వేంకటాచలము.) అనుచు పెరియతిరుమడల్ ప్రబంధములో ఈ ఆழ்వార్లే పల్కిరి. కావున తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును, వేంకటాచలమును స్తనములుగా పల్కుచున్నారు. ఉత్తమ నాయకియగు భూదేవికి స్తనములుగా పల్కుచున్నచో, మిక్కిలి ఉన్నతములైన మేరు పర్వతము మొదలగువానిని అట్లు వర్ణింపకుండ, వీనిని వర్ణించుట ఎందులకు ? అనినచో, "**నప్పిన్నై కొఙ్గైమేల్ వైత్తుక్కిడన్ద మలర్‌మార్బా**" (నీళాదేవి స్తనములపై పరుండిన, వికసించిన వక్షమును కలవాడా!) అని, "**మలరాళ్‌తనత్తుళ్ళాన్**" (పద్మనివాసిని అగు లక్ష్మీదేవి స్తనములందు ఉన్నాడు.) అనియు, పల్కినరీతిలో స్తనములు భర్త మిక్కిలి ఆదరించునవి అగుటచే, దానికి తగినట్లు ఎల్లప్పుడు భగవత్సాన్నిధ్యమునుకల ఈ రెండు పర్వతములను స్తనములుగా పల్కుటయే ఉచితము. **(వారార్ కొఙ్గై)** – ఉత్తమ స్త్రీయొక్క స్తనములు కాఠిన్యమును స్వభావసిద్ధముగనే కల్గియుండును కదా ! అందుచేకూడ పర్వతములను స్తనములుగా పల్కుట.

**(కణ్ణార్ కడల్)** – దర్శించువారి కన్నులకు నిండుగానుండు సముద్రము అని అర్థము. అనగా చూడతగిన సముద్రము. లేక, "**కణ్**" అనుటకు చోటు అనియు అర్థము కావున, ఎక్కువ

### శీరార్ శుడర్ శుట్టి చ్చెజ్గలుఙ్గిప్పేరాగ్ఱు,

అందమైన కిరణములనుకల సూర్యుని తిలకము అను ఆభరణముగా కల్గినది, శెమ్ కలుఙ్గి పేర్ ఆఱు = ఎఱ్ఱని, కలగియున్న గొప్ప కావేరీనదిని (నదులను) పేర్ ఆరమ్ మార్బిల్ =

భగవత్సన్నిధియుళ్ళ దేశమాకైయాలే తిరుమలైకళై చ్చొల్లిగ్ఱు (వరైక్కొజ్గై) ములైక్కు క్కాఠిన్యమ్ స్వభావమాయిరుక్కుమిఱే, అతువుమ్ శొల్లుకిఱతు. (కణ్ణార్ కడలుడుక్కై) కణ్ణార్కడలెన్నైయాలే దర్శనీయమాన కడలెన్నుతల్, ఇడముడైత్తాన కడలెన్నుతల్, ఇడముడైత్తాకైయావతెన్ ? ఎన్నిల్, శ్రీభూమిప్పిరాట్టిక్కు క్కొడుక్కుమ్ కొయ్చ్చకముమ్ వైత్తుడుక్కలామ్ పరప్పై యుడైత్తాయిరుక్కై. (కడలుడుక్కై) తిరుమేనియిన్ సౌకుమార్యత్తుక్కీడాక ఉఱుత్తామే కుళిర్ న్దిరుక్కుమెన్నై. (శీరార్ శుడర్ శుట్టి) అఴకియ శుడరైయుడైయ ఆదిత్యన్ ఇవళుక్కు త్తిలకమెన్నై, అన్ఱిక్కే, అణిమికు తామరైక్కై ఆభరణమాకక్కడవ తలైక్కు త్తాన్ ఆభరణమాక ప్పెఱుకైయాలే వన్ద శీర్మైయాకవుమామ్. (శెజ్గలుఴ ప్పేరాగ్ఱు ప్పేరారమార్బిల్) సహ్యత్తిలే వర్షిక్క చ్చివన్ద కలక్కత్తై

విస్తీర్ణమునుకల సముద్రము అనియును చెప్పవచ్చును. (**కణ్ణార్ కడల్ ఉడుక్కై**) – భూదేవికి మిక్కిలి అందమైన సముద్రము నీలవర్ణము కల చీరగా అమరియున్నది, విశాలమైన సముద్రము అనుటచే భూదేవికి అంచును, కుచ్చెళ్ళును పెట్టుకొని కట్టుకొనునట్లు విశాలమైయున్నదని అర్థము. (**కడలుడుక్కై**) – భూదేవి దేహసౌకుమార్యమునకు తగినట్లు ఒరసికొనకుండ, మృదువుగా, చల్లగా నుండునని అర్థము.

(**శీరార్ శుడర్ శుట్టి**) – అందమైన కిరణములనుకల సూర్యుడు ఈమెకు తిలకము. "**శుడర్**" అనుటచే కిరణములను తెలిపి, "**శీరార్ శుడర్**" అను పదములో వానినికల సూర్యుని తెలుపుచున్నది. ఈ అన్వయమున "**శీరార్**" అనునది కిరణములకు విశేషణము. ఇచట "**శీర్మై**" అనగా మిక్కిలి అందముగా నుండుట. లేక, "**శుడర్**" అనునది సాక్షాత్తు సూర్యుని తెలుపుచున్నదనినచో, "**శీరార్**" అనునది సూర్యవిశేషణమగును. సూర్యునకు గల "**శీర్మై**" (సంపద) అనగా – "**అణిమికు తామరైక్కైయై అన్దో ! అడిచ్చియోమ్ తలైమిశై నీ అణియాయ్**" (తిరువాయ్–10–3–6) (అందమైన అలంకారములతో కూడిన, తామరపూవువంటి నీ శ్రీహస్తమును అయ్యో ! దాసురాండ్రమగు మా తలలపై అలంకరింపుము.) అనునట్లు భగవానుని శ్రీహస్తమును ఆభరణముగా కల్గియుండవలసిన పిరాట్టితలకు తాను ఆభరణమైయుండుటచే ఏర్పడిన సంపద (గొప్పతనము). "**ఆభరణస్యాభరణం . . . . వపు స్తస్యాః**" (విక్రమోర్వశీయము) (ఆమె మేని ఆభరణములకుకూడ అందమునిచ్చు ఆభరణము) అనునట్లు ఆభరణమునకుకూడ అందమును కల్గించునదికదా భూదేవి.

(**శెజ్గలుఙ్గి ప్పేరాగ్ఱు ప్పేరారమార్బిల్**) – గొప్ప (కావేరీ) నది పిరాట్టికి వక్షఃస్థలముగా



### ప్పేరార మార్బిల్ పెరు మా మఴైక్కూన్దల్,

గొప్ప హారముగా దాల్చిన వక్షఃస్థలమును కల్గినది, పెరు మా మఴై కూన్దల్ = పెద్దవియై,

యుడైత్తాకైయాలుమ్, మలైయిలుణ్డాన పొన్ ముతలాన రత్నజ్గళై యుడైత్తాకైయాలుమ్, భూమియెజ్గుమ్ పరవిక్కొణ్డువరుకైయాలుమ్ విలజ్గిక్కిడక్కిఱ ఆఱాకిఱ ఆరమ్ కిడక్కిఱ

నున్నది. వక్షఃస్థలము అనునది స్తనములకు క్రింద ఉన్నదై, చందనము,కుంకుమము మొదలగువానితో పూయబడిఉండును కదా ! ఇచటను భూదేవి వక్షస్సు ఆ విధముగా ఉన్నదా? అన్నచో, "**మలైత్తలై ప్పిఱన్దిఴిన్దు వన్దు నున్దు శన్దనమ్ కులైత్తలైత్తిఱున్దెటిన్ద కుఙ్కుమక్కుఴమ్బినోడు అలైత్తొఴుకు కావిరి**" (తిరుచ్ఛన్ద–54) (సహ్యపర్వతములో పుట్టి, అచటి నుండి ప్రవహించి, వేగముగా వచ్చి, చందన వృక్షములను కొట్టుకొనివచ్చునది, కర్పూర వృక్ష శాఖలను కూలగొట్టి, కొనివచ్చునది, శిథిలములైన కుంకుమలతలనుండి పుట్టిన కుంకుమపంకముతో కూడినది, ఉత్తుంగతరంగ అయిన కావేరి.) అనురీతిలో ఈ (వక్షఃస్థలము అను) నది కూడ (స్తనములనెడి) పర్వతములక్రింద ప్రవహించునదియై, ఆ పర్వతములోనున్న చందనము, కుంకుమము మొదలగువానిని తనతో తీసికొని వచ్చుటచే కలగి, ఎఱ్ఱబడియుండును. వక్షస్సు గొప్ప ముత్యాల, రత్నాల మాలలతో అలంకరింపబడి, వెలుగుచుండునుకదా ! ఇదియును ఆవిధముగా ఉన్నదా ! అనినచో, "**ఆళరియాల్ అలైప్పుణ్డ యానై మరుప్పుమ్ అకిలుమ్ అణిముత్తుమ్ వెణ్శామరైయోడు పొన్నిమలైప్పణ్డ మణ్డ త్తిరైయున్దు**" (పెరియతిరు – 3–8–3) (వీరసింహముచే సంహరింపబడిన గజముల దంతములను, పోకచెట్లను, అందమైన ముత్యములను, తెల్లని చామరములను, పర్వతములో పుట్టు పలువస్తువులను అన్నింటిని కెఱటములతో కొట్టుకొనివచ్చు కావేరి.) అని, "**శన్దినోడు మణియుమ్ కొఴిక్కుమ్ పునల్కావిరి**" (పెరియతిరు 6 5–4–1) (చందన కాష్ఠములను, నవరత్నములను తీసికొని వచ్చుచు ప్రవహించుచున్న నీటిని కలదగు కావేరి.) అని, "**వేయిన్ ముత్తుమ్ మణియుమ్ కొణర్న్దార్ పునల్కావిరి**" (పెరియతిరు – 5–4–9) (వెదుళ్ళనుండి రాలిన ముత్యములను, రత్నములను కొట్టుకొనివచ్చు, నిండైన జలమును కల కావేరి.) అనియు, "**చంచచ్చామర చంద్రచందనమహామాణిక్యముక్తోత్కరాన్ కావేరీ లహరీకరైః విదధతీ పర్యేతి**" (శ్రీరంగ 1–21) (ప్రకాశించుచున్న చామరములు, పచ్చకర్పూరము, చందనవృక్షములు, గొప్పరత్నములు, ముత్యములు అను వీని సమూహములనబడు అలలు అనెడి చేతులతో తీసికొనివచ్చుచు కావేరి సమీపించుచున్నది) అని తిరుమజ్గై ఆఴ్వార్లు, భట్టర్ను పల్కినట్లే, ఈ నదికూడ పర్వతమునందలి ముత్యములను, రత్నములను తీసికొనివచ్చుచున్నది. వక్షఃస్థలము విశాలమైయుండునట్లే, ఈ నదియు భూమి అంతట వ్యాపించి, ప్రవహించుచు, వచ్చుచున్నది. "**శెజ్గలుఙ్గి ప్పేరాగ్ఱు**" అనుచు సమానముగా పల్కినను, ఉత్తమనాయకియొక్క వక్షస్సు నాయకుని ఆలింగనము చేసికొనుటయే అలవాటుగా (పనిగా) కల్గినదగుటచే, రెండు వైపుల శ్రీరంగనాథుని ఆలింగనము

**నీరార వేలి నిలమజ్గై యెన్నుమ్, ఇ**

నల్లనివియైన మేఘములను కేశములుగా కల్గినది, ఆరమ్ నీర్ వేలి = ఆవరణజలమును అగడ్తగా (రక్షగా) కల్గినదియై యున్న, నిలమజ్గై ఎన్నుమ్ = భూదేవి అని చెప్పబడు, ఇప్పారోర్

మార్వ్వియుడైయవళ్. (పెరు మా మజ్గై క్కూన్దల్) పెరుత్తు, మా కఱుత్త, మజ్గై మేఘజ్గళ్. నీర్కొణ్డెళ్లున్ద కాళమేఘత్తిరళే ఇవళుక్కు మయిర్ముడి. అతావతు- ఇన్ద్రధనుస్సుమ్, మిన్నుమ్ కలమ్బకన్ శూడినాప్పోలే యిరుక్కైయాలే మేఘత్తై మయిర్ముడి యెన్గిఱతు. కాన్తనుక్కు దర్శనీయమా యిరుక్కైయుమ్ ఒరుకాల్ కులైత్తు నుఱ్లున్ద విడా యాఱుమ్బడి యాయిరుక్కైయుమ్.

(నీరార వేలి) ఆవరణజలమే యివళుక్కు క్కాప్పెన్నుతల్, మర్యాదై యెన్నుతల్. కుళర్త్తియైయుడైత్తాన చన్దనత్తో పాతియాయ్, నామత్తై యుడైయ కత్పే ఇవళుయరత్తుక్కెల్లై

చేసికొనియుండు, తేటపడని, కలత చెందిన జలప్రవాహమనెడి కావేరియే ఇచట వక్షఃస్థలముగా చెప్పబడుచున్నది.

**(పెరుమామజ్గైక్కూన్దల్)** – పెద్ద నల్లని మేఘములను కేశములుగా కల్గినది ఈ భూదేవి. నీటిని తాగి పైకెగసిన కాలమేఘముల సమూహమే ఈమెకు కేశబంధము. ఉత్తమ స్త్రీ కేశములు నల్లనివై, దట్టమై, పలురంగులనుకల పూవులతోకూర్చిన కదంబమాలను చుట్టుకొని, భర్తకన్నులను చల్లబఱచునవియై, అతడు ఒకమాఱు ఆ కొప్పును విడదీసి, విడచినను, తాపములన్నియు తీరునట్లును ఉండునుకదా ! ఆవిధముగానే ఈ దీర్ఘములైన మేఘములవంటి కేశములుకూడ పొడుగుగా, నల్లగా నున్నవి. ఇంద్రధనుస్సు అను రంగుల హరివిల్లును, మెఱపు అనెడి పలురంగుల కదంబమాలను చుట్టుకొని యున్నది. కన్నులను చల్లబఱచునదిగను, ఒకదిక్కు వర్షము కురిసినచో సకలతాపములను తీర్చునట్టిదిగను ఉన్నది.

**(పెరుమామజ్గై క్కూన్దల్)** – **"కొళ్కిన్ద కోళిరుళైచ్చుకిర్న్దిట్ట కొఱ్ఱుఇఴ్హరులిన్ ఉళ్కొణ్డ నీలనన్నూల్ తఴైకొల్ అన్ఱు మాయన్ కుఴల్"** (తిరువాయ్ – 7-7-9) (లోకములో గ్రసించుచున్న బలమును కల చీకటియొక్క పైభాగమును తీసివేసిన, అందమైన, ఉండయొక్క లోపలి భాగములోని సారముల నుండి తీసిన నల్లని, విలక్షణములగు దారముల సమూహమా ఇవి? కానేకాదు. ఆశ్చర్యచేష్టితుడగు శ్రీకృష్ణుని కేశములు. అంతియే.) అని కీర్తింపబడు "**కుఴలఴకర్**" (నాచ్చితిరు-11-2) కు అనురూపమైన "**కుఴలఴకి**" (కేశసుందరి) గా ఉన్నది ఈ భూదేవి.

ఉత్తమనాయకి అయినచో తగిన, దృఢమైన కావలిని కల్గియుండును కదా ! అట్టి కావలి ఈ భూదేవికలదా ? అనినచో , తప్పక కలదనుటను పిమ్మట తెలుపుచున్నారు. **(నీరార వేలి)** – **ఆరమ్ నీర్ వేలి** – అని అన్వయము. హారమువలె, ఈ అండమును చుట్టియుండు ఆవరణజలమే ఆరనీరుగా మారినదని కొందఱందురు. ఆవరణజడలము అనెడి



**ప్పారోర్ శొలప్పట్ట మూన్ఱన్రే, అమ్మూన్ఱు**

= ఈ లోకములోనున్నవారిచే, శొలప్పట్ట = చెప్పబడిన (పురుషార్థములు), మూన్ఱు అన్రే = మూడు కదా ! ఇమ్మూన్ఱు ఆరాయిల్ = ఈ మూడు పురుషార్థములు ఏవి? అని విచారించినచో,

యెన్నై. (నిలమజ్గై యెన్నుమిప్పార్) భూమియై చ్చొలప్పుక్కు అతుక్కు ప్రకారియాన శ్రీభూమిప్పిరాట్టియళవుమ్ శొన్నపడి. (పారోర్ శొలప్పట్ట మూన్ఱన్రే) శిఱియార్ పెరియారెన్నాతే, విలక్షణర్ అవిలక్షణర్ ఎన్నాతే భూమియిలుణ్డాన చేతనర్ పరిగ్రహిత్త పురుషార్థమ్ మూన్ఱన్రో? వెన్నై. "అన్రే" ఎన్ఱపడియాలే మోక్షమెన్ఱొరు పురుషార్థముణ్డెన్ను మిడమ్ శొల్లుకిఱతు, ఇప్పారోర్. (అమ్మూన్ఱు మారాయిల్తానే) ఇవఱ్ఱై యారాయప్పుకిల్

గొప్ప, అగడ్తను రక్షణగా ఈమె కల్గియున్నదని భావము. **(నీర్ ఆరమ్ వేలి – ఆరమ్ ఎన్ఱదు "ఆవరణమ్" ఎన్ఱ వడశొల్లిన్ శిదైవై ఎన్బర్. అణ్డత్తుక్కు పుఱమ్బే పెరుకిక్కిడప్పదు ఆవరణజలమ్ ఎన్నుణర్క. "నీర్ ఆరమ్ – వేలి – ఆరమ్"** అనునది ఆవరణమను సంస్కృతపదవికారము – దివ్యార్థ) లేక, **(నీరార వేలి)** – **ఆరమ్ నీర్ వేలి** – "**ఆరమ్**" అని చందనమునకు పేరు. "**నీర్**" అనగా నీటి స్వభావమగు చల్లదనము అని అర్థము. కావున "**ఆర నీర్**" అనునది చందనము వలె చల్లని స్వభావమునుకల ఈ దేవేరియొక్క పాతివ్రత్యమును తెలుపుచున్నది. "**వేలి**" అనగా అవధి, అనగా ఎల్ల. చందనమువలె చల్లని పాతివ్రత్యమును అవధిగా కల్గినది. తనగొప్పతనమునకు అవధిగా కల్గినది ఈ భూదేవి అని అర్థము. ఈమెకు పాతివ్రత్యమనగా – "**వామనన్ మణ్ణిదు**" (వామనుని భూమి ఇది) (తిరువాయ్-4-4-1) అనునట్లు భగవానునకే చెందియుండుట. చందనమువలె చల్లని పాతివ్రత్యము – అనుటచే నాయకునకు తాపమును కల్గించు పాతివ్రత్యముకాదు ఈమె పాతివ్రత్యము అని స్ఫురించుచున్నది. తాపమును కల్గించు పాతివ్రత్యమనగా ఏమి ? అనినచో – తన నాయకుడు మిగిలిన భార్యల పట్ల ప్రేమను కల్గియుండుటను సహింపలేకుండునట్లుండుట. కాని, ఈ భూదేవి అన్నచో, లక్ష్మీదేవి-భగవానుడును కలసియున్నపుడు పూమాల, చందనము మొదలగు ఉపకరణమువలె ప్రకాశించుచు, ఎట్టి సాపత్న్యమును లేకుండ ఉండుటచే ఈమె చందనమువలె చల్లని పాతివ్రత్యమును కల్గియున్నదని తెలియుచున్నది. ఇదియే ఈమె ఔన్నత్యమునకు అవధి అగుచున్నది. ఈ విధముగానున్నది ఎవరు ? అనగా-**(నిలమజ్గై)** భూదేవియే. **(మజ్గై)** పూర్వము తెలిపిన రీతిలో స్త్రీకి తగిన గుణములతో పూర్ణమైయున్నదని భావము. **(నిలమజ్గైయెన్ను మిప్పార్)** పురుషార్థములను తెలుపుటకు ప్రారంభించి, దానిని అనుష్ఠించువారినిగూర్చి తెలుపుటకు ముందు, వారి నివాసస్థానమైన భూమిని తెలుపగోరి,ఈ భూమికి ప్రకారి అయిన శ్రీభూమిదేవి వరకు ఆళ్వార్లు చెప్పిరి.

**(ఇప్పారోర్ శొలప్పట్ట మూన్ఱన్రే)** ఈ భూమిలోనున్నవారిచే ఆశ్రయింపబడు పురుషార్థములుగా చెప్పబడినవి మూడేకదా !

### మారాయిల్ తానే యఱమ్ పొరుళిన్బమెన్ఱు,
### ఆరారివఱ్ఱిన్ నిడై యతనై యెయ్‌తువార్

అఱమ్ పొరుళ్ ఇన్బమ్ ఎన్ఱు తానే = ధర్మము, అర్థము, కామము అనునవి కదా ! ఇవనిడై = ఈ మూడు పురుషార్థములలో, అదనై ఎయ్‌దువార్ ఆర్ ఆర్ = ఆ కామపురుషార్థమును

తమ్ముడైయ తిరువుళ్ళత్తిల్ కిడక్కిఱ కామమే పురుషార్థమెన్ఱాతల్. ఏవకారమ్ పాదత్తై ప్పూరిత్తు (క్కిడక్కిఱదాయ్) క్కిడన్దతాయ్ ఆరాయిఱ్ఱా నెన్ఱతాతల్. (అఱమ్ పొరు ళిన్బ మెన్ఱు) కీఴ్ఱే, పురుషార్థత్తై మూన్ఱెన్ఱు శొల్లచ్చెయ్‌తే ఇఙ్గెడుత్తతుక్కు ప్రయోజనమ్ ఎన్? ఎన్నిల్, మోక్ష మితినుళ్లే యొన్ఱెన్ఱు శొల్లువారుణ్డాకిలిలు మెన్ఱు అవర్కళుక్కు ఇడమఱ చ్చొల్లుకిఱాళ్. (ఆరారివఱ్ఱినిడై అతనై యెయ్‌తువార్) "నడువణతెయ్‌తి నిరుతలైయు మెయ్‌తుమ్'' ఎన్ఱు తమిళ్లర్ శొల్లుకిఱపడియే శొల్లుకిఱారన్ఱు, ఇవై మూన్ఱిలుమ్

**(శొలప్పట్ట)** చెప్పబడిన అను ఈ పదముచే ఆశ్రయణరూపకార్యమును ఉపలక్షితము.
**(పారోర్)** – చిన్న-పెద్ద అను భేదములేకుండ, చేతనులందఱును కోఱు పురుషార్థములు ధర్మార్థకామములు అను రీతిలో మూడు కదా !" అన్టే అనుటచే, ఈ మూడుతప్ప నాల్గవది అగు మోక్షమను వేరొక పురుషార్థము లేదనుటను చెప్పుచున్నారు.
**(అమ్మాన్ఱు మారాయిల్‌తానే)** – ఈ లోకములోనివారు ధర్మము, అర్థము, కామము – అని తాము పల్కు ఈ మూడు పురుషార్థములను బాగుగా పరిశీలించి చూచినవారు, నాకు ఇష్టమైన, ''కామము'' అనునది ఒక్కటే పురుషార్థమైయున్నది; ధర్మార్థములు రెండును ఆ కామపురుషార్థమును పొందుట కొఱకే ఏర్పడినవి అని తెలిసికొందురు. "**తానే**" అనుటకు తమ మనస్సులోనున్న "కామమే కదా" అని అర్థము. లేక, "**అమ్మాన్ఱుమ్ ఆరాయిల్ తాన్**" అని అన్వయించి, చివరలో ఉన్న ఏకారము పాదపూరకముగాకూడ గ్రహింపవచ్చును. వానిని (పురుషార్థములను) పరిశీలించి చూచినచో ఏర్పడు నిశ్చయము ఏమి? అనగా,
**(అఱమ్ పొఱుళ్ ఇన్బమ్ ఎన్ఱు)** – అవి ధర్మము, అర్థము, కామము-అను మూడే అని తెలియును. పూర్వమే "**మూన్ఱన్ఱే**" అనుచు మూడే పురుషార్థములని చెప్పినపుడు, ఇచట మరల ధర్మము, అర్థము, కామము అని వేర్వేరుగా, పల్కుటకుగల ఫలమేమి ? అనినచో , "ఈ మూడిటికంటెను వేరయిన, మోక్షమనెడి ఒక పురుషార్థము లేకున్నను, ఈ మూడిటిలో ఒకటిగా మోక్షము ఉండవచ్చునుకదా" అని కొందఱు భావింపవచ్చునుకదా ! వారికికూడ అట్లు భావించుటకు వీలులేనట్లు ప్రత్యేకించి పల్కుచున్నారు.
**(ఆరారివయిఱ్ఱినిడై అదనై యెయ్‌దువార్)** – "**నడువణదు ఎయ్‌ద ఇరుతలైయుమ్ ఎయ్‌దుమ్**" (మధ్యలోని కామమును పొందినవారు మిగిలిన రెండింటిని పొందెదరు.) అనునపుడు తమిళపండితులు "ధర్మము, అర్థము, కామము అను మూడు పురుషార్థములలో మధ్యలోనున్న



### శీరా రిరుకలైయు మెయ్‌తువర్, శిక్కెనమఱ్ఱా-

పొందువారు ఎవరెవరో, శీర్ ఆర్ ఇరు కలైయుమ్ ఎయ్‌దువర్ = (వారు) గొప్పతనము నిండిన ధర్మము, అర్థము అను మిగిలిన రెండు భాగములను పొందిన వారగుదురు, ఆరానుమ్ = తెలివి తక్కువవారు ఎవరో కొందఱు, శిక్కెన మఱ్ఱు ఉణ్డు ఎన్బార్ = స్థిరమైన (మోక్షమను

వైత్తుక్కొణ్డు, 'పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్' ఎన్నుమాపోలే ఇప్పురుషార్థత్తై లభిప్పార్ జన్మవృత్తఙ్గళాల్ కుఱైవుడైయరేయాకిలుమ్ అవర్కళుమ్ శిలవరే! యెన్గిఱార్. (శీరా రిరుకలైయు మెయ్‌తువర్) ఇత్తై లభిక్కుమ్ సమ్పత్తైయుడైయవర్కళ్, ఇతుక్కు క్కలామాత్రమాన ధర్మార్థఙ్గళిరణ్డైయుమ్ లభిత్తారాకక్కడవర్. సాధ్యత్తై లభిత్తవర్కళ్ సాధనత్తైయు మనుష్ఠిత్తారాక క్కడవరిఱే. ఇవఱ్ఱుక్కు చ్చీర్మై, ఇతుక్కు సాధనమాకైయాలే.

అర్థమును సంపాదించినవారు మొదటిది, మూడవదియు అగు, ధర్మ, కామములను పొందెదరు; ఎందులకనగా, అది ఆ రెండిటికిని అది సాధనము కావున" అని చెప్పిరి. "**అవఱ్ఱినిడై అదనై ఎయ్‌దువార్**" అను ఆళ్వార్ల శ్రీసూక్తి ఈ ఉదాహరించిన ద్రావిడప్రమాణమును శబ్దతః అనుకరించుచున్నను, అర్థమున మాత్రము సామ్యములేదు. ఎందులకనగా, ఆళ్వార్ల ఉద్దేశ్యము అర్థము కాదు కావున. "**అవఱ్ఱినిడై** = ఈ మూడు పురుషార్థములలో, **అదనై** = నేను ఆశ్రయించిన కామపురుషార్థమును, **ఎయ్‌దువార్** = పొందెదరు అని అర్థము. **శీరార్ ఇరు కలైయుమ్ ఎయ్‌దువరావర్** దానికి సాధనమైయుండునట్టి అతిశయమును మిక్కిలిగానున్న, అర్థము, కామము అను రెండు పురుషార్థములను పొందిన వారే అగుదురు – అనునది ఇచట ఆళ్వార్ల తాత్పర్యము.
**(ఆరార్ ఇవయిఱ్ఱినిడై అదనై యెయ్‌దువర్)** – "**పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్ అవర్కణ్డీర్ పయిలుమ్ పిఱప్పిడై తోఱు ఎమ్మైయాళుమ్ పరమరే**" (తిరువాయ్ 3-7-1) (భాగవతసేవను అనుభవించు సంపదను కలవారు ఎవరైనను, వారేకదా మా జన్మపరంపరలు అన్నింటిలో మమ్ములను ఏలు మహనీయులు.) అనురీతిలో "**ఆర్, ఆర్**" అనుటచే ఈ కామపురుషార్థమును పొందినవారు జన్మచే ఎంత తక్కువవారైనను, శీలముచే ఎంత తక్కువవారైనను, ఈ పురుషార్థమును పొందినందువలననే మిక్కిలి గొప్పవారు.
**(శీరార్ ఇరుకలైయుమ్ ఎయ్‌దువర్)** – ఈ కామపురుషార్థమును పొందిన శ్రీమంతులు, దీని ఒక కళామాత్రముగానున్న ధర్మము, అర్థము – అను రెండిటిని పొందినవారగుదురు. సాధ్యమైన కామమును పొందినవారు, దీనికి సాధనమైన ధర్మ, అర్థములను రెండిటిని దీనికి ముందు (కామమునకు ముందు) పొందియేయుండవలెనుకదా ! ఒక ఊరికి పోవలెనను ఒకడు ఆశపడెను. పిమ్మట అతడు ఆ ఊరిలో కనిపించెను అన్నచో – ముందున్న చోటికి పిమ్మట చేరిన ఊరికిమధ్యగల దారిని అతడు దాటియే యుండవలెనని ఏర్పడును కదా !

**మోరార్ కుడ మురుట్టి మున్ కిడన్ద తానత్తే,**
**ఓరాతవన్పోల్ కిడన్దానై క్కణ్డవళుమ్,**

ఉన్న, మోర్ ఆర్ కుడమ్ = మజ్జిగ నిండుగాఉన్న కుండను, ఉరుట్టి = (దానిపట్ల తనకు కోటికలేకుండుట తెలియునట్లు) పగులగొట్టి , మున్ కిడన్ద తానత్తే = ఎదురుగా పరుండియున్న చోటులోనే, ఓరాదవన్ పోల్ = ఏ విషయమును తెలియని వానివలె, కిడన్దానై =

పోక్కినాన్'' ఎన్ఱరుళిచ్చెయ్‌తార్. (మున్ కిడన్ద తానత్తే) ఆరేనుమ్ కాణ్గిఱార్కళెన్ఱు, ఇవన్ పతఱి విఝున్దాన్, దైవయోగత్తాలే అతు పఝైయస్థానమాయిఱ్ఱిత్తనై.

(మున్ కిడన్ద తానత్తే) కళవుకణ్డా నెన్ఱు శొల్లిలుమ్ ''పడుక్కైయోడేయో ఎఝున్దిరున్దు కళవుకణ్డతు?'' ఎన్నుమ్బడి కాల్ పోట్టవిడత్తే కాల్పోట్టు, క్కై పోట్టవిడత్తే కైపోట్టు క్కిడన్దపడి. (ఓరాతవన్పోల్ కిడన్దానై) ''వెణ్ణెయ్ ప్రసఙ్గమ్ ఇవన్నినైవిలు మిల్లైయో!'' ఎన్నుమ్బడి ఇవ్వర్థమ్ ముతలిలే యఱియాతానాయ్ క్కిడన్దపడి. తానురుట్టిన మోర్

తోసివేసెను. స్వాపదేశమున, సారభూతములైన సత్పదార్ధములను సంతోషముతో పరిగ్రహించువాడనియు, అసారములైన అసత్పదార్ధములను తిరస్కరించి, తొలగదోయువాడనియును భావము. వేదపురుషుడు కూడ సారభూతమైన ఉత్తరభాగమును గ్రహించినవారిని **"బ్రాహ్మణో మమ దేవతాః"** అని పొగడి, అసారమైన పూర్వభాగమును ఆదరించిన వారిని **"అవిపశ్చితః వేదవాదరతాః"** (గీత-2-4-2) (వేదవాదములందు అభినివేశమును కలవారు) అని విడచెను కదా ! భట్టరు చంద్రపుష్కరిణీతీరమున ఆళ్వార్లు వేంచేసియున్న మండపములోనుండి మడల్ ప్రబంధమును అనుగ్రహించునపుడు ఈ సందర్భములో - "బ్రాహ్మణుల ధనమునంతటిని పాడుచేసెను" అని పల్కిరి. దాని అర్థమేమి? అనగా, పూర్వభాగములో చెప్పబడిన యాగములందు అభినివేశమునుకల బ్రాహ్మణులు యాగమునకు ఉపయోగించు వెన్న, పాలు, పెరుగు, మజ్జిగ మొదలగు వానిని ధనముగా పొగడుదురు. పరపురుషార్థమగు తనను విడచి, అల్పపురుషార్థసాధనమైన వీనిని ఆశ్రయించియుండుటను చూచి, వెన్న, పాలు మొదలగు వానిని తానే భుజించియు, మజ్జిగ మొదలగు అసారమైనవానిని త్యజించి, ఇట్లు పూర్వభాగనిష్ఠులగు బ్రాహ్మణుల ధనమునంతటిని పాడుచేసెను- అని ఇచటి అర్థము **(మున్ కిడన్ద తానత్తే)** "ఎవరైనను చూడగలరు" అని ఇతడు బెదటి క్రింద పడెను. అదృష్టవశముచే అది పూర్వస్థలమైనది. (ఇచట **"దైవమ్"** అనునది , **"విధి"** అనునదియును ఇతని సత్యసంకల్పమేనని గ్రహింపనగును.)

**(మున్ కిడన్ద తానత్తే)** "వెన్నను దొంగిలించెను" అని చెప్పినను, "పడుకతోపాటు లేచివచ్చి దొంగిలించెనా" అని భావించునట్లు మొదట కాలున్నచోటులోనే కాలునుపెట్టి, మొదట చేయి ఉన్నచేటులోనే చేతినిపెట్టి, ఉండెను. **(తానత్తే - తానమ్ - స్థానమ్ ఎన్ఱ వడశొల్ వికారమ్.)** **(ఓరాదవన్ పోల్ కిడన్దానై-దివ్యార్థ)** - "వెన్ననుగూర్చిన తలపే ఇతనికి లేదు" అని చూచువారు



**వారా త్తాన్ వైత్తతు కాణాళ్ వయిఱడిత్తి**
**ఙ్గారార్ పుకుదువా రైయరివరల్లాల్,**
**నీరా మితు శెయ్‌తీరెన్ఱోర్ నెడుఙ్కయిఱ్ఱాల్,**

పరుండియున్నవానిని, అవళుమ్ వేరా కణ్డు = ఆ యశోదకూడ రాగానే చూచి, తాన్ వైత్తదు కాణాళ్ = తాను ఉట్టిలో తాను చేర్చిపెట్టిన వెన్నను చూడలేనిదియై, వయిఱు అడిత్తు = (ఇంత వెన్న భుజించినచో జీర్ణమగునో ! లేదో ! అని) కడుపును బాదుకొని, ఐయర్ ఇవర్ అల్లాల్ = ఈ అయ్యగారు తప్ప వేరెవరు, ఇఙ్గు పుకువార్ ఆర్ ఆర్ = ఇచట ప్రవేశింపగలవారు ఎవరు ! ఎవరు ! (ఎవరును లేరు, ఇతడే దొంగలించి యుండవలెనని నిశ్చయించి), ఇదు శెయ్‌దీర్ నీరామ్ ఎన్ఱు = ఈ పనిని చేసినది నీవేనా ! అని పల్కి, తీరా వెకుళికళాయ్ =

పడుక్కైయిలే వన్దు తొఙ్గచ్చెయ్‌తేయుమ్ అఱియాతవనాయ్ క్కిడన్దపడి. (కణ్డవళుమ్) ఇవనై ప్పెఱ్ఱవళితే యవళుమ్, ఇవన్ కిడన్ద కిడైయిలే యివనైయే శఙ్కిత్తాళ్.

(వారా త్తాన్ వైత్తతు కాణాళ్) వన్దతుమ్ వారాతతుమాక ఉఱియిలే కైయైయిట్టాళ్, యాతొరుపడి వైత్తాళ్, అక్కుఱిప్పడియే కణ్డిలళ్. (వయిఱడిత్తు) ''వెణ్ణె యిఝన్దేన్'' ఎన్ఱు వయిఱడిక్కిఱాళన్ఱితే, ఇతు ఇవనుక్కు సహియాతొఝికిఱతో ? ఎన్నుమ్ వయిఱెరిత్తలాలే యాతల్, ఇన్ఱు వెణ్ణెయాకిఱతు, నాళై ప్పెణ్ణ్గళాకిఱతు, ఇతు ఎన్నాయ్ ముడికిఱతో ? ఎన్ఱాతల్. (ఇఙ్గారార్ పుకుతువార్) లఙ్కైపోలేయితే వెణ్ణెయై యరణ్ శెయ్‌తు వైత్తపడి. (ఐయ రివరల్లాల్) ముతలియారేయితే యితు శెయ్‌వార్. (నీరా మితు శెయ్ తీరెన్ఱు)

పల్కురీతిలో ఏ విషయమును తెలియనివానివలె ఉండెను. తాను పగులగొట్టిన మజ్జిగకుండలోనున్న మజ్జిగ పడకపై ఒలుకుటచే తడసి నాని ఉన్నపుడును, ఏమియు తెలియని వానివలె ఉండెను. **(కణ్డవళుమ్)- "ఇవనై ప్పెఱ్ఱ వయిఱుడైయాళ్"** (ఇతనిని కన్న కడుపును కలిగినది.) అనునట్లు ఇతనిని కన్నతల్లి కదా ఆమెయును. ఇతడు ఏమియు తెలియని వానివలె ఉన్నను ఆమె ఇతడే ఈ పనిని చేసియుండును అని గ్రహించినది. **(వారాత్తాన్ వైత్తదు కాణాళ్)** - వచ్చిరానట్లుగా ఆమె ఉట్టిలో చేతిని పెట్టెను. ఆమె ఎట్లు పెట్టెనో, ఆ విధముగానే వెన్న ఉండుటను చూడలేకపోయెను. **(వారా - ఇఱన్ద కాల వినైయెచ్చమ్ - వన్దు. వారా -** భూతకాలికరూపము. వచ్చి అని అర్థము - దివ్యార్థ)

**(వయిఱడిత్తు)** - తన పుత్రుడగుటచే "వెన్నపోయినది" అని కడుపును బాదుకొనలేదుకదా ! మరి ఎందులకు అట్లు చేసినది ? అనినచో, "ఇది ఇతని కడుపుకు సహింపదు కదా !" అను కారణముచే గాని, "ఈనాడు వెన్నను దొంగలించెను, రేపు కన్యలను దొంగిలించును, చివరలో ఇది ఏ విధముగా పర్యవసించునో ? " అను భయముచే గాని, యశోద కడుపును బాదుకొన్నదని తలపనగును. **(ఇఙ్గారార్ పుకుదువార్)** - దృఢమైన కోటలను కల లంకవలె కదా యశోద వెన్నను దాచిపెట్టినది. అట్టి చోటులో ఇతడు తప్పవేరెవ్వరు ప్రవేశింపగలరు ? **(ఐయరివరల్లాల్)**

“ఉమ్మిడైయ కైవట్రియే పోనవిత్తనైయితే వెణ్ణెయ్, వేఱు శిలరుణ్డో” వెన్ఱు కైయై ప్పిడిత్తు ఉఱఙ్గుకిఱవనై త్తూక్కి యెడుత్తు. (ఓర్ నెడుమ్ కయిఱ్ఱాల్) వెణ్ణెయ్ కళవు కాణ్బానాకవుమ్, తాన్ ఇవనై అడిప్పాళాకవుమ్ మున్బే కయిఱుతేడి వైత్తిలళితే, కైక్కెట్టిఱ్ఱొరు కయిఱ్ఱాలే.

(నెడుమ్ కయిఱ్ఱాల్) వ్యాఖ్యానమ్ పణ్ణుమవర్కళ్ “కణ్ణి క్కుఱుఙ్గయిఱు” ఎన్హార్కళితే. నెడుమై విపరీతలక్షణై. అన్ఱియే, ఇవన్ తిరుమేనియోట్టై స్పర్శత్తాలే. “నెడుఙ్గయిఱు” ఎన్హాళాతల్. “తిరుమేని నీ తీణ్డ ప్పెఱ్ఱు - మాలుమ్ కరుఙ్గడలే

అయ్యగారు (కృష్ణుడు) అయిన వీరు కదా ఈ పనిని చేసిరి ! **(నీరా మిదు శెయ్దీర్)** మీచేతి ద్వారా కదా వెన్న పోయినది. **(నీరా మిదు శెయ్దీర్) మీ**రు మాత్రమే చేసితిరా ! వేరుకొందఱు మీ వెంట ఉన్నారా ! **(ఎన్ఱు)** అని పల్కి చేతిని పట్టుకొని లాగుకొని తూగుచున్న అతనిని ఎత్తిపట్టుకొని. **(ఐయరివరల్లాల్ – “ఇన్ద ప్పయలల్లాల్” ఎన్న వేణ్డుమిడత్తు, “ఐయర్” ఎన్ఱుమ్, “నీర్” ఎన్ఱుమ్ శొన్నదు కోపత్తిన్ మికుతియాలెన్గై. ఆకవే, ఇఙ్గు, పాల్వఴువమైతి. ఐయరివరల్లాల్** :– ఈ కుఱ్ఱవాడు తప్ప – అని అనవలసిన చోట “ఐయర్” అని, “ఇవర్” అనియు, నీర్, అనియును పల్కుట కోపాధిక్యముచే. కావున ఇచట **“పాల్ వఴువమైది**”. (కోపమున వచనవ్యత్యయ ప్రయోగము. నన్నూల్‌లో ఇట్టి ప్రయోగములు అంగీకరింపబడినవి.) – దివ్యార్థ)

**(ఓర్ నెడుఙ్కయిఱ్ఱాల్)** – ఇతడు వెన్నను దొంగిలింపబోవుటయు, తాను ఇతనిని కొట్టబోవుటయును ఎదురుచూచి, ముందుగానే యశోద దారమును వెదకి పెట్టుకొనలేదు కదా ! అందుచే, చేతికి దొరికిన ఒక దారమును తీసికొన్నది. **(నెడు ఙ్కయిఱ్ఱాల్)** – ఈ వృత్తాంతమును స్పష్టముగా తెలుపునపుడు ఈ ఆళ్వార్లే **“కణ్ణి క్కుఱుఙ్కయిఱ్ఱాల్ కట్టుణ్డాన్”** (పెరియతిరు – 11–5–5) (ముడులను కల, పొట్టివి అయిన దారములతో కట్టబడియుండెను.) అనుచు పొట్టిదారముగా అనుగ్రహించుటచే ఇచట **“నెడుఙ్కయిఱు”** అనునది విపరీతలక్షణ. మూర్ఖుని **“బృహస్పతి”** అన్నట్లు. ప్రస్తుతమున చాల చిన్న దారము అని అర్థము. లేక, చాల పొడుగుగా ఉండుటను ఈ పదము తెలుపుటలేదు, గొప్ప తనముయొక్క ఆధిక్యమును తెలుపుచున్నది అనియు చెప్పవచ్చును. **“మాలుమ్ కరుఙ్కడలే! ఎన్నోఱ్ఱాయ్! వైయకముణ్డాలిలై త్తుయిన్ఱ ఆళియాన్, కోల క్కరుమేని చ్చెఙ్గణ్ మాల్ కణ్పడైయుళ్ ఎన్ఱుమ్ తిరుమేని నీ తీణ్డపెఱ్ఱు”** (ముదల్ తిరు–19) (లోకములను ఆరగించి, వటపత్రములో నిద్రించువాడు, చక్రాయుధుడు, అందమైన, నల్లని మేనిని, ఎఱ్ఱని నేత్రములను కలవాడు, ఆశ్రితులపట్ల వ్యామోహమును కలవాడు అగు సర్వేశ్వరుడు నిద్రించునప్పుడు ఏ కాలమునందు అయినను నీ శరీరమును స్పృశించు భాగ్యమును పొందిన, ఉన్మత్తుడవైన సముద్రమా! ఏమి నోమును నోచినావోకదా!) అనెడి పాశురములో భగవానుని తిరుమేని స్పర్శచే సముద్రమునకు మహిమ



**ఊరార్కళెల్లారుమ్ కాణ వురలోడే,**

పట్టలేని కోపమును కల్గినదియై, ఓర్ ఆర్ నెడు కయిఱ్ఱాల్ = చేతిలోకి దొరికిన ఒక చిన్న దారముతో, ఊరార్ కళ్ ఎల్లారుమ్ కాణ = ఊరిలోనున్న వారు అందఱును, (ఈ సౌలభ్య

యెన్నోఱ్ఱాయ్” ఎన్నక్కడవతితే. (ఊరార్కళెల్లారుమ్ కాణ) వెణ్ణెయ్కళవు కొడుత్తారుమ్ పెణ్కళవు కొడుత్తారుమ్ కాణ. ఎల్లారుమ్ కాణ మడలెడుక్క విరున్దాళివళ్, నాన్ అతుపదేశిక్క విరున్దేన్. ఎఙ్గళై యొఴియ అడైయ సర్వస్వదానత్తై అకప్పట్టతు కాణుమ్. అతావతు - కాణలుమాయ్ త్తవిరలుమా యిరుక్కుమ్ మనిచ్చర్కాణుమ్ కణ్డతు. కాణుమళవుమ్ మడలెడుత్తల్లతు ధరిక్కమాట్టాత నాఙ్గళ్ కాణప్పెఱ్ఱిలోమ్.

(ఉరలోడే) ఇవనిరున్దవిడత్తే యురలై యురుట్టాతే ఉరలిరున్దవిడత్తిలే

కల్గినదని చెప్పినట్లే, స్వామి తిరుమేనిస్పర్శచే ఈ దారము గౌరవమును పొందుటను **“నెడుఙ్కయిఱు”** అను పదము తెలుపుచున్నది. **(నెడుఙ్కయిఱ్ఱాల్ – “అడిక్కడి ఇవళ్ నమ్మై క్కయిఱ్ఱినాల్ కట్టు నల్కిన్హాళే” ఎన్ఱు కణ్ణపిరాన్ గృహత్తిలుళ్ళ కయిఱుకళైయెల్లామ్ తుణ్డుతుణ్డాక అఱుత్తుప్పోట్టు విడువదు వఴక్కమామ్. ఆకవే, నీణ్డ కయిఱు యశోదైక్కు క్కిడప్పతరితు.** మాటి మాటికి ఈమె నన్ను దారముతో కట్టి బాధపెట్టుచున్నదే! అని శ్రీకృష్ణుడు ఇంటిలో ఉన్న దారములనన్నిట్నిని ముక్కలుముక్కలుగా తెంపివేయుట అలవాటు. అందుచే పొడుగైన దారము యశోదకు దొరుకలేదు.–దివ్యార్థ) **(ఊరార్కళెల్లారుమ్ కాణ)** –రేపల్లెలోనున్న అందఱును శ్రీకృష్ణుని వెన్నను దొంగిలింపనిచ్చినవారు, స్త్రీలను దొంగిలింపనిచ్చినవారును కదా! వారు అందఱును తన దొంగతనమును చూచునట్లు. **(ఊరార్కళెల్లారుమ్ కాణ)** అతడు అందఱును చూచునట్లు దెబ్బలు తిన్నట్లే, ఈమెయు అందఱు దర్శించునట్లు మడల్ అనుష్ఠింపగోరినది. కట్టువిచ్చి అగు నేను దానిని ఉపదేశించు రీతిలో ఉన్నాను. మేము తప్ప మిగిలిన అందఱు అతడు తన రూపగుణాదులను తన చేతుల నిండుగా (తీసి, తీసి) ముంచి, ముంచి ఇవ్వగా దానిని తాగి, తాగి ఆనందించిరి. ఆకలి లేని వారు భుజించి ఆనందించిరి. ఆకలిని గల మేము తిండిలేకుండ ఉన్నాము – అనుచున్నది. అనగా – అతనిని చూడగల్గినచో చూచెదము, లేనిచో లేదు – అని తలచియున్న వారందఱు చూచి, ఆనందించిరి. చూచునంతవరకు మడల్ ఆచరించిన గాని ప్రాణములు నిలువని మేము చూడలేకపోయితిమి – అని భావము. **(ఊరార్కళెల్లారుమ్ కాణ – ఇవన్ ఉరలోడు కట్టుణ్డు పడుకిఱ పరిబవత్తై ఎల్లారు ఙ్కాణ – ఎన్ఱు పొరుళ్ కొళ్వర్ సామాన్యజ్ఞానికళ్ ; అదువన్ఱు పొరుళ్; ఇవన్ ఇప్పడి కట్టవుమ్, అడిక్కవుమ్ ఎళియనాయ్ వాయ్త్తిరుక్కుమ్ ఇన్ద సౌలభ్యత్తై ఎల్లారుమ్ కాణవేణుమెన్హాయ్త్తు యశోదై కరుతిఱ్ఱు. ఇఙ్ఙనొత్త సౌలభ్యత్తై వెళియిడవేణు మెన్ఱుతాన్ కణ్ణపిరాన్ ఇఙ్గే వన్దు పిఱన్దదు. తాయ్ తామ్బాలే కట్టుమ్బోదు తామ్బు ఎట్టమ్ పోరావిడిల్ ఇవన్ తనదు ఉడలై చ్చిఱుక్కడిత్తు అన్ద చ్చిఱియ తామ్బినాల్ కట్టుణ్డానామ్బడి**

**తీరా వెకుళియళాయ్ చ్చిక్కెన ఆర్ త్తడిప్ప,**

**ఆరా వయిఱ్ఱినోడాఱ్ఱాతాన్, అన్టియుమ్,**

---

గుణమును) దర్శించునట్లు, ఉరలోడే = రోలుకు, శిక్కెన ఆర్త్తు అడిప్ప = గట్టిగా బిగియకట్టి, కొట్టగా, ఆరా వయిఱ్ఱినోడు ఆఱ్ఱాదాన్ = మిక్కిలిగా కడుపుమండి బాధపడినవాడై, అన్టియుమ్ = మఱియు, నీర్ ఆర్ నెడు కయత్తై శెన్టు = నీరు నిండిన పెద్ద మడుగుకుపోయి,

---

యిఘ్రుత్తుక్కొణ్డుపోనాళ్. (తీరా వెకుళియళాయ్) ఇవన్‌పక్కల్ ప్రేమత్తుక్క వధి యుణ్డాకిలిఱే శీఱ్ఱత్తు క్కవధియుణ్డావతు. (శిక్కెన ఆర్త్తడిప్ప) శిక్కెన క్కట్టువతుమ్ శెయ్‌తాళ్, శిక్కెన వడిప్పతుమ్ శెయ్‌తాళ్. (ఆరా వయిఱ్ఱినోడాఱ్ఱాతాన్) ఇవన్ శెయ్‌తతెన్? ఎన్నిల్, పెరియ తిరునాళిలే శిఱైప్పట్టిరుప్పారైప్పోలే ''వెణ్ణెయుమ్ పెణ్గళుమ్

---

**పణ్కికొళ్ళుమవనిఱే. "కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్" ఎన్ఱ విడత్తిల్ ఇతువేయిఱే కరుత్తు. ఊరార్‌కళెల్లారుమ్ కాణ** :- ఇతడు రోటికి కట్టబడి పొందునట్టి పరాభవమును అందఱు చూచునట్లు - అను అర్థమును సామాన్యులు చెప్పెదరు. సరి అయిన అర్థము అది కాదు. ఇతడట్లు కట్టబడునట్లు, కొట్టబడునట్లును సులభుడైయున్న ఈ సౌలభ్యమును అందఱును దర్శింపవలెనని యశోద తలచినది. ఇట్టి సౌలభ్యమును ప్రదర్శింపవలెననియే కదా శ్రీకృష్ణుడు ఇచట అవతరించినది. తల్లి దారముతో కట్టునపుడు ఆ దారము పొడుగు, చాలకపోవుటచే ఇతడు తన శరీరము కుచింపచేసికొని, ఆ చిన్న దారము చేతనే తాను కట్టుబడునట్లు చేసికొన్న వాడు కదా! **"కణ్ణినుణ్ శిఱు త్తామ్బినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియప్పెరుమాయన్"** అనునపుడు ఇదియేకదా భావము.- దివ్యార్థ.) **(ఉరలోడే)** - ఏమి పని చేసినది యశోద ! పుష్పహాససుకుమారుడు, పసిబాలుడు అయిన ఇతడున్న చోటికే రోలును లాగుకొని వచ్చుట తగినదియై యుండగా, అట్లు చేయకుండ, రోలున్నచోటికి ఇతనిని ఈడ్చుకొని పోయినది. **(తీరా వెకుళికళాయ్)** - ప్రేమ కారణముగా వచ్చు కోపమగుటచే, ప్రేమవలెనే కోపము కూడా అంతులేనిదిగా ఉన్నది. "వెన్నను మితిమీరి తినుటచే ఇతనికి ఏమి వచ్చునో" అను ప్రేమభావమునకు అంతు ఉన్నప్పుడు కదా, ఇతడు వెన్న తినుటచే కల్గిన కోపమునకును అవధి ఉండును. **(తీరా వెకుళికళాయ్ - వెకుళి - కోపమ్ - ఇదు అభినయ మాత్రమెన్నై. "అఞ్జ వురప్పాళశోదై ఆణాడ విట్టిట్టిరుక్కుమ్" ఎన్నప్పట్ట యశోదైక్కు క్కోపమ్ మెయ్యే ఉణ్డాకమాట్టాదిఱే. తీరా వెకుళికళాయ్** - ఇది (కోపము) అభినయమాత్రమే అని భావము **"అఞ్జ వురప్పాళ యశోదై ఆణాద విట్టిట్టిరుక్కుమ్"** అనబడిన యశోదకు కోపము నిజముగా కలుగదని భావము.-దివ్యార్థ) **(శిక్కెన ఆర్త్తడిప్ప)**- గట్టిగా (బిగువుగా) కట్టి, గట్టిగా కొట్టగా. అయ్యో! ఏమి పని చేసినది ఈమె **(ఆరా వయిఱ్ఱినోడాఱ్ఱాదాన్)** అపుడు ఇతడు ఏమి చేసెను ? అనగా, శ్రీరంగములో అధ్యయనోత్సవములు జరుగునపుడు రాజాజ్ఞ మొదలగు వానిచే చెఱసాలలోపెట్టబడినవారు



**నీరార్ నెడుజ్గయత్తై చ్చెన్టలైక్క నిన్టురప్పి,**

---

అలైక్క నిన్టు ఉరప్పి = ఆ మడుగులోని ప్రవాహము బయటకు వచ్చునట్లు స్థిరముగా నుండి

---

ఆఘ్రమోఘైయాయ్ చ్చెల్లుకిఱ అమళియిలే, నామ్ పుకున్దిరుప్పతే?'' ఎన్టిరున్దాన్. (ఆఱ్ఱాతాన్) ఆఱ్ఱమాట్టాతే యిరున్దాన్. ఎన్నియ వెన్నిల్, ఎఙ్గే వెణ్ణెయై యొళిక్కిఱార్‌కళ్, ఎఙ్గే పెణ్గళై యొళిక్కిఱార్‌కళెన్టు.

(అన్టియుమ్) అతుక్కు మేలే పిఱన్దతోరపాయమ్ కేట్కలాకాతో! స్నేహినియాన యశోతైప్పిరాట్టి కైయాలే కట్టుణ్డు అడియుణ్డపడియిఱే కీఝ్ చ్చొల్లిఱ్ఱు, ప్రతికూలనాన కాళియనాలే కట్టుణ్డపడి శొల్లుకిఱతుమేల్. నియామికైయుమాయ్, స్నేహినియుమాన అవళ్‌కైయాలే కట్టుణ్డతు పాడాఱ్ఱలామిఱే. కాళియన్ శెయ్‌త శెయలై క్కేళీర్, (నీరార్ నెడుమ్ కయత్తై) ''ఇట్టమాన పశుక్కళై యినితు మఱిత్తు నీరూట్టి. తనక్కొతుజ్గ

---

"అయ్యో! ఉత్సవములను పోగొట్టుకొంటిమే!" అని బాధపడునట్లే, వెన్న, గోపికలు సుడులు చుట్టుకొని ప్రవహించు గొప్ప ప్రవాహమువలెనున్న కోలాహలములో నేను ఇచట ప్రవేశించి కట్టుబడి యుండుటయా! అను కడుపుబాధలో నుండెను. **(ఆఱ్ఱాదాన్)** - సహింపలేకుండెను. దేనిని అనగా - "ఎచట వెన్నను దాచి పెట్టెదరో ! ఎచట కన్యలను దాచిపెట్టెదరో !" అను సందేహమును భరింపలేకుండెను. **(ఆరావయిఱ్ఱినోడు ఆఱ్ఱాదాన్ - ఉరలోడు పిణైత్తదఱ్కుమ్, అడిత్తదఱ్కుమాక వరున్దినా నన్టు ; వెణ్ణెయ్‌యుమ్, పెణ్‌గళైయుమ్ కళవుశెయ్‌కిఱ తొఝిలై చ్చఱ్ఱుప్పోదు విట్టిరుక్క నేర్‌న్దదే ! ఎన్టు వరున్దినా నెన్నై. అళవఱ అముదు శెయ్‌ద వెణ్ణెయ్ వయిఱ్ఱిలే జీర్ణమాకామల్ వరున్దినాన్ ఎన్నవుమామ్.** ఆరావయిఱ్ఱినోదు:- రోటికి కట్టబడినందులకు, కొట్టబడినందులకు కాదు అతడు బాధపడినది; వెన్నను, కన్నెలను దొంగిలించు పనిని కొంచెము సేపు విడువవలసివచ్చినదే! అని అఱకొఱగా భుజించిన వెన్న కడుపులో జీర్ణము కాకుండుటచే బాధపడెననియు భావము - దివ్యార్థ)

**(అన్టియుమ్)** - అంతకు మించి ఏర్పడిన ఆపదను వినవలదా! (ప్రేమను కల్గినదగు యశోదాదేవిచే కట్టుబడి, దెబ్బలు తిన్న విధమును కదా పూర్వము తెల్పినది. ఇపుడు తనను ఎదిర్చిన కాళియునిచే బంధింపబడిన ప్రకారము తెలుపబడుచున్నది. తల్లి అగుటచే ఇతనిని కట్టునట్టి సంబంధమును కల్గినదై, ప్రేమను కల్గినదగు ఈమె చేతిలో కట్టుబడుటను సహింపవచ్చును కదా! కాళియుడు చేసిన పనిని వినుడు - అని కట్టువిచ్చి అనుచున్నది.

**(నీరార్ నెడుజ్కయత్తై) - "ఇట్టమాన పశుక్కళై ఇనిదు మఱిత్తు నీరూట్టి విట్టుక్కొణ్డు విళైయాడ"** (నాయ్చ్చితిరు14-1) (తనకు ఇష్టమైన పశువులను తీయగా పేరుపెట్టి పిలచి, నీటిని తాగించి, వానిని మేయుట కొఱకు విడిచి వినోదించుచున్న.) అను రీతిలో తనకు ఆశ్రయభూతములైన నీడలవలెనున్న (పశువులను మేపు వ్యాజముతో ఆదారిలోనే కన్యలను

## ఓరాయిరమ్ పణ వెజ్గో వియల్ నాకత్తై,

నీటిని కలత చెందించి, ఓర్ ఆయిరమ్ పణమ్ వెమ్ కో ఇయల్ నాకత్తై = వేయి పడగలను కల్గినది, యమునివలె క్రూరమైన స్వభావమును కల్గినదియును అగు కాళియుడను నాగమును,

నిఖిలాయిరుక్కిఅ పశుక్కళుక్కు నీరూట్టవేణ్డుమ్ జలసమృద్ధియై యుడైయ పొయ్కైయై దూషిత్తానాయిఱ్ఱు కాళియన్. తన్ రక్ష్యవర్గత్తినుడైయ రక్షణత్తుక్కు కుఱైవఱ వేణ్డుమ్ జలసమృద్ధి కాళియనాలే దూషితమాయిఱ్ఱు.

(శెన్లలైక్క నిన్హుఅప్పి) తన్నేరాయిరమ్ పిళ్ళైకళుమ్ తానుమాయ్ ప్పొయ్కైయై క్కాలాలే యుఱక్కువతు, కల్లైవిట్టెఱివతాయ్ ఆర్త్తుక్కొళ్వతానాన్. నాల్వాయుమ్ కరైక్కుమేలే నీర్వఱ్ఱియుమ్పడి నిన్హు ఉరప్పినానాయిఱ్ఱు. లజ్కైయై యడైమతిట్పడుత్తి రాక్షసర్తాఙ్గళే పుఱప్పడుమ్పడి పణ్ణినాప్పోలే. ఇతుక్కు మున్ పణ్ణిన మౌగ్ధ్యమే పోన్దిరుక్క అతుక్కుమేలే పణ్ణిన మౌగ్ధ్యత్తై క్కేట్కలాకాతో? (ఓరాయిరమ్ పణమ్) "నీణ్ముడి యైన్దిలుమ్

పిలుచుకొనిపోవుట, వానిని (పశువులను) ఇసుక తిన్నెలయందు వదలిపెట్టి, తాను కన్యలతో పాటు కలసి క్రీడించుట – మొదలగు కృత్యములకు అన్నిటికిని హేతువులగుటచే పశువులు ఇతనికి ఒదిగియుండు నీడవంటివి – అని అరుంబదకారుల వివరణము) పశువులకు నీరు త్రాగించుటకు అవసరమైన నీటి సమృద్ధిని కల మడుగులో కాళియుడు విషమును కలిపెను. తనచే రక్షింపబడవలసిన పశువులను రక్షించుటకు అవసరమైన జలసమృద్ధి కాళియునిచే పాడుచేయబడినది.

**(శెన్లలైక్క నిన్హురప్పి) – "తన్నేరాయిరమ్ పిళ్ళైకళోడు తళర్ నడైయిట్టు వరువాన్"** (పెరియాళ్వార్ తిరు–3-1-1) (తనతో సాటిఅయిన వయస్సు మొదలగువానిని కల వేయిమంది పిల్లలతో బుడిబుడి నడకలను నడచుచు వచ్చువాడు.) అనునట్లు చిలిపి చేష్టలను చేయుటలో తననే ఉపమానముగాకల గోపాలురతో కలిసిపోయి, చేతులతో, కాళ్ళతో కలియబెట్టుట, రాళ్ళను కాళియుని తలపై విసరుట మొదలగుపనులు చేసి, తనకు తానే పోయి తగవును తెచ్చుకొనెను. **(శెన్హు అలైక్క నిన్హు ఉరప్పి)** – నాల్గువైపుల తీరమునకుపైన నీరు వచ్చి, ప్రవహించునట్లు నిలకడగా నిలచి, నీటిని కలియబెట్టెననియు భావము. లంకను చుట్టముట్టి, రాక్షసులు తమకు తామే యుద్ధమునకు వచ్చునట్లు చేసినట్లే, ఇచటకూడ సాహసకృత్యమును చేసెను. ఇంతవరకు చేసిన బాల్యకృత్యమే (మౌగ్ధ్యమే) కాళియుని (పాము) కోపమును ప్రేరేపించునదిగా ఉండగా, ఇంతకు మించి చేసిన అమాయకపు చేష్టలను వినుడు – అనుచు పిమ్మట (కట్టువిచ్చి) పల్కుచున్నది.

**(వెమ్ కో ఇయల్ నాకత్తై)** – ఈ ఇతడు కాళియుడు కాదు సుమా ! యముడే సర్పరూపమునవచ్చెను – అనుచున్నది. **"వెమ్ – ఇయల్–కో"** క్రూరస్వభావమును కల యముడు. **(ఓర్ ఆయిరమ్ పణ నాకత్తై) – "కాళియన్ పొయ్కై కలఙ్గ ప్పాయ్న్దిట్టు అవన్**



## వారా యెనక్కెన్హు మగ్గ్రిఱతన్ మత్తకత్తు,

ఉరప్పి = అదలించి లేపి, ఎనక్కు వారాయ్ ఎన్హు = నాతో యుద్ధము చేయుటకు రమ్ము అని పిలిచి, మగ్గ్రిఱతన్ మత్తకత్తు = దాని తలపై, శీర్ ఆర్ తిరువడియాల్ పాయ్న్దాన్ = తన

నిన్హు నడమ్ శెయ్తు" ఎన్నచ్చెయ్తే, "ఆయిరమ్" ఎన్గిఱతెన్ ? ఎన్నిల్, ముగ్ధనాన వవన్మేలే కాళియన్ వన్దానెన్నుఙ్గాట్టిల్ ఇవళుక్కాయిరమాయ్ త్తోఱ్ఱినపడి.

(వెమ్ కో వియల్ నాకత్తై) ఇన్ద యమనుక్కు వెమ్మైయై యూట్టినాన్ కిడీర్. (వెమ్ కో ఇయల్) వెవ్వియానొరు యమనుడైయ స్వభావత్తైయుడైయ నాకత్తై. (వారా యెనక్కెన్హు) ముతలికళ్ లఙ్కైయై "ఎనక్కు ఎనక్కు" ఎన్గాప్పోలేకిడీర్, తన్నేరాయిరమ్ పిళ్ళైకళుమ్, కాళియనై "ఎనక్కు ఎనక్కు" ఎన్హు నిన్దపడి. అవర్కళ్ఁడువే యెనక్కు వారాయెన్హాన్, (మగ్గ్రిఱతన్ మత్తకత్తు) అక్కాళియన్ ఫణత్తిలే. (శీరార్ తిరువడియాల్ పాయ్న్దాన్) పిరాట్టి

**నీళ్ముడి ఐన్దిలుమ్ నిన్హు నడమ్శెయ్దు"** (పెరియాళ్వార్ తిరు3-9-7) (కాళియుని సరస్సు కలగునట్లు దానిలోనికి దూకి, ఆకాశమువరకు విజృంభించిన అతని అయిదు పడగలపై మాటి మాటికి నాట్యమాడి.) అనుచు కాళియునకు తలలు అయిదుగా చెప్పబడియుండగా, ఇచట **"ఆయిరమ్ పణ్"** అని అనుచున్నారేమి ? అనినచో, చిన్నబాలుడగు ఇతనిపై పోరాడుటకు కాళియుడు వచ్చెనని తలచినంతలో, ఈమెకు అయిదు తలలు వేయితలలుగా తోచినవి. ఇది అస్థానే భయశంక కల్గించు పాట్లు. **(కల్పభేదత్తాలే పొరున్దవుమామ్.** దీనిని కల్పభేదముచే సమాధానింపనగును – దివ్యార్థ)

**(వెజ్కోవియల్ నాకత్తై)** – ఇచట **"కో"** అనగా యముడు. **"కో ఇయల్ నాకన్"** అనుటకు యముని స్వభావమును కల వేరొక యమునివంటి సర్పము – అనియును అర్థమును చెప్పవచ్చును. **"వెమ్ కో ఇయల్ నాకత్తై"** అనుటచే ఈ యమునకు కూడ క్రూరత్వమును తన పనులచే కల్గించినవాడు అనియు అర్థము. లేక, **(వెజ్కో ఇయల్ నాకత్తై)** – అనునది అభూతోపమయై, ఇపుడున్న యముడు క్రూరతలో ఇతనికి చాలినవాడు కాకపోవుటచే, అతనివంటి క్రూరుడైన ఒక యముని స్వభావమునుకల సర్పమును అనియు చెప్పవచ్చును. **(వారాయ్ ఎనక్కెన్హు)** వానరనాయకులు "లంకను నేను నశింపజేయవలెను, నేను నశింపజేయవలెను" అనుచు ఒకరికంటె వేరొకరు ముందుకు వచ్చినట్లే, తనతో పోలిన బాలురగు ఇతని స్నేహితులు ఒక్కొక్కరు కాళియుని "నాతో పోరాడుటకు రా" అని పిలిచిరి. ఇతడు వారిని వారించి, కాళియుని "నాతో పోరాడుటకు రా" అని పిలచెను – అనుచున్నది. తన స్నేహితులకు ఏ చెడ్డ కల్గినను సహింపలేని వాడగుటచే తానే ముందుకు వచ్చెను.

**(మగ్గ్రిఱదన్ మత్తకత్తు)** – ఆ కాళియుని పడగలలో అని అర్థము. పాము నోటిలో పడెనుకదా ఈ చిలిపితనముచేయు కుఱ్ఱవాడు ! అని భావము. **(మత్తకమ్ – మస్తకమ్ ఎన్ద వడశొల్ వికారమ్.** మత్తకమ్ – మస్తకమను సంస్కృత శబ్దము యొక్క వికృతి. – దివ్యార్థ.)

**చ్చీరార్ తిరువడియాల్ పాయ్న్దాన్, తన్ శీతైక్కు**
**నేరావ నెన్ఱోర్ నిశాశరి తాన్ వన్దాళై,**

---

అందమైన శ్రీపాదములతో వ్యాపించి, నర్తనముచేసినవాడు, తన్ శీదైక్కు = తన భార్య అగు సీతాదేవికి, నేరావన్ ఎన్ఱు = నేను సమానమైనదానను అని పల్కి, ఓర్ నిశాశరి వన్దాళై = (నన్ను పెండ్లియాడుము అనుచు) వచ్చిన ఒక నిశాచరస్త్రీ అగు శూర్పణఖను, కూర్ ఆర్న్దవాళాల్

---

తిరుములైత్తడఙ్గళిలే వైత్తుక్కొళ్ళుమ్బోతుమ్ కూశవేణ్డుమ్బడి యిరుక్కిఱ తిరువడికళై క్కొణ్డు విషదృష్టియాన ఫణత్తిలే పాయ్న్దాన్. వడివిణైయిల్లా మలర్మకళ్ మఱ్ఱ నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియిఱే.

(తన్ శితైక్కు నేరావనిత్యాది) పిరాట్టియోడు సామ్యైయావే నెన్ఱు వన్ద శూర్ప్పణకైయై విరూపైయాక్కి విడ, అవళ్ పోయ్ ఖరన్కాలిలే విழ, సపరికరనాయ్ వన్ద ఖరనై నిరసిత్తపడియై. చ్చొల్లుకిఱతు. (తన్ శితై) (రాఘవోఽర్హతి వైదేహీమ్) తనక్కు ఉయరమ్ శొల్లిలుమ్ అవళై చ్చొల్లి త్తమ్మై చ్చొల్లవేణ్డుమ్బడి యిరుక్కుమ్ పిరాట్టిక్కు

---

**(శీరార్ తిరువడియాల్ పాయ్న్దాన్)** పుష్పమువలె సౌకుమార్యమునుకల లక్ష్మీదేవి తన స్తనతటములలో పెట్టుకొన్నను, "కందిపోవునో ! ఏమో !" అని భయపడవలసినట్లున్న పాదములతో, చూపుతోనే విషమును కక్కుపడగలపై దుమికెను. **"వడివిణై యిల్లా మలర్మకళ్ మఱ్ఱ నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** (తిరువాయ్-9-2-10) (రూపమున సాటిలేని లక్ష్మీదేవిని, అట్టి స్వభావమునేగల భూదేవియు సంవాహనమును చేయు మెత్తని పాదములు.) అని చెప్పబడుచున్నది కదా! **(శీరార్ తిరువడి)** ఇచట శ్రీపాదమునకు అతిశయము ఏమనగా దాని సౌకుమార్యమే. **(శీరార్ తిరువడి మేలై త్తలైమఱైయోర్కళదు శెన్నిక్కు ఆభరణమాక అమైయవేణ్డియ శిఱప్పుప్పొరున్దియ తిరువడియై ఒరు దుష్టనాగత్తిన్ తలైయిలే కొణ్డువైప్పదే ! ఎన్న వయిఱ్ఱెరిచ్చల్ తోన్ఱుమ్. -దివ్యార్థ)**

**(తన్ శీదైక్కున్ నేరావన్ . . . . . శిలై కునిత్తాన్)** – "సీతాదేవితో సమానమైన దానిని కాగలను, శ్రీరాముని చేపట్టగలను" అని తలచి వచ్చిన శూర్పణఖకు ముక్కు చెవులను కోసి, అంగభంగము కావించి, విడువగా, ఆమె పోయి ఖరుని పాదములపై పడగా, దూషణాదుల సహాయములో వచ్చిన ఆ ఖరుని వధించిన ప్రకారము ఇచట చెప్పబడుచున్నది. **(తన్ శీదై)** – తనకు అన్నివిధముల తగినది అగు సీతను అని అర్థము. (ఎట్లనగా) **"తుల్యశీలవయోవృత్తామ్ తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (రా.సుం.) (తగిన గుణములు, వయస్సు, నడత మొదలగువానిని కల్గినది, తగిన ఆభిజాత్యమును, సౌందర్యమును కల్గినదగు సీతకు రాముడే తగినవాడు, నల్లని కన్నులనుకల ఈమెకూడ అతనికే తగినది) అనునట్లు. **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా"** (రా.ఆర.37-18) (ఏ తేజస్సును ఆ జానకి కల్గియున్నదో, ఆ రాముడను తేజస్సు అంతులేనిది) అని ప్రభువగు తనకు



క్కాణుమ్ సదృశైయావే నెన్ఱు వన్దతు. (నేరావనెన్ఱు) సర్వలక్షణత్తాలుమ్ విలక్షణైయాన పిరాట్టిక్కు విరూపై యాయిరుక్కిఱ తాన్ కాణుమ్ ఒప్పావనెన్ఱు వన్దాళ్. (ఓర్ నిశాశరి) "పెఱ్ఱ తాయోడే శీఱుపాఱెన్ఱు వన్దవళ్" ఎన్ఱు పిణన్దిన్ని ఎన్గిఱాళ్కాణు మివళ్. (తాన్) పెరుమాళుక్కు మేలాన పిరాట్టిక్కు ప్పెరుమాళోడు మొవ్వాత తాన్కాణు మొప్పావనెన్ఱు వన్దాళ్.

(తన్ శితైక్కు నేరావనెన్ఱోర్ నిశాశరితాన్ వన్దాళై) "త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయా త్కలామ్" ఎన్ఱు పెరుమాళ్, తాముమ్ తమ్విభూతియుమ్ ఒరుతట్టుడక్కుఙ్గాడ ప్పోరాతిరుక్కక్కాణుమ్ తాన్ నేరావనెన్ఱు వన్దతు. (వన్దాళై) పెరుమాళ్పాడే వన్దవాఱే "నాన్ ఏకదారవ్రతనా యిరుప్పన్, అకృతవివాహరా యిరుక్కిఱ ఇళైయపెరుమాళ్ పాడే పో" ఎన్న, అఙ్గే శెన్ఱవాఱే, అవర్, "నాన్ దాసనాయిరుప్పన్, ఎనక్కు నీ కడవైయానాల్ నీయుమ్ దాసియా యన్ఱోయిక్కు మత్తనైయన్ఱో ; పెరుమాళ్పాడే శెన్ఱాలన్ఱో ఉనక్కు ప్పట్టఙ్గట్టి

---

గొప్పతనము పల్కినను, ఆమెను పురస్కరించుకొనియే తనకు ఆ గొప్పతనమును చెప్పవలసియున్నట్లున్న సీతతో తాను సమానురాలను అగుదును – అని తలచి కదా శూర్పణఖ వచ్చినది. **(నేరావనెన్ఱు)** స్త్రీలకు తగిన అన్ని లక్షణములతో వెలుగుచున్న దేవికి సమానురాలను అగుదును. అని ఘోరరూపిణియైన తననుగూర్చికదా పల్కుచు వచ్చినది. **(ఓర్ నిశాశరి)** – అఖిలజగన్మాత అగు పిరాట్టిపట్ల కోపమును పొంది, వచ్చినదను కారణముచే, "శవములను తిను రాక్షసకులమునకు చెందినదికదా ఈ శూర్పణఖ" అనుచు కట్టివిచ్చి ఎత్తి చూపుచున్నది. **(తాన్)** – శ్రీరామునికంటె గొప్పది అయిన పిరాట్టికి, ఆ శ్రీరామునకును తగని తనను తగినదిగా భావించి, పల్కుచు వచ్చినది.

**(తన్ శీదైక్కు నేరావనెన్ఱు ఓర్ నిశాశరితాన్ వన్దాళై)** – **"త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్ కలామ్"** (రా.సు. 16-14) (ముల్లోకముల ప్రభుత్వమును, దానిని కలవాడును, సీతాదేవియొక్క ఒక కళామాత్రమునకైనను సరికారు) అను రీతిలో సీతను త్రాసులోని ఒక పళ్ళెములో ఉంచినచో, దానితో శ్రీరాముడును, అతని సంపద అగు త్రైలోక్యరాజ్యమును త్రాసుయొక్క వేరొక పళ్ళెములో చాలనివిగా ఉండును. అట్టి సీతకు తాను సమానురాలు అని తలచుచు శూర్పణఖ వచ్చినది.

**(వన్దాళై)** – శూర్పణఖ శ్రీరాముని వద్దకు రాగానే అతడు " నేను వివాహము అయినవాడను. ఒకే భార్య అను వ్రతమును (ఏకదారావ్రతమును) కలవాడను. వివాహముకాని లక్ష్మణుని వద్దకు పొమ్ము" అని పల్కెను. శూర్పణఖ లక్ష్మణునివద్దకు పోయెను. లక్ష్మణుడును "నేను శ్రీరామునకు దాసుడను. నీవు నాకు చెందిన దానివైనచో నీవుకూడ అతనికి సేవ చేయవలసినదే కదా ! శ్రీరాముని వద్దకు పోయి, అతనిని వివాహమాడిననే, నీకు పట్టమహిషిగా పట్టము కట్టును. నీవు అతనితో ఒకే సింహాసనమున కూర్చుండగలవు" అని పల్కెను. ఇట్లు శ్రీరాముని వద్దకు పోవుట, వచ్చుట, లక్ష్మణుని వద్దకు పోవుట వచ్చుట అను రీతిలో తిరిగిన

**క్కూరార్న్ద వాళాల్ కొడిమూక్కుమ్ కాతిరణ్డుమ్,**

**ఈరా విడుత్తవట్కు మూత్తోనై, వెన్నరకమ్,**

= పదునైన కత్తితో, కొడి మూక్కుమ్ కాదు ఇరణ్డుమ్ = తీగవంటి ముక్కును, రెండు చెవులను, ఈరా విడుత్త = ఖండించి, తఱిమివేసి, అవట్కు మూత్తోనై = ఆమె అన్న అగు ఖరుని, వెమ్

ఏకసింహాసనత్తిలే యిరుక్కలావతు'' ఎన్న; అఙ్గే పోవతు ఇఙ్గే వరువతాయ్ త్తిరిన్దవాఱే, ''ఇవళన్తో ఇతెల్లా మొట్టాతొழிకిఱాళ్'' ఎన్ఱు పిరాట్టియుడైయ పాడే వన్దు ''ఉన్నై త్తిన్ను మిత్తనై'' ఎన్ఱు వీழ.

(కూరార్న్ద వాళాలిత్యాది) తమ్మొడైయ కైయాలేయిఱే దణ్డిప్పతు; (రామస్య దక్షిణో బాహుః) తమ్మొడైయా తోళాయిరుక్కిఱ ఇళైయపెరుమాళై యిడువిత్తు దణ్డిప్పిత్తార్. (కూరార్న్ద వాళాల్) కూర్మై మిక్కిరుక్కిఱ వాళాలే. మురట్టుడమ్బిలే వ్యాపరియానిన్ఱాల్ రక్తస్పర్శ మిల్లాతపడి వ్యాపరిక్కలామ్ వాళ్. (కొడి మూక్కుమ్ కాతిరణ్డు మీరా విడుత్తు) పిరాట్టియోడొప్పాక్కి అఙ్గవిశేషఙ్గళై ప్పేణివర, అవఱ్ఱై ప్పోక్కివిట్టార్.

(ఈరా విడుత్తు) వాళిన్ కూర్మై శొల్లుకైక్కాక క్కూరార్న్ద వాళెన్ఱతు అఙ్గు ; ఈర్న్దనైయాలే - ఈరుకై క్కరితాన ఉడమ్బిన్ తీణ్మై శొల్లిఱ్ఱిఙ్గు. (ఈరా విడుత్తు) పిఱన్దకత్తిల్

పిమ్మట, "ఈ సీత కదా నా కోరికను నెఱవేరకుండ చేయుచున్నది" అని ఆమె వద్దకు వచ్చి, "నిన్ను నేను తినివేసెదను" అని సీతపైబడినది.

**(కూరార్న్ద వాళాల్ కొడిమూక్కుమ్ కాదిరణ్డుమ్ ఈరా విడుత్తు)** – లక్ష్మణుడు శూర్పణఖను అంగభంగమును చేసెనని శ్రీరామాయణములో చెప్పబడగా ఇచట శ్రీరాముడు చేసెనని చెప్పబడినదే ! ఇది ఏమి ? అనగా **"రామస్య దక్షిణో బాహుః"** (రా. ఆర-34-13) (రాముని కుడిచేయివంటివాడు లక్ష్మణుడు) అని చెప్పబడినట్లు లక్ష్మణుడు ఇతనికి కుడిచేయితో సమానుడు కావున, తన చేయి చేసినది తాను చేసినట్లు చెప్పుటలో తప్పులేదుకదా ! అసహ్యాపచారము చేసినదానిని, ఎవని ద్వారానో దండింపకుండ తన కుడిచేయి అగు లక్ష్మణునిద్వారా దండింపజేసెను-అని భావము.

**(కూరార్న్ద వాళాల్)** – పదును మిక్కలిగానున్న కత్తితో, శూర్పణఖయొక్క మొఱటు దేహములో వ్యాపించునపుడు, చొచ్చుకొని పోవునపుడు, దుష్టురాలగు ఆమె రక్తస్పర్శ తనకు కలుగకుండునట్లు మిక్కిలి త్వరగా పూర్తి అగునట్లు చాల పదునుగానున్న కత్తి. **(కొడిమూక్కుమ్ కాదు ఇరణ్డుమ్ ఈరా విడుత్తు)** సీతకు సమానురాలను అని తలచి వచ్చినది కావున తన చెవులను, ముక్కును సీతాదేవి చెవులవలె, ముక్కువలె మార్చుకొనిరాగా, అహంకార హేతువులగు వానిని ఖండించెను. **(ఈరా విడుత్తు)** ఖండించి, తఱిమివేసి అని అర్థము. **"కూరార్న్ద వాళ్"** అనునపుడు కత్తియొక్క తీక్ష్ణత చెప్పబడినది. **"ఈరా (అరుత్తు)"** అనునపుడు కోయుటకు కష్టమైన శూర్పణఖ దేహముయొక్క కాఠిన్యము చెప్పబడినది.



**శేరా వకైయే శిలై కునిత్తాన్, శెన్దువర్ వాయ్**

నరకమ్ = ఇక ఇతడు వేరొక క్రూరనరకమునకు పోయి, శేరా వకైయే = ఇంతకంటె వేరు నరకమును అనుభవింపలేడు అనునట్లు సకలనరకవేదనలను అనుభవింపజేయుచు, శిలై

నిన్ఱుమ్ పుక్కకత్తిఱ్కు వన్దాఱ్పోలన్ఱియే, పుక్కకత్తిల్ నిన్ఱుమ్ పిఱన్దకత్తుక్కుప్పోమ్బోతు, ఓరాధిక్యమ్ పణ్ణివిడవేణుమిఱే. పెరుమాళై ఆశైప్పడచ్చెయ్‌తేయుమ్ పిరాట్టిపక్కల్ అపరాధమ్ పణ్ణుకైయాలే విరూపైయానాళిఱే. ఆకైయాలే, ఇవ్విషయత్తిలే ఆశై యుణ్డానాలుమ్ తదీయర్‌పక్కలిలే అపరాధముణ్డానాల్ ఫలిక్కుమ్ ఫలమ్ శూర్పణఖైఫల మెన్నై. ఇవళాశైప్పట్ట విషయుమేయిఱే చిన్తయన్తియు మాశైప్పట్టతు. ఇప్పడి అపరాధమిల్లామైయాలే అవళ్ పెఱ్ఱుప్పోనాళిఱే. (విడుత్తు) ''తరుణౌ రూపసమ్పన్నౌ'' ఎన్ఱు ఖరన్ కాలిలే విழுమ్బడి పణ్ణి.

(అవట్కు మూత్తోనై) అనుకూలరానార్‌పక్కల్ సమ్బన్ధిసమ్బన్ధికళళవుమ్ రాగమ్ ఫలిక్కుమాపోలేకాణుమ్, ప్రతికూలరానార్‌పక్కల్ సమ్బన్ధిసమ్బన్ధికళళవుమ్ ద్వేషమ్ ఫలిక్కుమ్బడి. (వెన్నరకమ్ శేరా వకైయే శిలై కునిత్తాన్) వళైన్ద విల్లుమ్, కైయుమాయ్ ముష్టియిలే నిన్ఱ పెరుమాళై క్కణ్డ ఖరన్, ''మేలే పోయ్ ఒరు నరకానుభవమ్ పణ్ణవేణ్డా''

**(ఈరా విడుత్తు)** – పుట్టిన ఇంటినుండి స్త్రీ మెట్టిన ఇంటికి పోవునపుడువలెకాక, మెట్టిన ఇంటినుండి పుట్టినఇంటికి పోవునపుడు ఆమెకు ఒక గౌరవము చేసి పంపుట లోక సంప్రదాయముకదా. అట్లే, ఈమెకును అంగభంగమనెడి గౌరవమును చేసి, పంపిరి. సర్వలోకనాయకుడగు శ్రీరాముని (శూర్పణఖ) ఆశపడినను, పిరాట్టిని విరోధించుటచే అంగభంగమును పొందెను. కావున, భగవద్విషయములో ఆశ ఉన్నను అతని దాసుల విషయమున అపచారము చేసినచో శూర్పణఖకు దక్కిన ఫలమే దక్కును– అని తాత్పర్యము. ఈ శూర్పణఖ ఆశపడిన ఫలమునే **"చింతయంతి"** అను గోపికయు ఆశపడినది. కాని, ఆమె భాగవతాపచారములేక పోవుటచే ఫలమును పొందినదికదా !

**(విడుత్తు) – "తరుణౌ రూపసంపన్నౌ"** (రా. ఆర – 19–14) (రామలక్ష్మణులు యౌవనమును కలవారు, గొప్పసౌందర్యము నిండినవారు) అని ప్రారంభించి వీరి గొప్పతనమును పల్కుచు, ఖరుని పాదములందు పడునట్లు చేసి, అని అర్థము.

**(అవట్కు మూత్తోనై)** – అనుకూలుర విషయములో (ప్రేమను కలవారి విషయములో) వారి సంబంధి సంబంధులవరకు భగవానుని ప్రేమప్రవహించునట్లు, భక్తిలేనివారిపట్ల అతని కోపము సంబంధి సంబంధులవరకును ఫలించును. (**అవట్కు మూత్తోనై** :– రాక్షస శ్రేష్ఠుడగు సుమాలి కూతురు, రావణుని తల్లియగు కేకసి చెల్లెలు అయిన కుంభీనస రావణుని పినతల్లి. ఆమె కుమారుడగు ఖరుడు, కేకసి కడుపున రావణ, కుంభకర్ణులకు పిదప, విభీషణునకు ముందు పుట్టిన శూర్పణఖకు పినతల్లి కుమారుడను సంబంధముతో **"అవట్కు మూత్తోనై"** అని

ఎన్నుమ్బడి వయిఱెరిత్తలోడే ఎల్లా వనుభవముమ్ ఇజ్ఞే యనుభవిక్కుమ్బడి పణ్ణినాన్. పూర్వాశ్రమత్తిలే నఞ్జీయరెఝున్దరుళి యిరుక్కచ్చెయ్‌తే, భట్టర్ తిరుమడలరుళిచ్చెయ్‌కిఱపోతు, "భట్టర్ ఇవ్విడత్తుక్కు ఇవ్వార్తై యరుళిచ్చెయ్‌తార్" ఎన్ఱు శొల్ల, "ఇవ్వార్తై యరుళిచ్చెయ్‌తవరై క్కాణవేణుమ్" ఎన్ఱు కాణుమ్ భట్టర్ శ్రీపాదత్తిలే నఞ్జీయరాశ్రయిత్తతు.

(శెన్దువర్ వాయిత్యాది) ఖరవధత్తి నన్ఱు, పోయ్ చ్చొల్లుకైక్కు ఆళిల్లాతపడి అకమ్పన నొరువనుమ్ తప్పి ప్పెణ్ణుఱై యుడుత్తు ప్పోయ్, రావణనుక్కు, ప్పిఱన్ద వృత్తాన్తత్తై యఱివిక్క, అవన్ మారీచనైయుమ్ కూట్టిక్కొణ్డు వన్దు, పిరాట్టియైయుమ్ పెరుమాళైయుమ్ కడలుక్కుమ్ అక్కరైయుమ్ ఇక్కరైయుమాక ఉడలైయుమ్, ఉయిరైయుమ్ పిరిత్తాప్పోలే పిరిక్క, అతువే హేతువాక రావణనై నిరసిత్తపడి శొల్లుకిఱదు మేల్. (శెన్దువర్ వాయ్)

నిర్దేశింపబడెను. – దివ్యార్థ.) **(వెన్నరకమ్ శేరా వకైయే శిలై కునిత్తాన్)** వంచిన విల్లును చేతదాల్చి నిలచిన రాముని చూచిన ఖరుడు అతిభయంకరమైన ఆదృశ్యమును చూచిన పిమ్మటకూడ, వేఱొక నరకమును చేరి అనుభవింపవలసినది లేదు, దీనికంటె క్రూరనరకానుభవమే మేలు" అని పల్కునట్లు కడుపుమంటతో (ఆవేదనతో) సమస్తదుఃఖాను భవమును ఇచటనే అనుభవించెను. మేల్‌నాడులో నఞ్జీయర్ గృహస్థులై వేంచేసియున్న కాలమున, ఈ సందర్భములో అర్థమునుగూర్చిన విచారణ రాగా, **"వెన్నరకమ్ శేరా వకైయే శిలై కునిత్తాన్"** అనుటకు నరకమునకు పోకుండునట్లు, వీరస్వర్గమునకు పోవునట్లు విల్లు వంచెను" అని కొందఱు అర్థమును చెప్పగా విని, **"మత్తకత్తు శీరార్ తిరువడియాల్ పాయ్‌న్దాన్ తన్ శీదైక్కు నేరావనెన్ఱోర్ నిశాశరితాన్ వన్దాళై క్కూరార్న్ద వాళాల్ కొడిమూక్కుమ్ కాదిరణ్డుమ్ ఈరా విడుత్తు అవట్కు మూత్తోనై వెన్నరకమ్ శేరా వకైయే శిలై కునిత్తాన్ ఇరావణనై ఈరైన్దు శీరాల్ శిరమఱుత్తుచ్చెగ్ర్ఱు కన్ద"** అను ఈ సందర్భము భక్తిలేని వారికి కల్గించిన దుఃఖములను ముందు, వెనుకలలో తెలుపు ప్రకరణము అగుటచే, వీరస్వర్గమును పొందెను అనుట పొసగదు. కావున, "ఇచట భట్టరు ఎట్లు అర్థమును చెప్పుదురు ?" అనుచు అచటనున్న భట్టరు శిష్యులను ఒకరిని నఞ్జీయర్ ప్రశ్నింపగా "భట్టర్ తిరుమడల్‌కు అర్థమును అనుగ్రహించునపుడు, ఈ సందర్భమునకు అర్థముగా , వింటిని చేతదాల్చి నిలిచిన శ్రీరాముడు ఆ సన్నివేశమును చూచిన ఖరునకు దానికంటె క్రూరమైన నరకానుభవము వేఱొకటిలేదు అనునట్లు వింటిని వంచెను అని పల్కుదురు – అని వారు బదులిచ్చిరి."ఇట్టి పరమరస్యమైన అర్థమును చెప్పిన భట్టర్‌ను సేవింపవలెను" అను ఆశ మిక్కిలి వృద్ధి అగుటచే కదా, నఞ్జీయర్ భట్టర్ శ్రీపాదములను ఆశ్రయించిరి! **(శిలై కునిత్తాన్ ఎన్దదు – కొన్దైన్దపడి. మఙ్గళవఖ్ఖుక్కు. శిలైకునిత్తాన్** :– వధించెనని అర్థము.ఇది మంగళప్రయోగము. – దివ్యార్థ.)

**(శెన్దువర్ వాయ్ . . . . ఇరావణనై ఈరైన్దు శీరార్ శిఱమఱుత్తు చ్చెగ్ర్ఱుకన్ద శెఙ్గణ్‌మాల్)** ఖరుడు వధింపబడగానే, ఆ వృత్తాంతమును తెలుపుటకుకూడ వేరు వ్యక్తిలేని స్థితి ఏర్పడినది,



**వారార్ వనములైయాళ్ వైతేవి కారణమా,**

కునిత్తాన్ = విల్లును వంచి వధించినవాడు, శెమ్ తువర్ వాయ్ = మిక్కిలి ఎఱ్ఱని అధరమును కల్గినది, వార్ ఆర్ వనమ్ ములైయాళ్ = కంచుకమును అలంకరించిన, అందమైన స్తనములను

"జగ త్సశైలం పరివర్తయామి" నాట్టుక్కు త్తణ్ణీర్ ప్పన్దల్‌పోలే రక్షకరాక కృణ్ణపెరుమాళ్, "నాట్టై యళిప్పన్" ఎన్నప్పణ్ణిన ముఱువలిఱే. (పురేవ మే చారుదతీ మనిన్దితామ్) మానై కృణ్ణపోతు, పెరుమాళై, "ఇమ్మానై ప్పిడిత్తు త్తరవేణుమ్" ఎన్ఱు ఇరప్పోడే కూడిన ముఱువలోడే కేట్టాళాకిల్, లోకత్తై యెల్లామ్ కూట్టి క్కులైయాక వఱుత్తుప్పోక విడువనెన్ఱారిఱే. (వారార్ వనములైయాళ్) "మలరాళ్ తనత్తుళ్ళాన్" ఎన్ఱు పెరుమాళ్ కిడక్కుమిడమిఱే. (వైతేవి) "విదేహసుతామ్" ఎన్ఱు పెరుమాళ్ వాయ్‌పులగ్ఱుమ్ కుడిప్పిఱప్పిఱే. (కారణమా) అవళ్‌హేతువాక.

అకంపనుడు ఒక్కడే తప్పి బతికి, స్త్రీ వేషమును దాల్చి, పోయి రావణునకు జరిగిన విషయమును తెలిపెను. అతడు (రావణుడు) మారీచుని సహాయముగా కలుపుకొనివచ్చి, శ్రీరాముడు, సీతాదేవియు సముద్రమునకు ఈవలివైపున, ఆవలి వైపునను ఉండునట్లు, శరీరమును ప్రాణమును వేఱుచేసినట్లు విడదీయగా, అదియే కారణముగా రావణుని వధించిన తీరు ఇకపై వివరింపబడుచున్నది.

**(శెన్దువర్ వాయ్ )** – మిక్కిలి ఎఱ్ఱని కిందిపెదవిని (అధరమును) కల్గినది. **"పురేవ మే చారుదతీ మనిందితాం దిశంతి సీతాం యది నాద్య మైథిలీమ్, సదేవగంధర్వమనుష్యపన్నగాం జగత్ సశైలం పరివర్తయామ్యహమ్"** (రా.ఆర–64–78) (పూర్వమువలె, అందమైన చిఱునవ్వును కల్గినది, దోషములు ఏమియు లేనిది, మిథిలా రాజకుమార్తె అగు సీతను తీసికొనివచ్చి నాకు అప్పగింపకపోయినచో, దేవతలు,గంధర్వులు, మనుష్యులు సర్పములు అను మొదలగు వారితో కూడియున్న, పర్వతములతో కూడిన లోకమును నేను తలక్రిందు చేసెదను) అనుచు లోకముల కన్నిటికిని ఒక, అసమానమై, చల్లని, సేదదీర్చు పందిరివలె ధారకుడగు శ్రీరాముడుకూడ "లోకములను నశింపజేసెదను" అని పల్కునట్లు చేసిన చిఱునవ్వుకదా (సీతాదేవిది). **(పురేవ మే చారుదతీ మనిందితామ్)** – బంగారులేడిని చూచినపుడు – "స్వామీ ! ఈ లేడిని పట్టుకొని ఇవ్వవలెను" అనుమాటను అనునపుడు ప్రార్థించుచు, మందస్మితము చేయుచున్న సీతను నా ముందుకు తీసికొని రాకపోయినచో, లోకములను అన్నిటిని కలిపి ఒక అరటి గెలను నఱికినట్లు, నశింపజేసెదను– అని అనెను కదా! **(వారార్ వనములైయాళ్) – "మలరాళ్ తనత్తుళ్ళాన్"** (మూన్ఱా–తిరు–3) (పద్మనివాసిని స్తనములలోనుండువాడు.) అని శ్రీరాముడు నివసించుచోటు కదా దేవేరి స్తనములు. **(వైదేవి)** "విదేహరాజకుమార్తెను" అని శ్రీరాముడుకూడ నోఱుతెఱచి పల్కునట్టి అభిజాత్యమును కల్గినదికదా సీతాదేవి !

## ఏరార్ తడన్దోళిరావణనై, ఈరైన్దు

కల్గినదియు అగు, వైదేవి కారణమ్ ఆ = సీతాదేవికొఱకు, ఏర్ ఆర్ తడమ్ తోళ్ఇరావణనై= అందమైన గొప్ప భుజములను కల్గిన రావణుని, శీర్ ఆర్ ఈ రైన్దు శిరమ్ అఱుత్త = గొప్ప,

(ఏరార్ తడన్దోళిరావణనై) ఒన్ఱుక్కుమ్ వికృతనాకాత తిరువడియుమ్, "అహో రూప మహో ధైర్యమ్" ఎన్ఱు వికృతనామ్బడి వడివు పడైత్తవనితే రావణన్. (ఈరైన్దు శీరార్ శిర మఱుత్తు) పత్తుత్తలైయైయుమ్ ఒరుకాలే యఱాతే ఐయైన్దాక వఱుత్తు లీలై కొణ్డాడినపడి. (శీరార్ శిర మఱుత్తు) అఱుప్పుణ్డు విழுకిఱ తలైకళుమ్, "రఞ్జనీయస్య విక్రమైః ॥ ఎన్ఱు పెరుమాళ్ వీరప్పాట్టై క్కణ్డు శిరిత్తుక్కొణ్డు విழுకిఱపడి. అఱుప్పుణ్డు విழுన్ద తలైకళై క్కుழுకుమ్ పరున్దుమ్ ఇశిక్కక్కణ్డు, నిఱ్కిఱ తలైకళ్, "నామ్ ముఱ్పాడరాక ప్పెఱ్ఱిలోమ్" ఎన్ఱు ఆశైప్పడుకిఱపడి.

(శెఱ్ఱు) వన్దవనై యోరమ్బాలే కొల్లాతే, చతురఙ్గబలత్తై క్కొన్ఱు, కుతిరైకళై క్కొన్ఱు,

**(కారణమా)** – ఇట్టి మహిమనుకల (గొప్పతనమునుకల) ఈమె కారణముగా– **(ఏరార్ తడన్దోళిరావణనై)** – శ్రీరాముని, సీతాదేవిని తప్ప వేరు దేనిని లెక్కపెట్టని హనుమంతుడుకూడ **"అహో రూప మహో ధైర్యమ్"** (ఆహా ! వీని రూపము, ధైర్యము ఆశ్చర్యకరములు) (రా.సు–49–17) అని గౌరవించునట్టి దేహమును కలవాడుకదా రావణుడు. ఇది ఇచట చెప్పబడుచున్నది.

**(ఈరైన్దు శీరార్ శిర మఱుత్తు)** – పదిశిరస్సులను ఒక్క సారే నఱికినచో తాను శిరస్సు ఖండించినప్పటి వైభవమును అతడు (రావణుడు) చూడలేడుకదా ! అందుచే ఆ గొప్పతనమును అతడే చూచి, అతని కడుపు మండునట్లు అయిదు, అయిదు తలలుగా ఖండించి, దానిని చూచి లీలారసమును అనుభవించినరీతి కీర్తింపబడుచున్నది.

**(శీరార్ శిర మఱుత్తు)** – అతిశయము మించిన తలలను ఖండించి అని అర్థము. ఖండింపబడిన తలలకుగల అతిశయమేమి? అనగా, ఖండింపబడి, క్రిందపడు తలలు కూడ **"శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః"** (రా.యు–106–6) (ప్రసిద్ధిచెందిన వీర్యమును కలవాడు, పరాక్రమకృత్యములచే ఆనందింపచేయువాడును అగు శ్రీరాముని) అనుచు శ్రీరాముని వీర్యమును చూచి, పొగడి, నవ్వుచు కిందపడుటయే వానికిగల అతిశయము. లేక, ఖండింపబడి, కిందపడుటకు భయపడకుండ, దానినే వీర్యమునకు అరుదైన చిహ్నముగా తలచుటయే వీని యొక్క అతిశయము అనదగును. అనగా – ఖండింపబడి, కిందబడు తలను గద్దలు, డేగలు పొడిచి తినుటను చూచి, ఖండింపబడకుండనున్న తలలు – "మనము ముందుగానే కిందపడి, కీర్తిని పొందలేకపోయితిమే !" అని ఆశపడుటయే ఈ తలలకుగల అతిశయము అనియు భావము. **(శెఱ్ఱు)** – యుద్ధము చేయుటకు వచ్చినవానిని ఒక బాణముతో వధింపకుండ, రథ, గజ, తురగ, పదాతులనెడి చతురంగములనుకల సేనను నాశనము చేసి, రథమునకు



## శీరార్ శిర మఱుత్తు చ్చెఱ్ఱుకన్ద శెఙ్గణ్మాల్
## పోరార్ నెడువేలోన్ పొన్ పెయరో నాకత్తై,

పదితలలను నఱికి, వధించి, ఉకన్ద = (మునుల విరోధిని వధించితిని అని ) మనస్సున సంతోషించిన, శెమ్ కణ్మాల్ = ఎఱ్ఱతామరలవంటి కన్నులను కలవాడు, పోర్ ఆర్ నెడి వేలోన్ పొన్ పెయరోన్ ఆకత్తై = ఎల్లప్పుడు యుద్ధములో అమరియున్న, పొడుగైన

సారతియై క్కొన్ఱు, తేరై యழிత్తు, క్కొడియై యఱుత్తు, త్తలైయై చ్చిరైత్తు. త్తోళ్కళై త్తుణిత్తు, త్తలైకళై యఱుత్తు, ఇవఱ్ఱై యెల్లామ్ కణ్డు అవన్ నెఞ్జాఱల్ పడుమ్బడి పణ్ణి పిన్నై యవనై క్కొన్ఱపడి. (ఉకన్ద శెఙ్గణ్మాల్) (ఉకన్ద) "ఋషికళుక్కు క్కళై యఱుక్కప్పెఱ్ఱోమ్" ఎన్ఱుమ్, "శ్రీవిభీషణాழ்వాన్ తలైయిలే అభిషేకమ్ పణ్ణప్పెఱ్ఱోమ్" ఎన్ఱుమ్ ఉకన్ద. (శెఙ్గణ్మాల్) "ఆశ్రితవిరోధికళై ప్పోక్కి అవర్కళుక్కు ఉకప్పాకప్పెఱ్ఱోమ్" ఎన్ఱు, వ్యామోహముమ్ వాత్సల్యముమ్ తిరుక్కణ్ణిలే తోఱ్ఱినపడి.

(పోరార్ నెడువేలోనిత్యాది) పిరాట్టిక్కాక అమ్బెఱ్ఱపడి శొల్లిఱ్ఱు కీழ்; అప్పడి క్రమమ్ శెయ్యవొణ్ణాతపడి ఆశ్రితరుడైయ ప్రతిజ్ఞాసమకాలత్తిలే తోఱ్ఱవేణ్డి అతుక్కు

పూన్చిన గుఱ్ఱములను చంపి, సారథిని వధించి, రథమును భగ్నము చేసి, పతాకను విరుగగొట్టి, తలను పొర్లించి, కిరీటమును క్రిందకు గెంటి, బాహువులను ముక్కలు చేసి, తలలను ఖండించి – వీనిని అన్నిటిని చూచి అతడు మనోవేదనను అనుభవించునట్లు చేసి, పిమ్మట, అతనిని వధించెను.

**(ఉకన్ద శెఙ్గణ్ మాల్) – (ఉకన్ద)** – "ఋషుల విరోధులను నశింపజేసితిమి", "విభీషణునకు పట్టాభిషేకమును చేయగల్గితిమి" అని మనస్సులో సంతోషించిన. ఇతరుల కార్యములను పూర్తిచేసి తాను సంతోషపడువాడుకదా ఇతడు ! **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ"** (రా.బా–1–85) (లంకలో విభీషణుని రాక్షసరాజుగా పట్టాభిషేకము చేసి, శ్రీరాముడు తనకార్యమును పూర్తి చేసినవాడై, చింతతీరి ఆనందించెను) అనెనుకదా వాల్మీకి !

**(శెఙ్గణ్ మాల్)** – దాసుల విరోధులను నశింపజేసి, వారిని ఆనందింపజేసితిమి" అను ప్రేమ, వాత్సల్యమును కన్నులలో ప్రకాశించినది. ప్రేమ, వాత్సల్యమును కలవారి కన్నులు ఎఱ్ఱగా నుండుట లోక ప్రసిద్ధము. **"మాల్"** అనగా ప్రేమను కలవాడు,

**(పోరార్ నెడు వేలోన్. . . )** చివరివరకు రావణుని మార్చుటకు వీలగునా! అని పరీక్షించి, చివరలో పిరాట్టికొఱకు వక్షస్సులో బాణమును ప్రయోగించి, రావణుని చంపుట పూర్వము తెలుపబడినది. అట్లు సహించియుండి, కార్యమును పూర్తిచేయుటకు వీలుకానిదియై, "స్తంభములో కూడ ఉన్నాడు" అని ప్రహ్లాదుడు ప్రతిజ్ఞ చేసిన మరుక్షణమే ఆవిర్భవింపవలసిన నిర్బంధమును కల్గినదై, దానికి తగినదిగా అవతరించిన నరరూప–సింహరూపములను

## క్కూరార్న్ద వళ్ళుకిరాల్ కీణ్డు, కుడల్మాలై

వేలాయుధమునుకల హిరణ్యకశిపుని శరీరమును, అరియురువాయ్ = నృసింహరూపుడై, కూర్ ఆర్న్ద వళ్ళుకిరాల్ కీణ్డు = పదును మిక్కిలిగాకల, దట్టమైన గోళ్ళతో బద్దలుచేసి, కుడల్ = ఆ అసురుని పేగులను వెలుపలికి లాగి, శీర్ ఆర్ తిరుమార్బిన్ మేల్ మాలై కట్టి =

ఉతవత్తోఱ్ఱిన ఇరణ్డు వడివై యొన్రాక త్తైత్తుక్కొడు పుఱప్పట్టు అవన్విరోధియై ప్పోక్కినపడి శొల్లుకిఱతు మేల్. (పోరార్) ఎతిరికళ్ శరీరఙ్గళిలే వ్యాపరిత్తు త్తిరియు మత్తనైపోక్కి, ఓరిడత్తిలేయిరుక్క అవసరమిల్లై. నిణముమ్, శతైయుమ్, కుడలుమ్ శూழ்న్దు కழுకుమ్ పరున్దుమ్, పేయుమ్ సేవిక్క త్తిరియు మత్తనైపోలేకాణుమ్. (నెడు వేల్) "అవష్టభ్య మహద్ధనుః" ఎన్ను మాపోలే ఇవనాల్ అడక్కి యాళవొణ్ణాతాయిరుక్కిఱపడి.

(వేలోన్) పట్టుక్కిడక్కుమ్బోతుమ్ పిడిత్త వేల్ విడాతే ఇతువే తనక్కు నిరూపకమాయిరుక్కు మెన్నై. (పొన్ పెయరోన్) హిరణ్యనెన్తితే పెయర్. (ఆకత్తై) తిరువుకిరు క్కిరై పోరుమ్బడి, కాట్టిల్ పన్టికళై యూట్టియిట్టు వళర్ప్పారైప్పోలే బ్రహ్మాదికళ్ వరఙ్గళాలే పూణ్గట్టిన మార్విఱే. (కూరార్న్ద వళ్ళుకిరాల్) కూర్మైమిక్కు చ్చెఱిన్ద వుకిర్.

రెండిటిని కలుపుకొని , స్తంభములో అవతరించి, తన దాసుడగు ప్రహ్లాదుని విరోధిని నిరసించిన ప్రకారమును ఇకపై తెలుపుచున్నారు.

**(పోరార్ వేల్)** – యుద్ధములో పొందికగానుండు వేలాయుధము. శత్రువుల శరీరములలో వ్యాపించి, గాయపఱచుటయే వృత్తిగా కల్గినది తప్ప, ఈ వేల్‌కు ఆయుధశాలలో విశ్రమించు అవకాశము లేదు. కొవ్వు, మాంసము, పేగులతో చుట్టబడి, మాంసభక్షకులగు గ్రద్దలు, రాబందులు, పిశాచములు తనను సేవింపగా తిరుగుచున్నట్లు కదా! ఈ వేల్ ఆయుధము ఉన్నది. **(నెడు వేల్) – "ఆలిఖంత మివావష్టభ్య మహ ద్ధనుః"** (రా.యు.100–12) (ఆకాశమును తాకి నిలచియున్నదివలెనున్న గొప్ప ధనస్సును గట్టిగా పట్టుకొనియున్న శ్రీరాముని) అని చెప్పబడు శార్ఙ్గమువలె. శత్రువులపై ప్రయోగించినచో , పిమ్మట ఈ హిరణ్యునిచేతకూడ నియంత్రించుటకు వీలుకానిదైయుండుటయే వేలాయుధముయొక్క ధైర్యము.
**(వేలోన్)** – వేలాయుధమును కలవాడు అని అర్థము. మరణించి పడియున్నపుడును తాను పట్టుకొనియున్న వేలాయుధము తనకు నిరూపకమగునట్లు పడియుండెనని తాత్పర్యము.
**(పొన్ పెయరోన్)** – బంగారమునకు పర్యాయము అగు హిరణ్యానామమును కల్గినవాడు కదా ఇతడు. (**పొన్ పెయకోన్– ఇదు లక్షితలక్షణై. హిరణ్యమ్ ఎన్ఱ వడశొల్ పొన్ ఎన ప్పొరుళ్ పడుమ్.** పొన్ పెయరోన్ :– ఇది లక్షిత లక్షణ. హిరణ్యమను సంస్కృత పదము బంగారమను అర్థమునిచ్చును. – దివ్యార్థ.) **(ఆకత్తై)** వక్షఃస్థలమును అని అర్థము. నరసింహుని నఖములకు ఎర చాలినట్లుండుట, అరణ్యములో వేటాడుటకు పందులను ఎరగావేసి, పెంచునట్లు, బ్రహ్మాదులు తమ వరబలముతో దార్ఢ్యమును పొందునట్లు చేసిన వక్షఃస్థలముకదా!
**(కూరార్న్ద వళ్ళుకిరాల్)** – మిక్కిలి పదునుగానుండి, దట్టముగానున్న నఖములతో అని



## శీరార్ తిరుమార్పిన్మేల్ కట్టి, శెఙ్గురుతి

వరలక్ష్మీస్థానమైన వక్షఃస్థలములో జయలక్ష్మీమాలగా అలంకరించుకొని, శెమ్ కురుది శోరా కిడన్దానై = ఎఱ్ఱని రక్త ప్రవాహము ప్రవహించుచున్న ఆ అసురుని, కుఙ్కుమమ్ తోళ్ కొట్టి

పిరాట్టిమారోడే పరిమాఱువెమ్బోతు అవర్కళుమ్ కూశుమ్బడియాన సౌకుమార్యత్తైయుమ్, శత్రుక్కళోడే పరిమాఱుమ్బోతు అవర్కళై యழிయచ్చెయ్యవేణ్డుమ్ తిణ్మైయైయు ముడైయనాయిరుక్కుమాపోలే, ఇవఱ్ఱుక్కు మిరణ్డు పుడై యుణ్డుపోలే కాణుమ్. (కీణ్డు) నరసింహత్తిన్ తోఱ్ఱరవిలే శీఱ్ఱత్తై క్కణ్డు పైయల్, ఉడమ్బు వెతుమ్బి, పాశుక్కిన పన్టిపోలే పతమ్శెయ్య అనాయాసేన కిழிత్తపడి.

(కుడల్మాలై శీరార్ తిరుమార్వినేమేల్ కట్టి) శీఱ్ఱత్తిన్ మికుతియాలే కుడలై ప్పఱిత్తు త్తిరుమార్విలే కట్టి క్కొణ్డానాయిఱ్ఱు. అతావతు - విజయశ్రీ విళఙ్గుకిఱ తిరుమార్విలే అతుక్కు మాలైయిట్టపడి. పిరాట్టియిరుక్కిఱ తిరుమార్విలే కాణుమ్ కట్టిఱ్ఱు. అనాశ్రితవిషయత్తిల్ ఇత్తనై శీఱ్ఱ మివనుక్కిల్లైయాకిల్ అవళ్ అణైయాళిఱే! (శెమ్ కురుతి శోరా క్కిడనానై క్కుఙ్గుమత్తోళ్ కొట్టి) రక్తవెళ్ళమ్ కొழிక్కుమ్బడి కిழிత్తు, అవనై, పిరాట్టిమారోడే కలక్కైక్కు అలఙ్కరిత్త తిరుత్తోళినేమలే శీఱ్ఱత్తి న్మికుతియాలే యొడుత్తు అణైన్దుకొణ్డానాయిఱ్ఱు (శెమ్ కురుతి శోరా క్కిడన్దానై - కూరార్న్ద వళ్ళుకిరాల్ కీణ్డు

భావము. **"వళ్ళుకిర్"** – అనగా – నిబిడములైన నఖములు. లేక, **వణ్ణుకిర్** – దృఢమైన నఖములు. అనగా, దేవేరులతో విహరించునపుడు వారుకూడ "దివ్యదేహము ఎక్కడ కందిపోవునో ! ఏమో !" అని భయపడునట్లున్న తిరుమేని సౌకుమార్యమును, శత్రువులతో పోరాడునపుడు వారిని నశింపజేయుటకు అవసరమైన బలమును కల్గినవాడై యుండునట్లే, ఇవి కూడ – హిరణ్యుడు మొదలగువారికి పదునైన ఆయుధముగను, దేవేరులు మొదలగు అనుకూలురకు భోగ్యవస్తువులుగను ఉన్నవి. **(కీణ్డు)** – నరసింహునకు అవతరించిన పిమ్మట కల్గిన కోపమును చూచి, హిరణ్యుని దేహము వాడి పోయి, అగ్నిలో మెత్తబడిన పందివలె పక్వముకాగా, దానిని ఎట్టి శ్రమ లేకుండ స్వామి చీల్చెను.
**(కుడల్మాలై శీరార్ తిరుమార్బిన్ మేల్ కట్టి)** – కోపాతిశయముచే పేగులను పెఱికి, నరసింహుడు తన వక్షస్థలమున కట్టికొనెను. అనగా – **"శీరార్ తిరుమార్వు"** అని విజయలక్ష్మి తాండవమాడు వక్షఃస్థలములో పేగులమాలను విజయమాలగా దాల్చెను. **శీర్ ఆర్ –** విజయలక్ష్మి వెల్గునట్టి అని అర్థము. లేక, పెరియపిరాట్టి అను లక్ష్మీదేవి వేంచేసియున్న వక్షఃస్థలములో కదా ఈ పేగులమాలను ధరించెను! అనియు చెప్పవచ్చును. దాసులకు విరోధుల విషయమున ఇంతటి కోపము ఇతనికి లేనిచో, వీరపత్ని అగు తాను ఇతనిని ఆలింగనము చేసికొనదుకదా ! అందుచే పేగులమాలను ధరించెనని భావము.

**శోరా క్కిడన్దానై క్కుఙ్గుమత్తోళ్ కొట్టి,**
**ఆరా వెళ్లున్దా నరియురువాయ్, అన్దియుమ్**

= కుంకుమముచే అలంకరింపబడిన తన బాహువులపై కొట్టి, ఆరా ఎళ్లున్దాన్=సింహనాదమును చేసి లేచినవాడు, అన్దియుమ్ = మఱియు, పేర్ వామనన్

కుడన్మాలై శీరార్ తిరుమార్ పిన్మేల్కట్టి - కుఙ్గుమత్తోళ్ కొట్టి ఆరా వెళ్లున్దాన్) ఎన్దన్వయమ్. ఆర్ప్పతుమ్ శెయ్తాన్; కిళరువతుమ్ శెయ్తాన్.

(ఆరా వెళ్లున్దా నరియురువాయ్) ''అవాక్యనాదరః'' ఎన్ఱు ఎతిర్త్తలైయిల్లామైయాలే వార్తై శొల్లానెన్ఱు ప్రసిద్ధనాయిరుక్కిఱవన్, ఆశ్రితవిరోధియై ప్పోక్కప్పెఱ్ఱోమెన్నుమ్ హర్షత్తాలే ఆర్త్తుక్కొణ్డాన్.

(అన్దియు మిత్యాది) ఇప్పడి యఱ్ఱియచ్చెయ్యవేణ్డుమ్ ప్రాతికూల్యమేయన్దియే, ఆనుకూల్యలవముడైయవనాయిరుక్కుమితే మహాబలి, అతావతు - ఔదార్యగుణ మెన్బతొన్ఱుడైయనాకైయాల్; అవనై శడక్కెన అఱ్ఱియచ్చెయ్య వొణ్ణామైయాలుమ్, దేవర్కళుక్కాక అవనై యఱ్ఱియ చ్చెయ్యవేణ్డుకైయాలుమ్ "అవన్ కొడుక్క వుకప్పన్"

**(శెఙ్కురుతి శోరా క్కిడన్దతానై కుఙ్కుమత్తోళ్ కొట్టి)** – రక్తము ప్రవహించునట్లు చీల్చబడిన అతనిని, లక్ష్మీదేవితో ఆలింగనమును చేసికొనుటకు కుంకుమతో అలంకరింపబడిన బాహువులలో మోదెను. **(శెఙ్కురుతి శోరా క్కిడన్దానై – కూరార్న్ద వళ్ళుకిరాల్ కీణ్డు కుడల్ మాలై శీరార్ తిరుమార్బిన్మేల్ కట్టి కుఙ్కుమత్తోళ్ కొట్టి ఆరా వెళ్లున్దాన్)** అని అన్వయము. **(ఆరా వెళ్లున్దాన్)** – సింహనాదము చేయుచు లేచెను. శబ్దమును చేయుచు పైకి లేచెను. **(ఆరా వెళ్లున్దా నరియురువాయ్) – (అవాక్యనాదరః** – ఛాందో –3–14) (మాటను పలుకనివాడు, ఎవరిని ఆదరింపనివాడు పరమాత్మ) అని తాను మాటలాడుటకు తగినవారు ఎవరును లేకపోవుటచే ఎవరితోను మాటను మాటలాడనివాడుగా ప్రసిద్ధుడైయున్నవాడు. "దాసుల విరోధులను నిరసింపగల్గితిమి" అను ఆనందముతో స్వామి శబ్దము (సింహనాదము) చేసెను. **(ఆరా – శెయ్యా వెన్నుమ్ వాయ్ప్పాడిఱన్దకాల వినైఎచ్చమ్. ఆర్త్తు ఎన్దపడి. 'ఆరా'** – భూతకాలిక అసమాపక క్రియారూపమునకు సింహనాదమును చేసి అని అర్థము. – దివ్యార్థ.)

**(అన్దియుమ్. . .. )** హిరణ్యునివలె దోషమును కలవాడైనను నిరసింపవచ్చును. అట్లు కాకుండ, కొద్దిపాటి మంచినికూడ కలవాడైయున్నవాడు కదా మహాబలి. అందుచే, ఇతనిని జయించుట కఠినము కదా ! అట్టివానినికూడ జయించిన విధము ఇకపై తెలుపబడుచున్నది. అనగా దాతృత్వగుణమను ఒక సద్గుణము కల్గినవాడుకదా మహాబలి. అందుచే అతనిని హిరణ్యునివలె త్వరగా నిరసించుటకు వీలుకాదు. దేవతలకొఱకు అతనిని జయించియే తీరవలెను. అందుచే, "అతడు దానమిచ్చుటలో సంతోషపడువాడు " అను గుణమును తలచి,



**పేర్ వామననాకియ కాలత్తు, మూవడి మణ్**
**తారా యెనక్కెన్ఱు వేణ్డి చ్చలత్తినాల్,**

ఆకియ కాలత్తు = గొప్ప వామనుడుగా అవతరించిన కాలములో, మావలియై = మహాబలివద్దకు, మూ అడి మణ్ ఎనక్కు తారాయ్ ఎన్ఱు వేణ్డి = మూడడుగుల నేల నాకు ఇమ్ము అని

ఎన్నుమత్తై నినైత్తు త్తన్నై యిరప్పాళనాక్కి, అవన్పక్కలిలే శెన్ఱు, నీరేఱ్ఱు, భూమి వాఙ్గి ఇన్ద్రనుక్కు క్కొడుత్తపడి శొల్లుకిఱతు.

(అన్దియుమ్ పేర్ వామ నాకియ కాలత్తు) నాట్టిల్ వామనఙ్గళెల్లామ్ వళర్న్దరుళిన్ విడ మెన్నలామ్బడి శిఱుత్తిరుక్కు మెన్నుతల్. వడివేయన్ఱియే పేరుమ్ వామనానాకియ కాలమ్. (మూవడి మణ్ తారాయ్) "మహాబలీ ! ఎనక్కు మూవడి మణ్ తరవేణుమ్" ఎన్ఱాన్; అవనుమ్ ''తరుకిఱోమ్'' ఎన్ఱాన్. అఙ్గనాకవొణ్ణాతు, (తారాయ్) ఎన్ఱాన్ వళైప్పారైప్పోలే. (ఎనక్కెన్ఱు) ఒన్ఱైయుమ్ "ఎనక్కు" ఎన్నాతవన్ కాణుమ్ "ఎనక్కు" ఎన్ఱాన్

దానికి తగినట్లు తనను యాచకునిగా చేసికొని అతని వద్దకుపోయి, తానే జలమును పోసి, భూమిని గ్రహించి, ఇంద్రునకు తిరిగి ఇచ్చిన విధము చెప్పబడుచున్నది.

**(అన్దియుమ్ పేర్ వామననాకియ కాలత్తు)** – వామనులలో పెద్దవాడు. **"పేర్ వామనన్"** – లోకములో మిగిలిన వామనులందఱును పొడుగువారు అనునట్లు, అంతటి పొట్టితనమును కలవాడని భావము. లేక, శరీరమున పొట్టిగానున్నవారు అందఱు పొట్టివారు అను పేరును పెట్టుకొనుటలేదు కదా ! ఇతడు అట్లు కాకుండ, రూపమున పొట్టిగా నుండుటతో పాటు "వామనుడు" అను పేరును కలవాడైయున్నాఁడు అని భావము. **(మూవడి మణ్ తారాయ్)** – "మహాబలీ ! నాకు మూడడగుల నేల దానమివ్వవలెను" అని వామనుడనెను. అతడును "ఇచ్చెదను" అనెను. "ఇచ్చెదనని మాటిచ్చిన చాలదు. ఇపుడే ఇవ్వవలెను." అని, తాను ఇచ్చిన అప్పును ఇపుడే తిరిగి ఇవ్వవలెనని నిర్బంధించువారివలె నిర్బంధించెను. (ఇచ్చిన అప్పును సకాలములో తిరిగి ఇవ్వకుండ తిరుగువానిముందు, అప్పు ఇచ్చినవాడు నేలపై ఒక గీతగీచినచో, అప్పుపడినవాడు అప్పును తీర్చిన పిమ్మటనే ఆ గీతను దాటపోవలయుననునది మళయాళదేశ సంప్రదాయము. దీనికే "**వళైప్పు**" అని పేరు) **("పేర్ వామననాకియ కాలత్తు" – ఎన్ద పాఠమ్ వెణ్డలైక్కు చ్చేరాదాకైయాలుమ్, ప్రాచీనపాఠ మన్ఱాకైయాలుమ్ మఱుక్కత్తక్కదు. "వామనాకియ" ఎన్బదే పాఠమ్. వామన్ – వామనన్, శిదైవు. "శీరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు పేర్ వామనాక్కాల్ పేరాళా" ఎన్ద పెరియతిరువన్దాది నోక్కత్తక్కదు. "పేర్ వామననాకియ కాలత్తు"** అనుపాఠము వెణ్పా ఛందమునకు ఒప్పదు కావున, ప్రాచీన పాఠము కాదు కావున అంగీకరింపతగనిది. **"వామనాకియకాలత్తు"** అనునదియే సాధుపాఠము."వామన్" అనునది వామనపద వికృతి. **"శీరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు పేర్ వామనాక్కాల్ పేరాళా"** అను పెరియతిరువన్దాది ప్రయోగము గమనార్హము. – దివ్యార్థ.) **(ఎనక్కెన్ఱు)** – ఏ ఒక్కటిని

**నీరేఱ్ఱులకెల్లామ్ నిన్దళన్దాన్ మావలియై,**
**ఆరాత పోరి లశురర్కళుమ్ తానుమాయ్,**
**క్కారార్ వరై నట్టు నాకమ్ కయిఱాక,**

యాచించి, నీర్ ఏఱ్ఱు = అతడు జలధారతో దానమిచ్చన ఆ నేలను పొంది , శలత్తినాల్ = వంచనతో, నిన్ఱు = నిమిరి, ఉలకు ఎల్లామ్ అళన్దానై = లోకములను అన్నిటిని కొలిచి, వశీకరించుకొనినవాడు, ఆరాద పోరిల్ = ముగియని దేవాసురయుద్ధములో, అశురర్ కళుమ్ తానుమ్ ఆయ్ = అసురులు, తాను, కార్ ఆర్ వరై నట్టు = మేఘములు విశ్రమించు

పరార్థమాకైయాల్. (వేణ్డి చ్చలత్తినాల్ నీరేఱ్ఱులకెల్లామ్ నిన్దళవన్దాన్ మావలియై) వేణ్డి క్కెయిలే నీర్ విழున్దవాఱే, శిఱుకాలై క్కాట్టి ప్పెరియకాలాలే, లోకమడైయ అళన్దుకొణ్డాన్. (మావలియై మూవడి మణ్ తారా యెనక్కెన్ఱు వేణ్డి చ్చలత్తినాల్ నీరేఱ్ఱులకెల్లామ్ నిన్దళన్దాన్) ఎన్ఱు అన్వయమ్. (ఆరాతపోరిత్యాది) దేవర్కళుమ్ అసురర్కళుమాయ్ క్కడలై క్కడైయప్పుక్కు మాట్టామైయాలే (మాట్టాదే) తాన్ కడలై క్కడైన్దపడి శొల్లుకిఱతు. (ఆరాత పోరిల్) ఇవర్కళుక్కారాతే యిరుక్కుమెన్నుతల్, తనక్కారాతే యిరుక్కుమెన్నుతల్. (అశురర్కళుమ్ తానుమాయ్) దేవర్కళుమ్ అసురర్కళుమాయ్ ఎన్నవేణ్డియిరుక్క, ఎతిర్త్తలైయాన అసురర్కళై చ్చొల్లి, పిన్నై త్తన్నై చ్చొల్లువానేన్ ? ఎన్నిల్ అనుకూల్యలవముడైయార్ "తాన్" ఎన్నుమ్ శొల్లుక్కుళ్ళే యడఙ్గుకైయాలే తన్నై చ్చొల్లిఱ్ఱు.

నాది అని అననివాడు కదా; **"భక్తానామ్"** అని తలచువాడు కదా "నాకు" అని అనెను; తాను ఇతరుల కొఱకు యాచించుటచే. (**వేణ్డి చ్చలత్తినాల్ నీరేఱ్ఱలకెల్లామ్ నిన్దళన్దాన్ మావలియై)** నాకు మూడడుగుల నేల ఇమ్ము – అని యాచించి, చేతిలో దానజలము పడగానే, పెద్దపాదముతో కొలుచుట అనెడి వంచనతో లోకములను అన్నిటిని కొలిచెను. **మావలియై మూవడి మణ్ తారా యెనక్కెన్ఱు వేణ్డి, నీరేఱ్ఱు చ్చలత్తినాల్ ఉలకెల్లామ్ నిన్దళన్దాన్**– అని అన్వయము.

**(ఆరాద పోరిల్ . . .)** దేవతలు, అసురులును సముద్రమును మథింపబోయి, అట్లు చిలుకలేక పోయినపుడు తాను మథించిన వృత్తాంతము చెప్పబడుచున్నది. **(ఆరాద పోరిల్)** నెఱవేర్చుటకు వీలుకాని (మథన) కార్యములో – అని అర్థము. **పోర్** – వ్యాపారము, పని అని అర్థము. మథించుట అనెడి కార్యమును దేవాసురులు నెఱవేర్చలేనపుడు. **ఆరాద** – నెఱవేర్చలేని అని అర్థము. లేక, **ఆరాద** – తృప్తిచెందని అనియు అర్థము. ఆశ్రితులకొఱకు ఎన్నిచేసినను, **"నిన్నడియార్క్కు ఎన్ శెయ్వన్ ఎన్ఱే ఇరుత్తి నీ"** (నీ దాసులకు "ఏమియు చేయలేకపోయితినే!" అని తలతువు.) అనునట్లు తృప్తిపొందనివాడవు అగుటచే, తనకు తృప్తి కలుగని మథించుకార్యములో అనియు అర్థము చెప్పవచ్చును. **(అశురర్కళుమ్ తానుమాయ్)** – దేవతలు, అసురులును అని చెప్పవలసియుండగా, విరోధులగు అసురులనుగూర్చి పల్కి



**పేరామల్ తాఙ్గి క్కడైన్దాన్, తిరుత్తుழாయ్**

మందరపర్వతమును తీసికొని వచ్చి, కవ్వముగా నాటి, నాకమ్ కయిఱు ఆక = వాసుకి అను సర్పమును దారముగా కాగా, పేరామల్ తాఙ్గి = ఆ పర్వతము పైకి, క్రిందకు, ప్రక్కలకును చలింపకుండునట్లు ధరించి, తిరు తుழாయ్ తార్ ఆర్న్ద మార్బన్ కడైన్దాన్ = తులసీమాలను

(కారార్ వరై నట్టు) మన్దరత్తిల్ పడిన్ద మేఘమ్ అలశాతపడి కొడువన్దు నాట్టిన నొయ్ప్ప మిరున్దపడి. (నాకమ్ కయిఱాక) చేతననిఱే, మలైయిలే శుఱ్ఱి క్కడైయానిన్ఱాల్ తనక్కు అతు వ్యసనమాయిరాతే, ఇవన్ కరస్పర్శత్తాలే వన్ద సుఖత్తుక్కు అన్ద వ్యాపారత్తాలే పోక్కువిట్టిలనాకిల్ అవనాలితు ఉణ్ణుఱుక్కవొణ్ణాతపడి యిరుక్కుమిఱే. (పేరామల్ తాఙ్గిక్కడైన్దాన్) కీழுడైయామే, మేల్ కొన్దళియామే, పక్కత్తిల్ శాయామే కడైన్దపడి. (తిరుత్తుழாయ్ త్తారార్న్ద మార్వన్) కడలైక్కడైకిఱపోతు తోళుమ్, తోళ్ మాలైయుమాయ్ నిన్ఱు కడైన్దపడి.

పిమ్మట తనను చెప్పుట కేమి కారణము ? అనినచో, కొంచెము ఆనుకూల్యమునుకల దేవతలను తానుగా అభిమానించుటచే **"తానుమాయ్"** అనబడినది. **(కారార్ వరై నట్టు)** – మేఘము చేరియున్న మందరపర్వతమును కవ్వముగా నాటి అని భావము. పర్వతమును చేరియున్న మేఘము కదలకుండునట్లు తీసికొని వచ్చి నాటిన సామర్థ్యము దీనిచే తెలుపబడినది. **(నాకమ్ కయిఱాక)** – నాక(గ)మనగా పాము. **(వాసుకి)** కమ్ – సుఖము, అకమ్ –దుఃఖము, నాకమ్ – గొప్పసుఖము. సర్పము చేతనమగుటచే పర్వతమునకు చుట్టి చిలికినచో అట్లు చిలుకుట దానికి బాధాకరముగా నుండునని మనకు తోచును. కాని, నిజమునకు పరమపురుషుని హస్తస్పర్శ కలుగుటచే మిక్కిలి సుఖమును అనుభవించి, ఆ సుఖమును వ్యక్తముచేసిన గాని నిలువ లేకపోవుటచే, కవ్వపుదారము చేయుపనిని చేయుటద్వారా వ్యక్తీకరించి, నాగము (వాసుకి తన) మనసు నిలుపుకొన్నది అని భావము.

**(పేరామల్ తాఙ్గి క్కిడన్దాన్)** – క్రింద మునుగకుండు కూర్మమై యుండియు, పైకి పర్వతము ఎగసి పడకుండ పైన ఒక రూపమును దాల్చియు, పర్వతమును అదిమి పట్టుకొనియుండియు, రెండువైపుల రెండు రూపములను దాల్చి, లాఘవముగా చిలుకుట ద్వారా, అటు ఇటు ఊగిసలాడకుండగను ధరించియు, చిలికెను. **(తిరుత్తుழாయ్ త్తారార్న్ద మార్బన్)** – సముద్రమును చిలుకునపుడు, బాహువులలోని మాల, ఆ మాలలోని ఒకరేకుకూడ క్రిందపడకుండునట్లు నిలిచి, అనాయాసముగా చిలికెను. **(తిరుత్తుழாయ్ తారార్న్ద మార్బన్:– కడైకిఱపోదు దేవర్కళ్ "అముదమ్ ఎప్పోదు కిళరప్పోకిఱదు" వెన్ఱు అదిల్ నోక్కాక క్కవిழ్న్దు పార్త్తు క్కొణ్డిరున్దార్ కళేయన్ఱి ఎమ్బెరు – మానదు తోళుమ్ తోళ్మాలైయుమాన దివ్యాలంకారత్తిల్ కణ్వైత్తు సేవిక్కప్పెఱ్ఱిలర్ – ఎన్ద కుఱైతీర, తాన్ అదిక ఈడుపట్టు ప్పేశుకిఱార్ పోలుమ్.–దివ్యార్థ) (తిరుత్తుழாయ్ తారార్న్దమార్వన్** :– పాలసముద్రమును

**త్తారార్న్ద మార్పన్ తడమాల్వరైపోలుమ్,**
**పోరానై పొయ్కైవాయ్ క్కోట్పట్టు నిన్డలఱి,**

అలంకరించుకొనిన వక్షఃస్థలమును కలవాడై, చిలికివాడు, తడమ్ మాల్ వరైపోలుమ్ పోర్ ఆనై = మిక్కిలి పెద్ద పర్వతమువంటి మదగజము (గజేంద్రుడు), పొయ్కై వాయ్ కోళ్ పట్టు నిన్డు అలఱి = జలప్రదేశములో (సరస్సులో) మొసలినోటిలో చిక్కుకొనియుండి, బాధపడి,

(తడమాల్వరై యిత్యాది) ప్రయోజనాన్తరపరర్కార్యమ్ శెయ్తపడి శొల్లిగ్గ్రు క్కీళ్, అనన్య ప్రయోజననాన శ్రీగజేన్ద్రాళ్వాన్ ముతలైయిమ్ కైయిలే యకప్పడ, అవన్ అకప్పట్టమడువిలే అరై కులైయ త్తలై కులైయ వన్దు విట్టున్దు అవన్విరోధియై ప్పోక్కి అవనభిమతమ్ శెయ్తుకొడుత్తపడి శొల్లుకిఱతు మేల్. (తడమాల్వరైపోలుమ్) తడమెన్డుమ్, మాలెన్డుమ్ శొల్లుకైయాలే-పరుత్తు ఉయర్న్ద మలైపోలే యిరుక్కిఅవన్, ఇప్పెరుమై శొల్లుకిఱతిఙ్గు ఎన్? ఎన్నిల్, పెరియతు నోవుపట్టా లాగ్గ్రమాట్టాతెన్గైక్కాక. (పోరానై)యుద్ధోన్ముఖనాయ్ త్తిరికిఱానన్జిఱే; శెరుక్కాలే మలైకళోడే పొరుతు తిరికిఱపడి. (పొయ్కై వాయ్)

చిలుకునవుడు దేవతలు "అమృతము ఎపుడు పుట్టునా" అను విషయమునందే దృష్టిని కల్గియుండి చూచుచుండిరే తప్ప, భగవానుని బాహువులయందు, ఆ బాహువులలోని తులసీమాలయందు, దివ్యాలంకారమునందు దృష్టిని పెట్టి సేవింపలేదను కొఱత తీరునట్లు, తాను అందు అభినివేశమును పొంది కట్టువిచ్చి పల్కుచున్నది కాబోలు. – దివ్యార్థ.)
**(తడమాల్ వరై పోలుమ్)** – అన్యఫలములను కోఱువారగు దేవతల కార్యమును పూర్తిచేయుట పూర్వము తెలుపబడినది. తననే ఫలముగా గ్రహించిన శ్రీగజేంద్రుడు మొసలినోటిలో చిక్కుకొనగా, అతడు చిక్కుకొనిన మడుగుతీరమునకు కటివస్త్రము జారగా, జుట్టుముడి వీడగా **(అరై కులైయ త్తలై కులైయ)**, వేగముగావచ్చి, అతని శత్రువగు మొసలిని వధించి, అతనికి ప్రియమైన కైంకర్యమును స్వీకరించి, తననే ఫలముగా అనుగ్రహించిన విధము ఇకపై తెలుపబడుచున్నది.
**(తడమాల్ వరై పోలుమ్ పోరానై)** – **" తడమ్, మాల్ "** అనుటచే – మిక్కిలి విస్తరించిన, ఉన్నతమైన కొండవలె ఉన్న ఏనుగు– అని భావము. ఈ శరీరముయొక్క గొప్పతనము ఇచట ఎందులకు చెప్పబడినది?అనగా, పెద్ద శరీరరమునుకల ఏనుగుయొక్క బాధకూడ దాని శరీరమునకు తగినట్లు పెద్దదిగానే ఉండునని తెలుపుటకై చెప్పబడినది.
**(పోరానై)** పోరాడు ఏనుగు అని అర్థము. సాత్త్వికుడగు ఈ గజేంద్రుడు ఇతరులతో బలముగా పోరాడుచు తిరుగుచున్నాడను అర్థమును చెప్పుటకు వీలులేదు. జాత్యుచితముగా, మదగర్వముచే పర్వతములను తిర్యక్ ప్రహారములను చేయుచు సంచరించుట ఇచట తెలుపబడినది.
**(పొయ్కై వాయ్)** నీటికి బయట అయినచో శత్రువులను సంహరింపగల్గిన బలమును కల్గినది కదా ఈ గజము. తన చోటుకాని జలప్రదేశమగుట చేతను, శత్రువగు మొసలికి స్వస్థానమగుట



**నీరార్ మలర్క్కమలమ్ కొణ్డోర్ నెడుఙ్గైయాల్,**
**నారాయణా వో మణివణ్ణా నాకణైయాయ్,**

ఓర్ నెడు కైయాల్ నీర్ ఆర్ కమలమ్ మలర్ కొణ్డు = పొడుగైన ఒక తొండముతో నిండునీటిలో అపుడే వికసించిన తామరపూలను ఎత్తి పట్టుకొని , ఓ నారాయణా ! మణివణ్ణా ! నాక అణైయాయ్ = నారాయణా ! నీలమణివర్ణా ! నాగశయనా !, వారాయ్ ఎన్ ఆర్ ఇడర్

వెళినిలమాకిల్ ఎతిరికళై త్తుణిక్కుమితే, తన్నిలమల్లాత నీర్నిలత్తిలే. (కోట్పట్టు) శత్రువాన ముతలైయిన్ కైయిలే అకప్పట్టు. (నిన్డు) అవన్ నీరుక్కు ఇఴుక్క, ఇవన్ కరైక్కిఴుక్క, శిలనాళెల్లామ్ శెన్డు ముతలైయిన్ వ్యాపారమేయాయ్, తన్ వ్యాపార మగ్గ్రు నిన్డపడి. (నీరార్ మలర్ క్కమలమ్ కొణ్డోర్ నెడుఙ్గైయాల్) శెవ్వి మాఱాత తామరైప్పూవై ప్పిడిత్త కై యత్తనైయు మెుళ్గ్రియు, నీరిలే యుఴున్ద్తినానాయిగ్గ్రు. (నారాయణా! వో!) సర్వస్వామియానవనే ! ఎన్డపడి. (మణివణ్ణా) విడాయ్త్తార్క్కు త్తణ్ణీర్ వార్క్కుమవనన్డో నీ! ఇవ్వడివై ఆశైప్పట్టార్క్కు క్కాట్టుమవనన్డో నీ! యెన్గై. (నాకణైయాయ్) ఉన్నుడమ్బై

చేతను బాధపడినది. **(కోట్పట్టు)** శత్రువగు మొసలికి చిక్కుపడి. **(నిన్డు)** ఆ మొసలి నీటిలోనికి లాగగా ఈ గజేంద్రుడు తీరమునకు లాగగా. – ఇట్లు చాల కాలము గడిచిన పిదప మొసలి శక్తి పెరిగి, తన శక్తి క్షీణించి, అలసి, చేష్టలుడిగినవాడైయున్న స్థితి తెలుపబడినది. **(నీరార్ మలర్ క్కమలమ్ కొణ్డోర్ నెడుఙ్గైయాల్)** వికాసము మాఱని తామరపూవును భగవానునికొఱకై పట్టుకొనిన తొండముతప్ప మిగిలినదంతయు నీటిలో మునిగినది. **(నీరార్ మలర్ క్కమలమ్)** – కోసి చాలసేపు అయిన పిమ్మటకూడ భగవానుని కొఱకు కోసినది అగుటచే , ఆ పద్మము నీటిలో ఉన్నట్లే వికసించి వెల్గుచున్నది. **(నారాయణా)** – నరసమూహములగు నారములకు అన్నిటికిని ప్రాప్యప్రాపకమైనవాడా! (సర్వస్వామీ ! ) నరసమూహములో నేను చేరినవాడను కానా ! నన్ను రక్షింపకపోయినచో, నీ నారాయణత్వము సిద్ధించుదారి కలదా ! మొసలిని సంహరించి, ప్రాణాపాయమును పోగొట్టవలెనని కదా నీవు కోరునది ? అనినచో, **(మణివణ్ణా)** నీ నీలమణివంటి రూపమును దర్శింపవలెనని కదా నేను కోరినది. తాపత్రయములతో దాహమును పొంది, తపించువారికి చల్లని నీరువంటి నీ దివ్యరూపమును దానము చేయువాడవుకదా నీవు ! **"భక్తానామ్"** (జితంతే) (భక్తులకొఱకే నీ స్వరూపాదులున్నవి) అనునట్లు నీ దేహమును దర్శింపవలెనని ఆశపడినవారికి నిన్ను చూపువాడవు కదా నీవు ! అట్లుండగా, నాకు మాత్రము చూపకుండ దానిని దాచతగునా ? **(నారాయణా ఓ :– పెరియాళ్వార్ తిరుమొళ్ళియిల్ "పతక ముదలై వాయ్ప్పట్ట కళిఱు కదఱి క్కైకూప్పి "ఎన్ కణ్ణా కణ్ణా వెన్న" ఎన్డ విడత్తు వ్యాఖ్యానమరుళిచ్చెయ్కిన్డ మణవాళమామునికళ్ "నారాయణా ఓ మణివణ్ణా నాకణైయాయ్ వారాయ్" ఎన్డు కూప్పిట్టానాక అరుళిచ్చెయ్దార్ తిరుమఙ్గైయాళ్వార్. ఇవర్ "ఎన్ కణ్ణా! కణ్ణా!" "ఎన్డు కూప్పిట్టానాక అరుళిచ్చెయ్దార్.**

**వారా యెన్నారిడరై నీక్కాయ్, ఎన వెకుణ్డు**

నీక్కాయ్ ఎన = వేంచేయవలెను, నా గొప్ప దుఃఖమును పోగొట్టవలెను – అని పిలువగా, వెకుణ్డు = (మొసలిపై ) కోపించి, తీరాద శీగ్ర్ఱత్తాల్ = అణగని (అంతులేని) కోపముతో,

యాశైప్పట్టార్క్కు క్కొడుక్కుమవనల్లైయో నీ! యెన్గాన్. (వారాయ్) ఎన్నుడైయ ఆర్ త్తి వరుమ్బడి అఴ్గకియ వడివై పారిత్తుక్కొణ్డు ఇజ్జనే యెఴున్దరుళవేణుమ్, (ఎన్ ఆరిడరై నీక్కాయ్) ఇప్పోతు ఇవన్ ఆరిడరెన్గిఱతు - దుఃఖనివృత్తియై ప్పణ్ణాయ్ ఎన్గిఱా నల్లన్; ఇప్పూ శెవ్వి మాఱుబ్గాట్టిల్ తిరువడికళిలే యిడువిత్తుక్కొళ్ళాయెన్గపడి. (ఎన) ఎన్గు ఇప్రకారత్తాలే యివన్ శొల్ల. (ఎన వెకుణ్డు) సర్వేశ్వరన్. ఇవ్వార్తై శెవిప్పట్టవాఱే

**“మూలేతి ముక్తిపద మాలపతి ద్విపేంద్రే “ఎన్గు కొణ్డు” “మూలమే” ఎన్గు కూప్పిట్టానాకైయాలే అదుక్కు పర్యాయశబ్దఙ్గళై యిట్టు ఆఴ్వార్కళ్ అరుళిచ్చెయ్దార్ కళాకైయాల్ ఎల్లామ్ తన్నిల్ శేర క్కుఱైయిల్లై.” ఎన్గరుళిచ్చెయ్దుళ్ళ శ్రీసూక్తికళ్ ఇఙ్గే అనుసంధేయమ్.** పెరియాఴ్వార్ తిరుమొఴిలో **“పతక ముదలై వాయ్ప్పట్ట కళిఱు కదఱి కైకూప్పి ఎన్ కణ్ణా కణ్ణా వెన్న”** అను చోట వ్యాఖ్యానమును అనుగ్రహించు మణవాళ మహామునులు **“నారాయణా ఓ మణివణ్ణా! నాకణైయాయ్ ! వారాయ్”** అని పిలచినట్లు అనుగ్రహించిరి తిరుమఙ్గైయాఴ్వార్. వీరు “ఎన్ కణ్ణా! కణ్ణా” అని పిలిచినట్లు పల్కిరి. **“మూలేతి ముక్తిపద మాలపతి దిపేంద్రే”** అనుచు “మూలమా!” అని పిలిచినట్లు పౌరాణికులు పల్కిరి. ఇవి అన్నియు అర్థమున పొసగుట ఎట్లు? అనినచో, మూలమనుచోట గజేంద్రుడు అసాధారణ విగ్రహవిశిష్టుడగు ఆకారమును తలచి, పిలచినవాడగుటచే దానికి పర్యాయపదములను ఋషులు, ఆఴ్వార్లు ప్రయోగించి అనుగ్రహించిరి. కావున అర్థము పొసగుటలో లోపము లేదు – అనుచు అనుగ్రహించిన శ్రీసూక్తిని ఇచట స్మరింపనగును. – దివ్యార్థ)

**(నాకణైయాయ్)** – నీ శరీరమును సర్వకాలము అనుభవింపలెనని ఆశపడియుండు ఆదిశేషునకు నీ దేహమును అనుగ్రహించినవాడవు కదా నీవు ! **(వారాయ్ )** – నా దుఃఖమంతయు తీరునట్లు అందమైన నీ రూపమునుదాల్చి ఇచటకు వేంచేయవలెను. **(ఎన్ ఆరిడరై నీక్కాయ్)** – ఇపుడితడు **“అరిడర్”** (గొప్పక్లేశము) అనునది మొసలివలన కల్గిన బాధను పోగొట్టవలెనని కాదు. ఈ పూవు వాడుటకుముందే శ్రీపాదములలో సమర్పింపవలెననుటకొఱకే. ప్రాప్యశేషి పాదములందు కైంకర్యవిచ్ఛేదమే ఇచట గొప్ప దుఃఖముగా చెప్పబడినది. **“నాహం కలేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన, కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ”** (మధుసూదనా ! నేను ఈ శరీరరక్షణకొఱకుగా ప్రార్థించుటలేదు. నా చేతిలోనున్న తామరపూవు వసివాడకముందే నీ పాదములందు సమర్పింపవలెనని కోరుచున్నాను) అనునదికదా గజేంద్రుని వచనము. **(ఎన)** – అని ఈ రీతిలో ఇతడు (గజేంద్రుడు) పలుకగా.

**(ఎన వెకుణ్డు)** – సర్వేశ్వరుడు ఈ వార్త చెవి సోకగానే, మొసలిపై మిక్కిలి కోపమును



**తీరాత శీగ్ర్ఱతాల్ శెన్టిరణ్టు కూఱాక,**
**ఈరావతనై యిడర్ కడిన్దా నెమ్బెరుమాన్,**

శెన్టు = సరస్సు తీరమునకు వెడలి, ఇరణ్డు కూఱు ఆక = రెండు ముక్కలు అగునట్లు, ఈరా = ఖండించి, అదనై ఇడర్ కడిన్దాన్ ఎమ్బెరుమాన్ = ఆ గజేంద్రుని దుఃఖమును పోగొట్టినస్వామి,

కోపిత్తరుళినాన్. (తీరాత శీగ్ర్ఱత్తాల్) ముతలైయిన్కైయిలే యకప్పడక్కొడుత్తు, “అకప్పట్టవన్ నోవుపట్టతుక్కు ప్పిన్బు అవనై రక్షిత్తు ఎన్శెయ్తోమానోమ్” ఎన్గు ఇన్నుమ్ తీరాతే కిడక్కిఱతిఱే. (శీగ్ర్ఱత్తాల్ శెన్టు) వాహనత్తిన్మేలన్గుపోలే కాణుమ్ శెన్గతు, కోపత్తిన్ మేలే కాణుమ్; కోపమ్ వఴికాట్ట చ్చెన్గానిత్తనై. తానఱిన్దు శెన్గానన్గు కాణుమ్. (ఇరణ్ణు కూఱాక ఈరా) అనైక్కుమ్ నోవు వారామల్, ముతలైయుమ్ ఇరుపిళవామ్బడి తిరువాఴియాలే పిళన్దరుళినపడి. (అతనై యిడర్కడిన్దాన్) అప్పడి నోవుపట్టిరుక్కిఱ శ్రీగజేన్ద్రాఴ్వానై అమ్ముతలై పిడిత్త శ్రీపాదత్తై త్తన్ తిరుక్కైకళాలే యొత్తువతు, తిరుప్పవళత్తాలే యూతువతు,

పొందెను. **(ఎన)** – **“భగవత స్త్వరాయై నమః”** (రం.స్త–ఉ) అని భట్టరు అనుసంధించిన భగవానుని గజేంద్రరక్షణ త్వరాతిశయమిచట తెలుపబడినది. **(వెకుణ్డు)** **“కోప మాహారయ త్తీవ్రమ్”** (రా.ఆర–24–34) (మిక్కిలి కోపమును అరోపించుకొనెను) అనునట్లు తన విషయమున జరిగిన అపచారమైనచో కోపము ఆరోపితమగును. **“కోపస్య వశ మేయివాన్”** (రా.యు.59–136) (కోపమునకు వశుడయ్యెను) అనునట్లు భాగవతవిషయమైన అపచారమైనచో, కోపమే స్వరూపమనునట్లుండును. ఇచట భాగవతోత్తముడగు గజేంద్రుని విషయమున అపచారమగుటచే కోపమునకు వశుడయ్యెను.

**(తీరాత శీగ్ర్ఱత్తాల్)** – గజేంద్రుని రక్షించిన పిమ్మటకూడ తీరని కోపముచే అని అర్థము. మొసలినోటిలో పట్టుబడి, చిక్కుబడినవాడు బాధపడిన పిమ్మట అతనిని నేను రక్షింపనిచో ఏమి ప్రయోజనము ? అని ఇంకను కోపము తీరకనేయున్నది. దుర్యోధనాదులను నిరసించుట మొదలగు కార్యములను అన్నిటిని చేసికూడ, **“నాతిస్వస్థమనా యయౌ”** (మనస్సులోని కొఱత తీరని వాడుగానే వెడలెను) అనునట్లు **(గోవిందేతి యదా క్రందత్)** (ద్రౌపది గోవిందా ! అని పిలుచుటను వింటిని కదా !) అను కొఱతలోనే పరమపదమునకు శ్రీకృష్ణుడు చేరెను.

**(శీగ్ర్ఱత్తాల్ శెన్టు)** గరుడవాహనముపై ప్రయాణము చేయలేదు కాబోలు ! కోపమను వాహనముపై ప్రయాణము చేసినట్లున్నది. కోపమునకు వశమైనవాడగుటచే కోపము దారిచూపగా వెడలెను అంతియే. తాను తెలిసికొనిపోలేదు. **(ఇరణ్డు కూఱాక ఈరా)** – మొసలిని పట్టిలాగినచో ఏనుగునకు బాధకలుగును కదా ! అందుచే మొసలిని రెండు ఖండములు అగునట్లు సుదర్శనముతో ఖండించి మొసలిపట్టును తానే విడివడునట్లు చేసెను. **(అదనై ఇడర్ కడిన్దాన్ )** – అట్లు బాధపడిన గజేంద్రుని, ఈ మొసలి పట్టుకొనిన పాదమును తన చేతులతో ఒత్తుట, నోటితో ఊదుట, మెత్తని వస్త్రము మడతతో మెల్లగా ఒత్తుట –

**పేరాయిరముడైయాన్ పేయ్ ప్పెణ్డీర్ నుమ్మకళై,**
**త్తీరా నోయ్ శెయ్తానెన వురైత్తాళ్, శిక్కెన మగ్ర్**

పేర్ ఆయిరమ్ ఉడైయాన్ = (ఇట్టి అంతులేని కార్యములకు వాచకములైన ) సహస్ర నామములను కలవాడు, (ఆ స్వామియే), పేయ్ పెణ్డీర్ = జ్ఞానశూన్యులారా ! నుమ్ మకళై = మీ కుమార్తెను, తీరా నోయ్ శెయ్దాన్ ఎన ఉరైత్తాళ్ = ఇట్టి తీరని బాధను కల్గించెను

తిరుప్పరివట్టత్తలైయాలే యొత్తువతానాన్. (ఎమ్బెరుమాన్) శ్రీగజేన్ద్రాఴ్వానుక్కన్డిక్కే, ఇవళ్ తాన్ పెగ్ర్గ్రాళామ్బడి తోగ్ర్ఱ ఇక్కట్టువిచ్చి "ఎన్నాయనే"! ఎన్గిఱాళ్. (పేరాయిరముడైయాన్) ఇప్పడి ఆశ్రితరక్షణత్తుక్కాక చ్చెయ్త అపదానఙ్గళుక్కు వాచకమాన తిరునామఙ్గళ్ ఎణ్ణిఱన్దవగ్ర్గై యుడైయవన్. ఆశ్రితర్ ఇవ్విషయత్తి లిఴ్గిక్కు ప్పల తుఱై యుణ్డానాప్పోలే అవర్కళ్ అనుసన్ధిక్కైక్కుమ్ పల తిరునామఙ్గళై యుడైయవన్.

(పేయ్ప్పెణ్డీర్) సర్వేశ్వరనడియాక వన్దతు ఇన్నోయెన్హాలుమ్ దేవతాన్తరస్పర్శ ముణ్డెన్ఱు అతిశఙ్కై పణ్ణుకిఱ అఱివుకేడికళితే నీఙ్గళ్! (నుమ్మకళై) ఉఙ్గళ్ వయిగ్ర్గిలే పిఱన్దవళై. ఉఙ్గళ్ వయిగ్ర్గిల్ పిఱన్దవళ్ పరదేవతైక్కు నోవుపడు మిత్తనైయల్లతు అవరదేవతైక్కు నోవుపడుమో ? (తీరా నోయ్ శెయ్తానెన వురైత్తాళ్) ఇన్నోయ్ తీరుమ్బడి

మొదలగు పనులను చేసి, మొసలివలన అనుభవింపబడిన దుఃఖమును పోగొట్టెను. కైంకర్య విచ్ఛేదమే గజేంద్రుని ఉద్దేశ్యమున దుఃఖము. భగవానుని ఉద్దేశ్యమున గజేంద్రుడు మొసలివలన పొందిన బాధయే దుఃఖము. **(ఎమ్బెరుమాన్)** – గజేంద్రుడు పొందిన ఫలమును తానే అనుభవించినట్లుగా "నా స్వామీ ! " అని కట్టువిచ్చి పల్కుచున్నది.

**(పేరాయిరముడైయాన్)** ఇట్లు దాసులను (ఆశ్రితులను) రక్షించుట కొఱకు చేసిన కార్యములను తెలుపు అంతులేని తిరునామములను కలవాడు. **"సహస్రశీర్షా"** అనునపుడువలె ఇచటి సహస్రశబ్దము కేవలము వేయి అని కాక, లెక్కకు మించినవనుటను తెలుపును. **"పేరు మోరాయిరమ్ పిఱపల ఉడైయ ఎమ్బెరుమాన్"** (తిరువాయ్ 1-3-4) (ఇంకను పలు పేర్లను కలిగిన స్వామి.) అనిరి కదా నమ్మాళ్వార్లు. దాసులు ఈ విషయములో అనుభవింప ప్రవేశించుటకు లెక్కలేనన్ని గుణములు, రూపములు, విభూతులు మొదలగు పలు రేవులు (ప్రవేశద్వారములు) ఉన్నట్లే, వారు అనుసంధించుటకును పలు తిరునామములను కలవాడు. **(పేయ్ ప్పెణ్డీర్)** – "సర్వేశ్వరుని పొందకపోవుటవలన ఈ బాధ కల్గినది" అని నేను చెప్పినను, "దేవతాంతరములవలన వచ్చియుండునా !" అను భ్రాంతిని పొందు అజ్ఞులు కదా మీరు ప్రేమయొక్క ఆధిక్యముచేతనే ఈ అజ్ఞానము. **(నుమ్మకళై)** – మీ కడుపున పుట్టిన దానిని అని అర్థము. పరమశ్రీవైష్ణవులగు మీకడుపున పుట్టిన ఈమె పరదేవతనుగూర్చి బాధపడును తప్ప అవర (క్షుద్ర) దేవతకొఱకు బాధపడునా ! **(తీరా నోయ్ శెయ్దానెన ఉరైత్తాళ్)** ఈ బాధ ఎట్లు తీరును ? అని ప్రశ్నించువారికి, **"తీరాద నోయ్"** (తీరని బాధ) అనుచున్నది.



**గ్రారాను మల్లామై కేట్టెఙ్గళమ్మనైయుమ్,**
**పోరార్ వేఱ్కణ్ణీ రవనాకిఱ్పూన్దుఴాయ్,**

అని (కట్టువిచ్చి) చెప్పినది, ఎఙ్గళ్ అమ్మనైయుమ్ = (ఆ పిమ్మట) నా తల్లియును, మగ్ర్గు ఆరానుమ్ అల్లామై శిక్కెన కేట్టు = వేఱు ఏ క్షుద్రదైవమును ఈ బాధకు కారణము కాదు అనుటను స్థిరముగా అడిగి తెలిసికొని, పోర్ ఆర్ వేల్ కణ్ణీర్ = యుద్ధములో పొందికగానున్న వేలాయుధమువలె నిశితమైన కన్నులను కల సఖులారా ! , అవన్ ఆకిల్ = (ఈ బాధను

ఎన్నెన్ఱు విచారిక్కిఱవర్కళుక్కితే "తీరా నోయ్ శెయ్తాన్" ఎన్గిఱతు. "ఇవళుక్కు సర్వేశ్వరనడియాక వన్ద నోయాకిఱతు తీరి ఞ్చెయ్వతెన్?" ఎన్ఱు అవర్కళ్ భయప్పడుకిఱార్కళాక క్కరుతి "తీరా నోయ్" ఎన్గిఱాళ్ కాణుమ్. ఇప్పోతు, తీరా నోయెన్గిఱతు - భక్తియైయితే; యావదాత్మభావియాన నోయితే; ప్రాప్తిదశైయిలు మనువర్త్తిక్కుమతితే. (ఎన వురైత్తాళ్) తెన్ఱలుమ్, శిఱుతుళియుమ్ పట్టాప్పోలే యిరుక్కిఱతు కాణుమ్ తనక్కినితానపడి. (ఉరైత్తాళ్) ఎన్ఱు మిన్నోయ్ కొణ్డాలాకాతో ? ఇవళ్ పుకున్దిప్పడి పరిహారమ్ శొల్లప్పెఱిల్.

కట్టువిచ్చి అప్పడిశొన్నాళాకిల్ ఉఙ్గళ్ తాయ్మార్ శెయ్తతెన్? ఎన్న; శొల్లుకిఱాళ్ మేల్. (శిక్కెన మగ్ర్గ్రారానుమల్లామై కేట్టెఙ్గళమ్మనైయుమ్) "ఇన్నోవు పేరాయిరముడైయా నడియాక వన్దతు" ఎన్ఱు శొన్నాళ్ కట్టువిచ్చి ; ఎన్నై ప్పెగ్ర్ఱ తాయారుమ్ "దేవతాన్తరస్పర్శ మిల్లైయితే" ఎన్ఱు పలకాలుమ్ కేట్టు. (పోరార్ వేల్కణ్ణీర్ అవనాకిల్ పూన్దుఴాయ్

**"ఉగ్ర్ఱ నల్నోయ్"** (తిరువాయ్ -4-6-1) (పొందిన తీయని బాధ) అనునట్లు భగవద్భక్తి అనెడి ఈ బాధ మిక్కిలి ఉద్దేశ్యమే అగుటచే సర్వేశ్వరునివలనకల్గిన ఈ బాధ తీరిపోయినచో ఏమి చేయుట?" అని అడుగుచున్నదని తలచి, కట్టువిచ్చి **"తీరాద నోయ్"** అని అన్నది. ఆత్మ ఉన్నంతవరకు (నిత్యముగా) పరమపదములోకూడ అనువర్తించును కావున తీరనిది అన్నది. ఇపుడు విశ్లేషములో బాధను కల్గించుటచే **"నోయ్"** అని అన్నది.

**(ఎన వురైత్తాళ్)** – మలయమారుతము, దానితోకలసి వీచు నీటితుంపురులు సోకినట్లు నాయకియగు తనకు ఈ కట్టువిచ్చియొక్క మాట తీయనిదియై యుండుటచే దానిని అనువదించుచున్నది. **(ఉరైత్తాళ్)** ఆమె పల్కినతీరు ఏమి ఆశ్చర్యకరము ! ఈమె మాటను వినుట కొఱకు అయినను, తాను ఎల్లప్పుడు ఈ బాధను పొందవచ్చును అని ఇచటి హార్దభావము.

కట్టువిచ్చి ఈ రీతిగా చెప్పినచో మీ తల్లులు ఏమనిరి ? అను ప్రశ్నకు పిమ్మట బదులివ్వబడుచున్నది. **(శిక్కెన మగ్ర్గ్రారాను మల్లామై కేట్టెఙ్గళెమ్మనైయుమ్)** – "ఈ బాధ సహస్రనామములను కల్గినవానివలన వచ్చినది" అని కట్టువిచ్చి పల్కినది. నన్ను కన్న తల్లియు "వేఱొక దైవముయొక్క స్పర్శలేదు కదా ! " అని ఒకసారికి పలుమార్లు అడిగి, నిశ్చయించుకొని

**తారా తొళ్ళియుమే తన్నడిచ్చియల్లళే,మగ్ఱ్ ఱ్ఱారానుమల్లనే యెన్నొళ్ళిన్దాళ్, నానవనై**

కల్గించినవాడు) అతడైనచో , పూమ్ తుళ్ళాయ్ తారాదు ఒళ్ళియుమే = ఈమె కోఱిన తులసీమాలప్రసాదమును అనుగ్రహింపకుండునా , తన్ అడిచ్చి అల్లళే = ఈమె అతనికి దాసురాలేకదా ! , మగ్ఱ్ఱు ఆరానుమ్ అల్లళే ఎన్ను ఒళ్ళిన్దాళ్ = వేఱెవ్వరును ఈ బాధను

తారాతొళ్ళియుమే) పెణ్పిళ్ళైకళ్ పతఱుకిఱ పతగ్ఱ్ఱత్తై క్కణ్డు, నోవుక్కు నిదానమ్ సర్వేశ్వరనానపిన్బు నీఙ్గళిప్పడి ప్పతఱవేణుమో? "పువనియెల్లామ్ నీరేగ్ఱ్ఱళన్ద నెడియపిరా నరుళావిడుమే" ఎన్నుమాపోలే, అవనాకైయుమ్, నమ్ముడైయ అపేక్షితమ్ శెయ్యా నెన్గైయుమ్, "అగ్నినా సిఞ్చేత్" పోలే అసఙ్గతమన్రో ? "రామో ద్వి ర్నాభిభాషతే" ఇతివత్. (తన్నడిచ్చి యల్లళే) అపేక్షితమానవై తానాక చ్చెయ్యాతొళ్ళిన్దాలుమ్, కాలైక్కట్టియాకిలుమ్ శెయ్విత్తు క్కొళ్ళ ప్రాప్తియిల్లైయో? వెన్ను ఇప్పడి తోళ్ళిమార్క్కు చ్చొల్లి. (మగ్ఱ్ఱారాను మల్లనే యెన్ను) "దేవతాన్తరమాన నోయ్ తీణ్డిగ్ఱ్రిల్లైయిఱే" యెన్ను తానే తెళిన్ద

**(పోరార్ వేల్ కణ్ణీర్ అవనాకిల్ పూన్దుళ్ళాయ్ తారాతొళ్ళియుమే)** – యుద్ధము చేయు వేలాయుధమువంటి కన్నులను కలదానా ! ఇది ఇట్లు సంబోధించుట వారి (తల్లుల) కలవరపాటును తెలుపుచున్నది. ఇచట ఈ విధముగా పిలుచుటచే, "ఎందులకు ఈ కలవరపాటు ? ' అని వారిని ప్రశ్నించెని భావము. **(అవనాకిల్ పూన్దుళ్ళాయ్ తారాతొళ్ళియుమే) "పువనియెల్లామ్ నీరేగ్ఱ్ఱళన్ద నెడియ పిరాన్ అరుళా విడుమే"** (తిరువిరు – 69) (భూమిని అంతటిని దానజలముతో పరిగ్రహించి కొలచిన సర్వాధికుడు రక్షింపక విడచునా ?) అనురీతిలో మనము ఆశ్రయించినది అతడైయుండుట, మన మనోరథమును అతడు పూర్తిచేయడు అని పల్కుటయు **"అగ్నినా సించేత్"** (నిప్పుతో తడుపవలెను) అనునట్లు ముందు వెనుకలకు పరస్పర విరుద్ధమైనది కదా! **"రామో ద్వి ర్నాభిభాషతే"** (రా.అయో – 18–30) శ్రీరాముడు రెండు విధములుగా పలుకడు) అని అతడే పల్కుటచే, **"ఏత ద్వ్రతం మమ"** (రా.యు) (శరణాగతరక్షణము నా వ్రతము) అనిన అతడు ఈమె కోఱు తులసిని అనుగ్రహింపకమానడు. మీరు కలవరపడవలదు – అని అర్థము. **(తన్నడిచ్చి యల్లళే)** – అట్లే అతడు ఈమె కోఱినదానిని తానుగా ఇవ్వకున్నను, అతని పాదమును ఆశ్రయించి, అవసరమైన దానిని పొందతగిన సంబంధములేదా ! అందుచే ఈమె కోఱిక నెఱవేఱుట నిశ్చయము – అని ఈ విధముగా సఖులతో పల్కి.

**(మగ్ఱ్ఱారాను మల్లనే ఎన్ను) – "వానిడై వాళ్ళు మవ్వానవర్క్కు మఱైయవర్ వేళ్వియిల్ వకుత్త అవి కానిడై త్తిరివదోర్ నరి పుకున్దు కడప్పదుమ్ మోప్పదుమ్ శెయ్వదొప్ప"** (నాయ్చ్చి –తిరు 1–5) (స్వర్గలోకములో నివసించు విలక్షణజన్మలను కల దేవతల కొఱకు ఇచటనున్న బ్రాహ్మణులు తమ యజ్ఞములలో సమర్పించిన హవిస్సును అరణ్యములో తిరుగు ఒక నక్క



**క్కారార్ తిరుమేని కణ్డతువే కారణమా, ప్పేరా ప్పితగ్ఱ్ఱా త్తిరితరువన్, పిన్నైయు**

కల్గించలేదుకదా! అని పల్కి, విరమించినది (తల్లి), నాన్ = నేను, అవనై = అతని, కార్ ఆర్ తిరుమేని కణ్డదువే కారణమ్ ఆ = నల్లని తిరుమేనిని సేవించుటయే కారణముగా, పేరాపిదగ్ఱ్ఱా పిన్నైయుమ్ తిరు తరువన్ = (స్త్రీ పురుషునిగా) రూపు మాఱి, వదఱుచు, దానికి పిమ్మట

నిర్భరైయానాళ్. "ఎమ్బెరుమానోడే సమ్బన్ధముడైయ వివళుక్కు నాన్ కరైయవేణుమో?" ఎన్ను తళప్పమగ్ఱ్ఱాళెన్ను. అవళ్ శెయ్తతెన్? ఎన్నిల్; (ఒళ్ళిన్దాళ్)ఒళ్ళిన్దాళ్.

(నాన్) ఎన్ పన్దాడలిలే అవనై క్కైయుమ్ మడలుమాక క్కాణక్కడవతాక ఉద్యోగిత్తు ప్పుఱప్పట్టు అవన్కుడక్కూత్తిలే తోగ్ఱ్ఱ నాన్. (అవనై) తన్ వడివళ్ళకై క్కాట్టి యెన్నై యనన్యార్హై యాక్కినవనై. (కారార్ తిరుమేని కణ్డతువే కారణమా) అవనుడైయ శ్రమహరమాన తిరుమేనియై క్కణ్డతువే హేతువాక. ఋషికళైయుమ్, ఆళ్వార్కళైయుమ్బోలే యాయిగ్ఱ్ఱు తిరుత్తాయారు మివళుమ్. ఇవన్స్వరూపగుణ జ్ఞానమాయిగ్ఱ్ఱు ఋషికళుక్కు; దివ్యవిగ్రహత్తిలుమ్, విగ్రహగుణత్తిలుమాయిగ్ఱ్ఱ ం ఆళ్వార్కళుక్కు. గుణజ్ఞాన త్తిలకప్పట్టార్క్కు ఆగ్ఱ్ఱలామిఱే; వడివళ్ళకిలకప్పట్టార్క్కు ఆగ్ఱ్ఱవొణ్ణాతిఱే. అప్పడి గుణజ్ఞానముడైయవళాయిగ్ఱ్ఱు తిరుత్తాయార్; ఆకైయాల్ ధరిత్తిరున్దాళ్. అవ్వడివళ్ళకిలే యకప్పట్టవర్కళుక్కు ప్పెగ్ఱ్ఱల్లతు ధరిక్కవొణ్ణాతిఱే. (పేరా)

ప్రవేశించి దానిని తమ స్వాధీనము చేసికొనుట, వాసన చూచుటవలె.) అను రీతిలో వేఱొకదైవమనెడి శునకము ఈమెను స్పృశింపలేదుకదా! అని తానే గ్రహించి, మనోభారము తగ్గినది అయ్యెను. "భగవానునితో సంబంధమునుకల ఈమె కొఱకు నేను బాధపడవలసిన అవసరము లేదు" అని మనస్సున వ్యాకులపడుట మానినది. అని పల్కి ఆమె చేసినది ఏమి అనినచో, **(ఒళ్ళిన్దాళ్)** – విచారము వీడినది. విరమించినది.

**(నాన్ )** – నా బంతి ఆటలో అతనినిగూర్చి మడల్ ఎత్తవలెనని ప్రయత్నించి, బయలుదేరి, అతని కుంభనృత్యములో పరాజితనై, మడల్ ఎత్తగోఱిన నేను, **(అవనై)** – తన రూపసౌందర్యమును చూపి నన్ను అనన్యార్హనుగా చేసినవానిని.

**(కారార్ తిరుమేని కణ్డదువే కారణమా)** దర్శించువారిని చల్లబఱచు తిరుమేనిని దర్శించుటయే కారణముగా అని అర్థము. ఋషులవలె స్వరూపగుణానుభవములో అభినివేశమును కల్గినది తల్లి. ఆళ్వార్లవలె దివ్యమంగళవిగ్రహమందు, ఆ విగ్రహగుణములందు అభినివేశమును పొందినది ఈ నాయకి. స్వరూపగుణ జ్ఞానములో అభినివేశమును పొందినవారికి విశ్లేషము కల్గినను, గుణజ్ఞానమువలన ధరింపవీలగును. కాని విగ్రహసౌందర్యమందు చిక్కుకొని, అది లభింపనివారిని ఓదార్చ గల్గినది ఏదియు లేదు. ఋషులవలె గుణజ్ఞానమును కల్గినది అగుటచే తల్లి ధరింపగల్గినది. ఆ రూపసౌందర్యములో చిక్కుపడిన ఈమెకు అది పొందినగాని

**మీరా ప్పుకుతలు మివ్వడలై త్తణ్ వాడై,**

**శోరా మఱుక్కుమ్ వకై యతియేన్, శూర్ల్కుఴలా**

తిరుగుచున్నాను, తణ్ వాడై = చల్లనిగాలి, ఇ ఉడలై ఈరా పుకుదలుమ్ = (నా) ఈ శరీరమును బ్రద్ధలు చేయుచు,లోపలకు ప్రవేశించి, శోరా మఱుక్కుమ్ = మోహింపజేయుచు, దుఃఖమును కల్గించుచున్నది, వకై ఆఱియేన్ = (ఇది) బాధించు విధములను వివరించు రీతిని తెలియలేను,

అణ్ పెణ్ణానపడి. (పితగ్ర్రా) పెణ్ణాన తన్మైయై త్తాను మిఴన్దపడి. (తిరితరువన్ పిన్నైయుమ్) పిన్నైయుమ్ అడక్కమ్ కుడిపోనాల్ నశిక్కవితే కణ్డతు. అప్పడి చ్చెయ్యాతే యాతనాశరీరమ్బోలే పిన్నైయుమ్ తిరిన్దేన్. (ఈరా ప్పుకుతలుమ్) పుకున్దు ఈరుకిఱతిల్లై; ఈర్న్దుకొణ్డు పుకురానిన్టతు. (ఇవ్వుడలై) పణ్డే తొట్టార్మేలే దోషమామ్బడి విరహత్తాశైయాన ఉడలై యెన్నుతల్; పిరివుక్కు చ్చిళైయాత ఉడమ్బెన్నుతల్. (తణ్ వాడై) నఞ్జూట్టిన ఆయుధమ్బోలే కుళిర్త్తియై యుడైత్తాన వాడై. (శోరా మఱుక్కుమ్)శోరవుమ్ పణ్ణా నిన్టతు. మఱుక్కవుమ్ పణ్ణానిన్టదు (వకై యఱియేన్) తిరళ శోరప్పణ్ణానిన్ట తెన్టు శొల్లు మిత్తనై యొఴ్రియ, శెయ్కిఱ వకైకళ్ పేచ్చుక్కు నిల మల్ల.

ధరింపవీలుకాదు కదా! **(పేరా)** – రూపుమారినది . మగరూపము ఆడరూపమును పొందినది. తిరుమఙ్గైయాఴ్వార్లు అను మగరూపము పోయి, పరకాలనాయకి అను ఆడరూపమును పొందితిని అని భావము. **(పిదగ్ర్రా)** స్త్రీ స్వభావమగు అణకువ పోయి, వదరుటను (జల్పించుటను) ప్రారంభించితిని. **(తిరితరువన్ పిన్నైయుమ్)** స్త్రీకి సహజమైన అణకువను కోల్పోయిన పిమ్మట మరణించుటయే మేలుకదా ! అట్లుకూడ చేయక, నరకానుభవమును పొందుటకు ఎత్తు యాతనాశరీరమువలె విడుచుటకు వీలుకానిదియై, బాధను కల్గించునది అగు శరీరముతో అణకువను కోల్పోయిన పిమ్మటకూడ ప్రాణములను ధరించితిని. **(ఈరా ప్పుకుదలుమ్)** – వేడిగాలి ప్రవేశించి, పిమ్మట శరీరమును బ్రద్దలు చేసినను కొంచెముసేపు దుఃఖము లేకుండనుండవచ్చును కదా ! అందులకుకూడ అవకాశములేకుండునట్లు ప్రవేశించునపుడే శరీరమును బ్రద్దలుచేసికొనుచు ప్రవేశించినది. **(ఇవ్వుడలై)** – పూర్వమే తాకినవారిపై చంపిన దోషము ఏర్పడునట్లు విరహముచే మిక్కిలి కృశించియున్నదను ఈ శరీరమును – అని అర్థము. లేక, అతనిని విశ్లేషించిన పిమ్మట మరణింపవలసియుండగా, విశ్లేషమునకుకూడ ముగియని ఈ దేహమునకు ఈ దండన తగినదియే ననియు అర్థము. **(తణ్ వాడై)** – దక్షిణదిక్కునుండి వీచు ఈ చల్లనిగాలి సహజముగానే చల్లనిదియై, విరహతాపముచే వేగుచున్న వారికి అసహ్యమైన (సహింపరాని) ఆయుధమువలె నుండును. అది ఇంకను చల్లదనమును కల్గినదియై, విషము పూసిన ఆయుధమువలె మిక్కిలి బాధించుచున్నది. **(శోరా మఱుక్కుమ్)** – మూర్ఛను పొందించుచున్నది. తెలివి వచ్చినపుడు బాధించుచున్నది. **(వకై యఱియేన్)** – మైకమును పొందించుచున్నది, బాధించుచున్నది –



**రారాను మేశువరెన్ను మతిన్ పఴ్రియై,**

**వారామల్ కాప్పతఱ్కు వాళా విరున్దొఴ్రిన్దేన్,**

శూర్ల్ కుఴలార్ ఆరానుమ్ = దట్టమైన కురులనుకల్గిన స్త్రీలు ఎవరైనను, ఏశువర్ ఎన్నుమదన్ పఴ్రియై = నిందింతురు అనుదాని వలన కల్గు అపవాదు, వారామల్ కాప్పదర్క్కు = రాకుండ అడ్డుకొనుటకొఱకే, వాళా ఇరునొఴ్రిన్దేన్ = (ఇంతవరకు) ఏమియు చేయుకుండనుంటిని,

(శూర్ల్ కుఴలార్ ) వాడై ఉడమ్బిలే పట్టాలుమ్ మయిర్ముడియుమ్, అఴకుమ్ కులైయాతే యిరుక్కుమవర్కళ్. (ఆరానుమ్) ఎన్ శెయల్ పొల్లాతెన్టు ఇరుక్కక్కడవారిల్లై; ఎఙ్గేనుమ్ శిలవరెన్నై. అవ్యుత్పన్నరుమాయ్, అవ్యపదేశ్యరుమా యిరుప్పార్ శిలరెన్నై. (ఏశువరెన్నుమతన్పఴ్రియై) అవర్కళ్ అలర్తూగ్ర్ర అత్తాల్ వరుమ్ పఴ్రియై. ఇవళాగ్ర్రామైక్కు అవ నుతవినపడి పొల్లా తెన్నుతల్; అవన్ పిరిన్దిరున్దాల్ ఇవళాఱియిరాతే ఇఙ్జనే పడుకిఱతెన్? ఎన్నుతల్ శెయ్వర్కళిఱే. (వారామల్ కాప్పతఱ్కు) అవన్ స్వరూపత్తుక్కుమ్, నమ్ స్వరూపత్తుక్కుమ్ నిఱక్కేడు వారామైక్కు, (వాళా విరున్దొఴ్రిన్దేన్) కునియ క్కుఱుణి పగ్ర్రుకిఱ కాలత్తిలే, ఇరణ్డు మరుఙ్గుమ్ మనిశర్ కాణ మడలైక్కొణ్డు

అని మొత్తముమీద చెప్పవలెనే కాని, ఈ రీతిలో మోహమును, దుఃఖమును పొందించుచున్నదని వివరించి చెప్పుటకు వీలులేదు. **(శూర్ల్ కుఴలార్)** – ఈ చల్లనిగాలి శరీరమున సోకినను కేశపాశముయొక్క అందము చెడకుండనుండునట్టి భాగ్యవతులు అని అర్థము. ఇతనిపట్ల ప్రేమవిరహవ్యథను పడనివారు అనియు అర్థము. **(ఆరానుమ్)** – నా ఈ గొప్పకార్యమును తప్పు అని తలచువారు నాకు తెలిసిన వారిలో ఎవరును లేరు. నాకు తెలియనివారిలో ఎచటనైనను ఒకరు ఉండవచ్చును కదా ! వారు జ్ఞానహీనులు, అవ్యవదేశ్యులును – అని అర్థము. **(ఏశువరెన్నుమదన్ పఴ్రియే)** – వారు నాయకుని, నాయకి యగు ఈమెను నిందింపగా, దానిచే వచ్చు అపవాదమును. "ఈమె ఇట్లు విరహాతిశయమును అనుభవించునపుడు అతడు సహాయపడుట గొప్పగానున్నది." అని అతనిని, "అతడు విశ్లేషించినచో, ఈమె సహింపవలసియుండగా, ఇట్లు బాధపడవచ్చునా" అని ఈమెను నిందింతురు కదా !

**(వారామల్ కాప్పదఱ్కు)** ఇట్లు అతని గొప్పతనమునకు (పరత్వమునకు) , మన నైచ్యమునకును తక్కువదనము కలుగకుండుటకు అని భావము. **(వాళా విరు న్దొఴ్రిన్దేన్)** – శరీరము నొప్పిపుట్టునట్లు ధాన్యపుగుత్తులను కోయవలసిన అవసరము లేకుండ, ఒక్కసారి వంగినచో, ఒక మూట (కుఱుణి) ధాన్యము దొరుకునట్టికాలమున నిరాహారముగా నుండునట్లు, అవతరించి అందఱికిని సులభుడై, కుంభనృత్యమును ఆడినసమయములో మాటలాడకుండ ఉంటిని. అతడు దారినడుమ నాట్యమాడుటను దారికి రెండు వైపుల నిలచి, మనుజులు చూచు రీతిలో మడల్ ఎక్కి బయలుదేరకుండ , ఏమి అపవాదువచ్చునో ! ఏమో ! అను భయముతో శ్లాఘ్యమైన కాలమును పాడుచేసితిని.

**వారాయ్ మడనెఞ్జే వన్దు, మణివణ్ణన్**
**శీరార్ తిరుత్తుళ్ళాయ్ మాలై నమక్కరుళి**

మడనెఞ్జే = మూఢమనస్సా! వారాయ్ = (దూతగా పోవుటకు) రమ్ము, వన్దు = ఆ భగవానునివద్దకు పోయి, మణివణ్ణన్ = నీలమణివంటి శరీరమునుకల ఆ స్వామి, నమక్కు అరుళి = మనపై కృపను చూపి, శీర్ ఆర్ తిరు త్తుళ్ళాయ్ మాలై = గొప్పదైన తులసీమాలను,

పుఱప్పడప్పెఱాతే అరుమన్దకాలత్తై ప్పోగ్గ్రేపోక్కినేన్.

(వారాయ్) ఎళ్లున్దిరాయ్. (మడనెఞ్జే) ఇప్పోతు, "భవ్యమాన నెఞ్జే" యెన్గిఱతన్ఱు; అఱివు మాణ్డు కిడక్కిఱ నెఞ్జే! ఎన్ఱపడి. అవనై నోక్కి యెల్లాముణ్డాయిఱ్ఱిఱే, ఎళ్లున్దిరాయ్. (వన్దు) శెన్ఱెన్ఱపడి. వరవు శెలవై క్కాట్టుమిఱే. అవన్పక్కలిలే శెన్ఱు.

(మణివణ్ణన్) తన్నై ప్పిరిన్దార్ మడలెడుక్కుమ్పడి పణ్ణవల్ల వడివు పడైత్తవన్. (శీరార్ తిరుత్తుళ్ళాయ్మాలై నమక్కరుళి) అనన్యప్రయోజన రిట్టమాలై. "మిక్క శీర్ త్తొణ్డర్" ప్రయోజనాన్తరపరరిట్టతాకిల్ అవర్కళ్ నెఞ్జిల్ అభిసన్ధియాలే శురుళ్ నాఱు మెన్నై. (నమక్కరుళి) ప్రణయిత్వమ్ పోయిఱ్ఱిఱే నమ్మాఱ్ఱామై క్కుతవాతపోతే, ఇని కృపై

**(వారాయ్)** – ఇకపై అయినను లెమ్ము. **(మడనెఞ్జే)** విశ్లేషించి, చేష్టలుడిగిన ఈ మనస్సును "అణకువను కల నాకు భవ్యమైన మనసా !" అని సంబోధించుట పొసగదు. కావున "జ్ఞానహీనమైన మనసా !" అని పిలుచుచున్నట్లు అర్థము చెప్పవలెను. అతని స్వరూపమునకు తక్కువదనము రాకూడదని చూచి, మనము పడవలసినదంతయు పడి అయినది. ఇకపై అయినను లెమ్ము. **(వన్దు)** వెడలి అని అర్థము. (**"వన్దు"** అను పదము వెడలి అను అర్థమును ఎట్లు తెలుపును, అనగా ఒకచోటికి వచ్చుట వేరొక చోటినుండి పోవుటను తెలుపునుకదా ! తానుండవలసిన చోటు అతడుండు చోటే కావున అచటకు పోవుటయును ఈమెకు వచ్చుటయే అగును. **(మణివణ్ణన్)** తనను విశ్లేషించినవారిని మడల్ అనుష్ఠించునట్లు చేయగల్గిన తిరుమేనిని కల్గినవాడు. **(శీరార్ తిరుత్తుళ్ళాయ్ మాలై)** వేఱొక ఫలము ఆశింపని పెద్దలు సమర్పించిన మాల కావున అతిశయము మించియున్న తులసీమాల . **"మిక్క శీర్ తొణ్డరిట్ట పూన్దుళ్ళవిన్ వాశమే"** (పెరియతిరు - 11-1-9) (అనన్య ప్రయోజనులగు దాసులు సమర్పించిన తులసీమాల సువాసన.) అనునట్లు అనన్యప్రయోజనులు (భగవానుడను ప్రయోజనమును తప్పవేరు ప్రయోజనమును ఆశింపనివారు) సమర్పించిన తులసీమాల, నిత్యసూరులు సమర్పించు **"శూట్టు నన్మాలై"** (తిరువిరు -21) వలె విలక్షణమైన పరిమళమును కల్గినదియైయుండును. **"కామాత్మానః"** (గీత) అనబడు ప్రయోజనాంతపరులు సమర్పించునది వారి మనస్సులో ఫలాభిసంధి అను (అన్యఫలములలో కోఱిక అనెడి ) అగ్నిస్పర్శచే కములుకంపు కొట్టును. **"అహంకారమ్ అగ్నిస్పర్శమ్పోలే"** (శ్రీవచన -181), **"శుఱు నాఱాద పూ"** (శ్రీవచన -287) అను శ్రీవచన భూషణ సూత్రములను గమనింపనగును.

**(నమక్కు అరుళి)** నాతో కలసియుండి, పరమప్రణయియైయున్న స్థితిలోనే నేను వలదన్నను



**త్తారాన్ తరు మెన్ఱిరణ్డత్తి లొన్ఱతనై,**
**ఆరా నుమొన్నాతార్ కేళామే శొన్నక్కాల్,**
**ఆరాయుమేలుమ్ పణి కేట్టతన్ఱెనిలుమ్,**

తరుమ్ తారాన్ ఎన్ఱ ఇరణ్డత్తిల్ ఒన్ఱతనై = ఇచ్చెదను, ఇవ్వను అను రెండు మాటలలో ఏదో ఒక మాటను (అతడు పల్కునది), ఒన్నాతార్ ఆరానుమ్ కేళామే శొన్నక్కాల్ = అతనిని ద్వేషించువారెవ్వరును వినకుండునట్లు నీవు చెప్పినచో, పణి కేట్టు = ఆ వార్తను విని, ఆరాయుమేలుమ్ = (ప్రేమతో) విచారించినను సరియే, అదు అన్ఱు ఎనినుమ్ = ఆమెను గూర్చియే

పణ్ణిలుణ్డిత్తనైయిఱే. (తారాన్ తరువెన్ఱిరణ్డత్తి లొన్ఱతనై) తరిలువామ్ ; తారాతొళ్ళియిలుమామ్, ఇరణ్డిలొన్ఱు అమైయుమ్ నమక్కు, అతావతు-తన్దానాకిల్ అత్తాలే ధరిక్కిఱోమ్; ఇల్లైయాకిల్ ముడిన్దు పిళ్ళైక్కిఱోమ్. (ఆరాను మొన్ఱాతార్ కేళామే శొన్నక్కాల్) అవన్గుణత్తై యళ్ళిక్క విరుప్పారుణ్డు, అవర్కళ్ కేళామే శెవియిలే యవనుక్కుచ్చొల్లు. అవనై యళ్ళిత్తు ఇవళ్ మడలెడుత్తుప్పుక్కపడి; అవనై యుకవాతార్ కేళామే యెన్గిఱాళిఱే. (ఆరాయుమేలుమ్ పణికేట్టు) ఉన్నై క్కణ్డపోతే "అవళెన్బట్టాళ్? అవలుళళే ?

నిర్బంధించి, నాకు తన మాలను అతడు ఇచ్చును. నన్ను విశ్లేషించి, నా విరహమును చూచియు నాకు సహాయపడనపుడే అతని ప్రణయిత్వము పోయినది. అందుచే, ప్రణయ భావముతో కాక మనస్సు కఱగి ఇచ్చినచో, ఒక వేళ ఇవ్వవచ్చును.

**(తారాన్ తరుమెన్ఱిరణ్డిత్తి లొన్ఱదనై)** – పూర్వస్థితిని తలచి కృపజేసి, ఇచ్చినను సరియే, స్వాతంత్ర్యముతో ఇవ్వకున్నను సరియే. రెండిటిలో ఏదో ఒక దానిని తెలిసికొనివచ్చి నీవు చెప్పిన చాలును. అనగా –మాలను ఇచ్చిన వాడైనచో, దానివలన ప్రాణములు నిలుపుకొందుము. లేనిచో ప్రాణములను వీడి, దుఃఖమును పూర్తిగా అనుభవించెదము. **(ఆరాను మొన్నాదార్ కేళామే శొన్నక్కాల్)** అయినచో అతనిని అడుగునపుడు నీవు ఒక విషయములో జాగ్రత్తగా ఉండవలయును. అది ఏమనగా – అతని గుణములను పాడుచేయు విరోధులు అనేకులు కలరు. వారు వినకుండ చెవిలో నీవు చెప్పుము. అతని స్వరూపగుణ విభూతులను నశింపచేసి, మడల్ ఎత్తబోవు స్థితిలో నున్న ఈమె, ఈ స్థితిలో కూడ "అతని విరోధులు వినకుండునట్లు చెప్పుము" అని ప్రేమ భాసించురీతిలో పల్కు తీరును చూడుడు. విరహముచే స్వరూపమును నశింపజేసికొని, మడల్ను అనుష్ఠించునపుడుకూడ స్వరూపము వ్యక్తమగుచున్నది. భక్తియే కదా ఈ ఆళ్వార్ల స్వరూపము. **(ఒన్నాదార్ – ఒనఱాదార్ – తమ్మోడు మనమ్ పొరున్దాదవర్, ఎనవే పకైవరావర్. ఒన్నాదార్ – ఒనఱాదార్** – తమతో మనస్సు కలువనివారు కావున పగవారు. – దివ్యార్థ) **(ఆరాయుమేలుమ్ పణికేట్టు)** "నన్ను చూచినపుడే ఆమె ఏమి పాట్లు పడినది ! ఆమె ఇంకను ప్రాణములతో ఉన్నదా ! ప్రాణములతో ఉన్నను, వికాసము పోగొట్టుకొని, ధర్మిమాత్రమై ఉండియుండుననుట తథ్యము. నేను పోయి,

**పోరాతొ్ౙియాతే పోన్దిడు నీ యెన్తేఱ్కు,**

నాకు తెలియదు అని తిరస్కరించినను సరియే, నీ పోరాదొ్ౙియాడే పోన్దిడు = నీవు ఇచటికి రాకుండ, అచటనే ఉండవద్దు, వెంటనే వచ్చి చేరుము, ఎన్తేఱ్కు = అని పల్కిన నా మాటకు

అవ్వాశ్రయమ్ ఇన్నుమ్ నమక్కు క్కిడైక్కుమో?'' ఎన్ఱు తిరువుళ్ళమానానేయాకిలుమ్. (అతన్దైనిలుమ్) అజ్ఞనన్దియే దుష్యన్తనైప్పోలే, ''నామ్ అజ్ఞనైక్కొ ప్పాళొరుత్తియై అఱియోమే'' యెన్దానాకిలుమ్.

(పోరా తోర్ౙియాతే) అఱిన్దిలేనెన్దాల్ అవన్ తిరువుళ్ళత్తుక్కేఱ వఱివిత్తు మఱుమార్ౙ జ్ఞొణ్డు పోరవేణు మెన్ఱు నిల్లాతే. (పోన్దిడు నీ) ఎన్నార్ౙ్రామై కణ్ణుమ్ మఱన్దవనైప్పోలన్దియే, నీ పోన్దిడు. (పోరాతొ్ౙియాతే పోన్దిడు నీ యెన్తేఱ్కు) నాన్దానేకిడీర్ ఇన్నెఞ్జతన్నై యజ్ఞే తఙ్గప్పణ్ణినేన్. అతావతెన్ ? ఎన్నిల్; పెరుఙ్కుడి, పుతుక్కుడిమకనై పఴైయ పైయలైప్పోలే వరమ్బిలుమ్ , వాయ్క్కాలిలుమ్ శూడు పొకడాతేకొళ్ ఎన్నుమతువే యడియాక, అవ్విడఙ్గళాకాతే కళవుక్కు స్థానమెన్ఱు శెయ్యానిఱ్కుమ్, ''పోరాతొ్ౙియాతే పోన్దిడు నీ'' ఎన్తేన్ నాన్. అవ్విషయత్తై క్కణ్డాల్ పోరాతొ్ౙియవాకాతే యడుప్పతెన్ఱు అతు అఙ్గే నిన్ఱతు.

కలియునంత వరకు ఆ ధర్మి నిలచియుండునా ? దానిని నేను పొందగలనా?'' అని అడిగినను, నీవు దానిని బాగుగా విని నా స్థితిని తెలుపుము. **''ఆరాయుమ్ మేలుమ్ కేట్టు ప్పణి''** అని అన్వయము. లేక, **(పణికేట్టు ఆరాయుమేలుమ్)** – అని అన్వయించి ''నేను నీ మూలముగా పల్కు మాటను విని విచారించినచో'' అనియును అర్థమును చెప్పవచ్చును.

**(అదన్దైనిలుమ్)** – అట్లు విచారింపకుండ దుష్యంతునివలె ''నేను ఆ విధముగా ఒకతెను చూచినవాడను కాను'' అనినను అని అర్థము. **''పణి''** అనునది మొదటి నిర్వాహములో రెండుచోట్ల కలుపుకొనవలెను. అతడు ఏది పల్కినను నీవు పలుకవలసిన దానిని పలుకుము – అని భావము. **(పోరాదొ్ౙియాతే)** – ''నేను తెలియను'' అన్నను అతని మనస్సులో పడునట్లు తెలియజేసి, సమాధానమును తెలిసికొనవలెను – అని తలచి అచటనే నిలచియుండకుండ. **(పోన్దిడి నీ)** నా విరహమును చూచియు మఱచిన దానివలె కాకుండ నీవయినను తిరిగిరమ్ము. **(పోరాదొ్ౙియాతే పోన్దిడి నీ ఎన్తేఱ్కు)** నేను ఈ పరమపాపిష్ఠి చిత్తమునకు దారి చూపి, అచటనే నిలచియుండునట్లు చేసితిని. ''నిలచియుండకుమా !'' అని నేను పల్కినదానినే పట్టుకొని, ''నిలచియున్నచో లాభమున్నది అని తలచి నిలచిపోయినది.ఇది ఏవిధముగా నున్నది? అన్నచో, ఒక ఊరిలో క్షేత్రమున్న గొప్ప ధనికుడొకడు, తన రైతు ధాన్యపు కంకులను గట్టుపైన, పిల్ల కాలువలలోను దొంగతనముగా దాచియుంచి తీసికొని పోవుటను తెలిసికొని, అతనిని పని నుండి తొలగించి, కొత్తరైతును పనికి అమర్చి, ''నీవుకూడ పాత కుఱ్ఱవానివలె గట్టుపై, బోదెలతో (పిల్లకాలువలలో) ధాన్యపు గుత్తలను తీసి దాచియుంచకూడదుసుమా !'' అని పల్కినచో, ఆ మాటలోని భావమును



**క్కారార్ కడల్వణ్ణన్ పిన్పోన నెఞ్జముమ్,**
**వారాతే యెన్నై మఱన్దతుతాన్, వల్వినైయేన్**
**ఊరారుకప్పతే యాయినేన్, మగ్ౙినక్కి**

అంగీకరించి, కార్ ఆర్ కడల్ వణ్ణన్ పిన్ పోన నెఞ్జముమ్ = నల్లని సముద్రవర్ణునివద్దకు పోయిన నా మనస్సుకూడ, వారాదే = తిరిగి రాకుండ, ఎన్నై మఱన్దదుదాన్ = నన్ను మఱచిపోయినది కదా !, వల్ వినైయేన్ = క్రూర పాపములను చేసిన దానను, ఊరార్ ఉకప్పతే ఆయినేన్ = ఊరిలోనివారు ఆనందించు రీతిలోనే శిథిలను అయితిని, ఎనక్కు ఇఙ్గు

(కారార్ కడల్వణ్ణన్ పిన్పోన నెఞ్జముమ్ వారాతే ఎన్నై మఱన్దతు) ఎన్నార్ౙ్రామై కణ్డు, కణ్ణుమ్ కణ్ణీరుమాయ్ ప్పోన నెఞ్జు అవనై క్కణ్డవాఱే అవన్వడివఴకిలే తువక్కుణ్డు ఎన్నై మఱన్దతు. (కడల్వణ్ణన్ పిన్ పోన నెఞ్జముమ్ వారాతే యెన్నై మఱన్దతు) ''రామం మేఽనుగతా దృష్టిః'' ఇత్యాదివత్. (వల్వినైయేన్) ఎన్నెఞ్జమ్ ఎనక్కు తవాతపడి యాన మహాపాపాత్తై ప్పణ్ణినేన్. (ఊరారుకప్పతే యాయినేన్) తఙ్గళభిమతసిద్ధి, సాధనానుష్ఠానత్తాలే ఎన్దిరుక్కుమవర్కళైప్పోలే ఎన్నభిమతత్తుక్కుమ్ నాన్ ఉత్సాహిక్కుమ్పడియానేన్.

అతడు తెలిసికొని, ''గట్టుపైన, పిల్లకాలువలోను దాచియుంచకుండ నేను దొంగతనమును చేయుటకు తగిన దారి ఏది?'' అని ఆలోచించి, తెలిసికొని, పూర్వపురైతువలె కొత్త రైతుకూడ దొంగతనమును చేయుట ప్రారంభించును. అట్లే , ఈ మనస్సుకూడ, ''దర్శించినచో తిరిగి రాదగిన విషయము కాదు భగవద్విషయము '' అని గ్రహించి, అచటనే నిలచిపోయినది. వ్యాఖ్యానములో **పెరుఙ్కుడి** అనగా భూమి సొంతదారుడు, **పుదుక్కుడిమకన్** – కొత్తరైతు, **పఴైయ పైయల్** – పూర్వపు రైతు, **కూడు** – ధాన్యపు గుత్తుల రాశి)

**(కారార్ కడల్ వణ్ణన్ పిన్పోన నెఞ్జముమ్ వారాదే ఎన్నై మత్తైన్దదు)** నా విరహాసహిష్ణుతను చూచి కన్నీరు విడచిన నామనస్సు, అతనిని చూచిన వెంటనే ఆ సముద్రవర్ణుని దేహసౌందర్యములో అభినివిష్టయై, నన్నే మఱచినది. (ఇచట వణ్ణ శబ్దమునకు స్వభావము అని అర్థము.)

**(కడల్వణ్ణన్ పిన్పోన నెఞ్జముమ్ వారాదే ఎన్నై మత్తైన్దదు)** – సముద్రము స్వీకరించిన వస్తువు తిరిగివచ్చునా ! **''రామం మేఽనుగతా దృష్టిః ''** (రాముని నా నేత్రము వెంబడించినది) (రా.అ.-42-34) అని దశరథుడు పల్కెను కదా !

**(వల్వినైయేన్)** – నా మనస్సు నాకు సహాయపడనట్టి మహాపాపమును చేసితిని. **''మత్పాప మేవాత్ర నిమిత్త మాసీత్''** (నా పాపమే రాముడు వనములకు పోవుటకు కారణమైనది) **''మమైవ దుష్కృతం కించిత్ మహ దస్తి''** (నా గొప్ప పాపమొకటి కలదు) అను సీతాదేవి వలె తననుగూర్చి నొచ్చుకొనుచున్నది పరకాలనాయిక.

**(ఊరార్ ఉకప్పదే ఆయినేన్)** ''తాము కోఱినది పొందుటకు దానికి తగిన ఉపాయములను

## జ్గారాయ్‌వారిల్లై యఖ్లల్వాయ్ మెఝుకుపోల్,
## నీరా యురుకు మెన్నావి, నెడుజ్కణ్గళ్

మగ్ఱు= ఇచ్చుట నాకు వేఱెవ్వరును, ఆరాయ్ వార్ ఇల్లై = మాటసహాయముగా నుండువారు లేరు, ఎన్ ఆవి = నా ఆత్మ, అఖల్ వాయ్ మెఝుకుపోల్ = అగ్ని సమీపములోని మైనమువలె, నీర్ ఆయ్ ఉరుకుమ్ = నీరై కఱగుచున్నది. నెడుమ్ కణ్‌గళ్‌తాన్ = (నా) విశాల నేత్రములును,

ఊరార్‌వార్తై "అవనాలే పేఱు ఎన్దిరున్ద వివళ్ కణ్డాయే యుణ్డపడి. ఇవళైప్పోలే యుణ్ణుమత్తనై అవన్ కైపార్‌త్తిరున్దవర్‌కళ్" ఎన్బర్‌కళే యవర్‌కళ్.

ఇప్పడి ఆగ్ఱామై మిక్కాల్ శిల పేరోడే యుశావి ధరిక్క వేణ్డావో? వెన్నిల్ ; (మగ్ఱైనక్కిజ్గారాయ్‌వారిల్లై) ఎన్నెఞ్జ మెనక్కుతవాతిరుక్క, వేఱెనక్కు ఉశాత్తుణై యుణ్డో? "మగ్ఱిల్లై" ఎన్గైయాలే, ఇన్నుముమ్ అవనే వన్దు ఆరాయిల్ ఆరాయు మత్తనై యెన్గై. "అవ్వరుళల్లన వరుళు మల్ల" ఎన్డుమ్, "వైయకత్తు ప్పల్లారరుళుమ్ పఝుతు" ఎన్డుమితే యివర్‌కళ్‌తాజ్గళఱుతియిట్టిరుప్పతు. (అఖల్వాయ్ మెఝుంకుపోల్ నీరా యురుకుమెన్నావి) నెఞ్జ ఉతవాతు ఎన్నలామో ? నెఞ్జై ప్పిడిత్తు ధరిత్తిరుక్క వేణ్డావో? వెన్నిల్; అగ్నిసకాశత్తిలే మెఝుకుపోలే ఇగ్ఱుప్పోకానిన్దతు ఎన్నుడైయ ఆత్మవస్తు.

అనుష్ఠించియే తీరవలెను" అని తలచినవారు కోఱినట్లు, నేను కోఱినది పొందుటకు నేను ప్రయత్నించు స్థితిని పొందితిని. **"ఊరార్"** అను పదము ఈమె పట్ల ఆదరము లేని వారిని తెలుపుచున్నది. "అన్నిటికిని భగవానుడే ఉపాయము, నేను అనుష్ఠించునది ఏదియు అతనిని పొందుటకు ఉపాయము కాదు." అని పూర్వమంతయు ఈమె పల్కును. ఈమెను దెబ్బతీయు సమయము ఎపుడు వచ్చునా అని ఎదురుచూచినవారు ఇపుడు – "అతని వలననే ఫలమును పొందవలెను" అని తలచిన ఈమె అనుభవించుస్థితిని చూచితిరా ! అతడే ఉపాయము" అని తలచిన వారందఱును ఇట్లే అనుభవింపవలెను. వారును మా దరికి తిరిగి వచ్చితీరుదురు". అని తమ ఆశతీరునట్లు పల్కు స్థితిని పొందితిని.

ఇట్లు విరహాసహిష్ణుత అతిశయించుటచే కొందఱితో మాటలను పల్కి, ప్రాణములను ధరింపకూడదా ! అనినచో, **(మగ్ఱైనక్కిజ్ఞు ఆరాయ్‌వారిల్లై)** – నా మనస్సే నాకు సహాయపడనపుడు వేఱొక మాటసహాయము ఇచట ఎవరు కలరు ? **"మగ్ఱు ఇల్లై"** అనుటచే, "ఇంకపై అతడే వచ్చి, నా కొఱతను విచారించినచో గతి కలదు, లేనిచో వేఱుగతి లేదు" అనినట్లు అయినది. **"అవ్వరుళల్లన అరుళుమల్ల"** (తిరువాయ్ –9–9–6) (వాని అనుగ్రహము కానిది అనుగ్రహమేకాదు.) అనియు, **"వైయకత్తు ప్పల్లార్ అరుళుమ్ పఝుదు"** (ముదల్ తిరు –15) (భూమిలోని పలువురి కృపకూడ నిరర్థకము.) అని కదా ఈ ఆళ్వార్లు నిర్ణయించిరి. **(అఖల్‌వాయ్ మెఝుకుపోల్ నీరా యురుకు మెన్నావి)** – సహాయకులు కానివారివలె "నా మనస్సు నాకు సహాయము చేయలేదు" అని పలుకవచ్చునా ? మనస్సును బలాత్కారముగా



## ఊరా రుఱజ్గిలుమ్ తానుఱజ్గా, ఉత్తమన్దన్

ఊరార్ ఉఱజ్గిలుమ్ తాన్ ఉఱజ్గా = ఊరిలోని వారు నిద్రించినను, (తాను) నిద్రింపదు, ఉత్తమన్ = ఆ పురుషోత్తముని, పేర్ ఆయినవే = తిరునామములైనవానినే, పిదగ్ఱువన్ =

(నెడుజ్కణ్గళూరారుఱజ్గిలుమ్ తా నుఱజ్గా) ఇప్పడి అగ్ఱామై విళైన్దతాకిల్ నిద్రైయాలే అత్తై ప్పోక్కినాలో? వెన్నిల్; "ఆయు మమరులకుమ్ తుఞ్జిలుమ్" ఎన్గిఱపడియే ఎల్లారు ముఱజ్గిలుమ్ ఎన్‌కణ్గ ళుఱజ్గుకిఱతిల్లై. (నెడుమ్ కణ్గళ్) కణ్ణిల్ పరప్పెల్లామ్ తలైచ్చుమైయాయిగ్ఱు. "సితేక్షణై"యిఱే. (ఊరారుఱుజ్గిలుమ్ తానుఱజ్గా) "ఊరుమ్ నాడు ములకముమ్ తన్నైప్పోల్" ఎన్డు ఇవళ్ పిఱన్దఊరిలే యుఱజ్గ యఱివారు మిల్లైయిఱే. ఇప్పడి యిరుక్కిఱ అవర్‌కళుఱజ్గిలుమ్ ఎన్‌కణ్గళుఱజ్గా వెన్గిఱాళ్.(ఉత్తమన్) ఉఱక్క మఱుమ్బడి తన్ తాగ్ఱ్చియై క్కాట్టి యకప్పడుత్తిన మేన్మైయై యుడైయవన్.

పట్టుకొని నిలిపి, ధరింపవలెను కదా ! అన్నచో, "నిప్పుముందు మైనమువలె ఈ విరహవేదనచే నా ఆత్మ కఱగిపోవునపుడు నేనెట్లు మనస్సును బలాత్కరించి పట్టుకొనియుండగలను?" – అని భావము.

**(నెడుజ్కణ్‌గళ్ ఊరారుఱజ్గిలుమ్ తానుఱజ్గా)** ఇట్లు విరహాసహిష్ణుత్వము ఏర్పడినచో నిద్రతో దానిని మఱచిపోవచ్చును కదా ! అన్నచో, **"ఆయుమ్ అమరులకుమ్ తుఞ్జిలుమ్ నీ తుఞ్జాయాల్"** (తిరువాయ్ –2–1–1) (అయ్యో! నీతల్లి, నిత్యసూరులు నిద్రించినను నీవు నిద్రించుటలేదు.) అనునట్లు నిద్రపోకుండ సదాదర్శనమును చేయు దేవతలు నిద్రించినను, నా కన్నులు నిద్రపోలేదు. **(నెడుమ్ కణ్‌గళ్)** – అతనిని బంధించుటకు కారణమైయున్న కన్నుల వైశాల్యమంతయు నా శిరోభారమునకు కారణమైనది. **"అసితేక్షణా"** (రా.సు.–16–5) (నల్లని కన్నులనుకల సీతాదేవి) అనునట్లు, కలసియున్నపుడు భగవానుని సైతము అభినివిష్టుని చేయగల కన్నులుకదా ఈమె కన్నులు . **(ఊరారుఱజ్గిలుమ్ తానుఱజ్గా)** – **"తొల్లైమాలై కణ్ణార క్కణ్డు కఖివదోర్ కాదలుగ్ఱార్‌క్కుమ్ ఉణ్డో కణ్‌గళ్ తుఞ్జుదలే"** (తిరువిరు – 97) (అనాదియైన వాత్సల్యము నా కల స్వామిని కన్నులార దర్శించి, కాలమునా గడువు, అద్వితీయభక్తినికలవారికి కంటికి కునుకు ఉండునా!) అనునట్లు ఈమె కంటికి నిద్ర లేదు అనుట సిద్ధము. **"ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్"** (తిరువాయ్ – 6–7–2) అనునట్లు ఈమె పుట్టిన ఊరిలో నున్నవారును నిద్ర తెలియనివారే. వారు నిద్రించినను నా కన్నులు నిద్రింపవు అనుచున్నది పరకాలనాయిక.

**(ఉత్తమన్)** – సౌలభ్యమను గొప్పతనమును కలవాడు. నా నిద్రపోవునట్లు తన సౌలభ్యమును చూపి నన్ను వశీకరించుకొన్న గొప్పతనమును కలవాడు. (విపరీతలక్షణద్వారా **"ఉత్తమన్"** అనుటకు ఈ అర్థము చెప్పబడినది)

**పేరాయినవే పితగ్గ్రావన్, పిన్నైయుమ్**
**కారార్ కడల్పోలుమ్ కామత్తరాయినార్,**

నోటికి వచ్చినట్లు వదఱెదను, పిన్నైయుమ్ = మఱియు, కార్ ఆర్ కడల్ పోలుమ్ కామత్తర్ ఆయినార్ = గంభీరమైన సముద్రమువలె అంతులేని కామమునుకలవారు, ఆరే = ఎవరు,

(పేరాయినవే పితగ్గ్రావన్) ఇప్పడి అభిమతకాలత్తిల్ ఉతవాతొఴిన్దాల్ అవనై నినైయాతిరుక్కవిఱే యడుప్పతు, అతు మాట్టాతే అవన్తిరునామఙ్గళై యడైవు కెడ చ్చొల్లానిఙ్ఱన్. (పిన్నైయుమ్) అతుక్కు మేలేయుమ్ శిల హితమ్ శొల్ల.

(కారార్ కడల్పోలుమ్ కామత్తరాయినార్ ఆరే పొల్లామై యతివార్) ఇజ్జన్ శొల్లలామో ? పత్తుమాస మాఱియరున్దిలళో ? శ్రీజనకరాజన్తిరుమకళ్; అప్పడి యిరావిడిల్ పొల్లాతాకాతో ? వెన్నిల్; పేరాఴమాన కడల్పోలే ఆశై కరై పురణ్డు పోరానిఱ్క, పొల్లాఙ్గు శొల్లువర్కళెన్ఱు ఆఱియిరుక్కప్పోమో ? ఆఱియిరున్దవర్కళుక్కు ఆశై యళవుపట్టతా మిత్తనైయిఱే. స్వరూపజ్ఞానత్తాలే ఆఱ్ఱిలామో ? అవ్వడివై క్కాణ వేణుమెన్ఱు మాశై కరైపురణ్డిరుప్పార్క్కు. స్వరూపజ్ఞానత్తాల్ ఆఱ్ఱినారుణ్డాకిల్ అవర్గాశై మట్టమా మిత్తనైయిఱే.

**(పేరాయినవే పిదగ్గ్రావన్)** – ఇట్లు ఆశించినపుడు సహాయపడకపోయినచో అతనిని స్మరింపకపోవుటయే కదా మంచిది. అదియును సాధ్యము కాకుండపోవుటచే అతని తిరునామములను అక్రమముగా వదరెదను. శ్రమలేకుండ చెప్పెదను. అత్యంతభక్తిని కలవారికి **"అత్యంతభక్తియుక్తానాం స శాస్త్రం నైవ చ క్రమః"** అనునట్లు శాస్త్రక్రమానుసారముగా సేవించుట వీలుకాదు కదా !

**(పిన్నైయుమ్)** – దానికి పిమ్మటకూడ అని అర్థము. (ఊరిలోనివారు) కొన్ని మంచిమాటలను పల్కిరి. అనగా –" ఇట్లు విరహాసహిష్ణుతచే నా ప్రయత్నములో అభినివేశమును పొందితిని అని పలుకవచ్చునా ? జానకి విశ్లేషించి పదిమాసములు సహించియుండలేదా ! ఆ విధముగానే నీవును లేకపోయినచో నీ స్వరూపమునకు హాని కలుగునుకదా" అని పల్కిరి. వారికి సమాధానమును పల్కుటకు **"మేలుమ్"** (మఱియు) అని నాయిక ప్రారంభించుచున్నది.

**(కారార్ కడల్ పోలుమ్ కామత్తరాయినార్ ఆరే పొల్లామై అతివార్)** నీరు నిండి, గంభీరముగా నున్న సముద్రమువలె, ఆశ తీరమునునిండి ప్రవహించుచుండగా, "ఊరిలోనివారు నిందింతురు" అని సహించుటకు వీలగునా ! విశ్లేషించి, సహించియున్నవారు ఎవరైననేమి? వారి ప్రేమ నా ప్రేమ కంటె తక్కువ అనియే కదా చెప్పవలెను. చూచువారి కన్నులను, మనస్సును కొల్లగొట్టు శ్రీకృష్ణుని నల్లని రూపమును దర్శింపవలెనను ఆశ అవధిదాటియున్న నావంటి వారికి స్వరూపజ్ఞానముతో సహింపవీలగునా !**"తత్ తస్య సదృశం భవేత్"** (రా.సు. 39–30) (నన్ను తీసికొనిపోవుట అనునది అతనికి తగినది) అతని స్వరూపజ్ఞానముతో సీతాపిరాట్టివంటి వారు భరించిరి అన్నచో, వారి ఆశ నా ఆశకంటె తక్కువది అనికదా నిర్ణయింపవలెను. నేను పల్కునది తప్పు అనుటకు వీలులేదు.



**ఆరే పొల్లామై యతివారతు నిఱ్క,**
**ఆరాను మాతాను మల్లళవళ్ కాణీర్,**
**వారార్ వనములై వాశవతత్తై యెన్ఱు,**
**ఆరానుమ్ శొల్లప్పడువాళ్, అవళున్దన్**

పొల్లామై అతివార్ = లోకాపవాదమును (స్వరూప విరోధమును) తెలియుదురు ?, అదునిఱ్క = అది ఉండనిమ్ము, అవళ్ ఆరానుమ్ ఆదానుమ్ అల్లళ్ కాణీర్ = ఆమె సామాన్యమైనది ఒకతె కాదు (జ్ఞానాధికురాలు), వార్ ఆర్ వనమ్ ములై వాశవదత్తై ఎన్ఱు = కంచుకమును అలంకరించుకొనిన అందమైన స్తనములనుకల వాసవదత్త అను, ఆరానుమ్ శొల్లప్పడు వాళ్ = అందఱిచే పొగడబడు, అవళుమ్ = ఆమెయు, తన్ పేర్ ఆయమ్ ఎల్లామ్ ఒఴియ

(అతు నిఱ్క) ఇని ఇదు నీ త్తుణిన్దు అమైయుమిత్తనై యెన్నవేణ్డా; ఇతుక్కు శిష్టాచారము ముణ్డెన్గై. పఴైయరుమాయ్, విలక్షణరుమాయిరుప్పార్ అనుష్ఠిత్తార్కళెన్గై. (ఆరానుమాతాను మల్లళ్) చైతన్యమ్ కుఱైన్దవళు మల్లళ్; అచిత్కల్పైయుమల్లళ్. (అవళ్ కాణీర్) అవళై క్కేళుఙ్గళ్. (వారార్ వనములై) తన్నాల్ ధరిత్తు. త్తాఙ్గవొణ్ణాత ములై యెన్ఱు పరువమ్ మిక్కిరుక్కిఱపడి శొల్లుకిఱతు. కాన్తన్ తాఙ్గుతల్; అతు పెఱాతపోతు వారాలే ధరిత్తల్ శెయ్యుమిత్తనై. (వాశవతత్తై యెన్ఱు ఆరానుమ్ శొల్లప్పడువాళ్) ప్రసిద్ధైయన్త్తో? విలక్షణరెల్లామ్ కొణ్డాడప్పట్టవళన్త్తో? శ్రీజనకరాజన్తిరుమకళ్ ఓలక్కత్తిలుమ్ "కుఱైవఱ్ఱా ళొరుత్తి" ఎన్ఱు కొణ్డాడప్పడుమవళన్త్తో? (అవళుమ్) ఇత్తుణివు తుణిన్దేన్

**(అదు నిఱ్క)** – "నీవు చేయుటవలన తప్పుకాదు అని చెప్పుటకు వీలు కాదు" అని చెప్పవద్దు. దీనికి సత్పురుషుల ప్రవర్తనకూడ ప్రమాణముగా కలదు. ప్రాచీనులై, గొప్పవారైయున్నవారు ప్రేమకొఱకు స్త్రీత్వమును నశింపజేసికొని, తాము (మడల్ను) అనుష్ఠించి చూపిరి.

**(ఆరానుమాదాను మల్లళ్)** – **"ఆరాను మల్లళ్"** జ్ఞానము తక్కువగానున్న దానను కాదు. **"ఆదాను మల్లళ్"**– అచేతనమువలె జ్ఞానశూన్యురాలను కాదు. **(అవళ్ కాణీర్)** – ఆమె ప్రవర్తనను నేను చెప్పగా వినుడు. **(వారార్ వనములై)** – తనచే దాల్చియుండి, భరింప సాధ్యముకానివియై, కంచుకముతో కట్టి వేయవలసిన స్తనములు – అనుచు పరువము నిండియున్న స్థితి తెలుపబడినది. నాయకుడు అనుభవింపవలెను. అది లేనపుడు కంచుకముతో కట్టివేయవలెను.

**(వాశవదత్తై ఎన్ఱు ఆరానుమ్ శొల్లప్పడువాళ్)** – ఆమె వాసవదత్త మిక్కిలి ప్రసిద్ధురాలుకదా! గొప్పవారందరిచేత కీర్తింపబడునదికదా ! శ్రీజానకీదేవి గోష్ఠిలోకూడ కొఱతలేనిది ఒకతెఈమె అని కీర్తింపబడునట్టిదికదా !

**(అవళుమ్)** – ఇట్లు ప్రేమికుని పొందుటకు క్రమము మీఱి ప్రయత్నించుదానను నేను మాత్రమే కాదు. ఆమెకూడ ఈ నిర్ణయమును తీసికొన్నది కదా !అనుచున్నది. **(తన్**

